# సచిత్ర విచిత్రం



## చట్టం చట్టమే

జార్జ్ జానా (72) అనే బార్బర్ తన దుకాణంలో ఓ పంచ వన్నెల రామచిలుకను ఉంచుతున్నాడు. అతని కస్టమర్స్ దాన్ని చూస్తూ హెయిర్ కటింగ్, షేవింగ్‌లను చేయించుకునేవారు. అయితే 29 ఏళ్ల తరువాత 1995 లో ఓహియో స్టేట్ బోర్డ్ ఆఫ్ బార్బర్ షాప్ ఎగ్జామినర్స్ 'చికో' అనే ఈ చిలుకని షాపులోంచి వెంటనే తొలగించమని, అది అక్కడకు వచ్చేవారి ఆరోగ్యానికి ప్రమాదాన్ని కలగచేస్తోందనీ జార్జ్‌కి నోటీస్ ఇచ్చారు. చేసేది లేక అతను 'చికో' కి వీడ్కోలు పలికి దాన్ని ఓ పెట్ ఏనీమల్స్ అమ్మే దుకాణంలో ఉంచాడు. అయితే అది హాని అంటూ చేస్తే ఎక్కడున్నా చేస్తుంది కదా అనీ, ఇదేం రూలనీ జార్జ్ ఆ బోర్డ్‌కి ఎన్ని ఉత్తరాలు రాసినా ఫలితం శూన్యం. అందుకే కొన్ని చట్టాలు అర్ధంకాక జుట్టు పీక్కోవలసి వస్తోందంటున్నారు కొందరు.

# చతుర కతలు

## తోలు ఇంటర్వ్యూ

"జూ"లో కన్సర్వేటర్ పోస్టుకోసం అప్లయి చేశాడు వెంకట్రావ్. ఇంటర్వ్యూ కాల్ లెటర్ వచ్చాక చింపాంజీలా గంతులే శాడు.

ఫలానారోజు ఇంటర్వ్యూ అంటే తెగ ప్రిపేరయిపోయాడు. "కౌన్ బనేగా కరోడ్ పతి" వచ్చాక క్విజ్ పుస్తకాల దాడి పెరి గింది కదా! ఓ పుస్తకం కొనుక్కుని బట్టీప ట్టాడు.



ఇంటర్వ్యూ రోజు టిప్‌టాప్‌గా తయా రయి హాల్ కొచ్చాడు. దేశంలోని నిరుద్యోగ సమస్య వేడిని అక్కడే చూశాడు. జనం హాలునిండా కిటకిటలాడుతున్నారు.

"వెంకట్రావ్... వెంకట్రావ్..." పేరు పిలి చారు.

పులి బోనులోకి పోయే కుందేలు పిల్లలా లోపలికి అడుగుపెట్టాడు. వెళ్ళగానే ఆయనో ప్రశ్నవేశారు.

"కన్సర్వేటర్ అంటే ఏంచేస్తారు?"

"జంతువుల ఆలనా పాలనా చూడటం, వాటికి రక్షణ కల్పించడం"

"జూలో జంతువులు హాపీగా వుంటాయా? అడవిలో జంతువులు హేపీగా వుంటాయా?"

తను చదివిన పుస్తకాల్లో ఈ ప్రశ్నలు లేవే? అనుకుంటూ "అడవిలో జంతువులు హాపీగా ఉంటాయి సార్. 'జూ'లో జంతువు లైతే జనాలు తమ తోళ్ళు ఎక్కడ తీస్తారో అని భయపడి ఛస్తుంటాయ్"

"వెరీగుడ్. మన ఇండియాలో వున్న పులులెన్ని?"

సంఖ్య చెప్పాడు.

"వెర్రిగుడ్. విజన్ ట్వంటీట్వంటీ నాటికి పులులెన్ని వుంటాయ్?"

"పులులు వుంటాయిగాని, తోళ్ళు లేని పులులే ఎక్కువుంటాయి సార్!"

"వెర్రీఘుడ్.. పులి తోలెందుకు వుపయో గపడ్తుంది?"

"పులి తోలు ఫారిన్‌కెళ్తుంది సార్. తీసిన





వైనం పత్రికలకీ, ప్రజలకీ, ఎంక్వయిరీ కమిటీలకీ థ్రిల్ కలుగచేస్తుంది సార్"

"తోలు తీసిన 'పులి' బతికుంటే ఏం వైద్యం చేస్తావ్? "

"ప్లాస్టిక్ సర్జన్ని పిలిచి మనిషి తోలు "ట్రాన్స్‌ప్లాంట్" చేయిస్తా సార్"

"పులులు నిన్నేమయినా సలహా అడిగితే ఏం సలహా ఇస్తావ్? "

"ప్రపంచంలో ఎక్కడైనా పుట్టండిగానీ ఇండియాలో మాత్రం పులిగా పుట్టవొద్దని సలహా ఇస్తా సార్. ఒకవేళ పుట్టినా తోలు లేని పులిలా పుట్టమంటాసార్"

"వెర్రీగుడ్... యు ఆర్... సెలక్టెడ్"

"థాంక్యూసార్ మన జూలో తోలులున్న పులులే ఉన్నాయి గద సార్? "

—డా॥ కె. శివసుబ్బారావు

---

# తలకాయ

సదానందానికి రెండుపదులన్నా దాటక ముందే బట్టతల వచ్చేసింది. మర్యాదగా చెప్పాలంటే బోడిగుండు వచ్చిందనాలి. మరి పెళ్ళెలా అవుతుందని అతని బాధ. ఆనందం అనేదతని పేరులోనే మిగిలిపోయింది. ఎందరు దేవుళ్ళకు మొక్కుకున్నా



ఫలితం లేకపోయింది. ఓరోజు సదానందం మిత్రుడికి తోడుగా సెలూన్‌కెళ్ళి మ్యాగజైన్లు తిరగేస్తూ కూర్చున్నాడు. అది ఏ.సి. బార్బర్ షాప్.

టీపాయ్‌మీద ఖరీదైన పత్రికలున్నాయి. తన మిత్రుడికి క్రాఫ్ చేస్తున్న బార్బర్ నెత్తి నిండా కీకారణ్యంలా అందమైన నొక్కుల జుట్టుండడంచూసి అసూయతో రగిలిపోయాడు సదానందం.

మిత్రుడి క్రాఫ్ అయాక వెళ్ళి తనకు గడ్డం గీయమని కూర్చున్నాడు అదే కుర్చీలో వాడు రెడీ అవుతుండగా "నా తలని నీ తలలా కనిపించేలా చేయగలిగితే రెండు వెయ్యన్నూరు పదహార్లు బహూకరిస్తాను" అన్నాడు సదానందం, ఆశగా.

"నిజంగానా? " అన్నాడు బార్బర్ అంత కన్నా ఆశగా చూస్తూ.

"నిజంగానే గానీ, నీకు అంతశక్తి ఉందా? ఆ విద్య ఏదైనా తెలుసా? " అడిగాడు సదానందం.

"అదేమంత కష్టంసార్! మరి మీరు

మాటతప్పరుకదా? ”

“ఎందుకు తప్పుతాను. అవసరం నాది కదా.”

“సరే, ప్రయత్నిస్తాను సార్. మా ముత్తాతల కాలంనుండి ఈ వృత్తిలో ఉన్నాంగదా” అన్నాడతను.

సదానందంలో ఆశ చిగురించింది. మన దేశంలో తైలాలు, ఆకుపసర్లు బోలెడు రకాలున్నాయి. ఏ చిట్కా వైద్యంలో ఏం అద్భుతాలున్నాయో. వీళ్ళ వృత్తే అది గనుక ఏదన్నా తెలిసుండకపోదు” అనుకున్నాడు.

“సరే! రేపీపాటికి మీ తల అచ్చం నా తలలా ఉండేట్లు చేస్తాను” అన్నాడు బార్బర్ ధీమాగా.

షాపుకు వెళ్ళే ముహూర్తంకోసం ఎదురు చూసి, చూసి కాస్త ముందే బయల్దేరాడు సదానందం. ఇంతమంది బాబాలు, స్వాములు, దేవుళ్ళు ఉన్నారు ఏం లాభం! ఆఫ్టరాల్ ఓ బార్బర్ పాటి చేయలేదు గదా... అనుకుంటూ త్వరత్వరగా సెలూన్‌కు చేరాడు సదానందం.

గుమ్మంలోనే ఎదురొచ్చిన బార్బర్ అతన్ని సగౌరవంగా లోనికి తీసుకెళ్ళి సుఖాసీనుడిని చేశాడు. “క్యాష్ తెచ్చారు గదా సార్” అన్నాడతను పత్రిక అందిస్తూ.

“మందు ఏదీ? అది వాడింతర్వాత నా నెత్తిమీద ఉంగరాలజుట్టు దట్టంగా పెరిగాక గదా నీకివ్వాల్సింది” అన్నాడు సదానందం.

“అంత శ్రమెందుకూ జాగ్రత్తగా చూడండి సార్! నా తల ఇపుడు అచ్చం మీ తలలాగే ఉందిగదా”

నిజమే! బార్బర్ తల నున్నగా ఉంది అప్పుడే చెక్కినట్లు. ఉత్సాహంలో అది గమనించలేదు సదానందం. తెల్లమొహం వేసుకుని చూస్తున్న సదానందంతో అన్నాడు బార్బర్.

“ఇపుడు మీ తల నా తలలాగే ఉందిగదా సార్! దయచేసి ఆ రెండు వెయ్యిన్నూట పదహార్లూ ఇచ్చేసి వెళ్ళండి. కస్టమర్లు చాలామందున్నారు. చేతినిండా పనుంది” అన్నాడా బార్బర్.

—యం. ఊహ

---

# భిక్ష

“ఈరోజు మీరు డ్యూటీకెళ్ళటానికి వీల్లేదు? ” అన్నాడు యస్.ఐ. భీమారావ్.

“ఎందుకు వీల్లేదు? ” గోలగోలగా అరిచారు ముష్టివాళ్లు. బొచ్చెలు టపటపామని కొట్టారు.

“ఈరోజు అమెరికా ప్రెసిడెంట్ మన నగరానికి వేంచేస్తున్నారు!! ఆయన కళ్లకు మీరు కనబడితే బాగోదు”

“మేం మీమాట వినం.. ముష్టి ఎత్తడం మా జన్మహక్కు... జై... ముష్టి మాతాకీ జై...జై...” గోలగోలగా మళ్ళీ అరిచారు.

“అడుక్కుతినేవాళ్ళకు ఎంత అహంకారం? ” లాఠీమీదకు వెళ్ళింది భీమారావ్ చెయ్యి.

“మిస్టర్ ఇన్‌స్పెక్టర్. రెస్పెక్ట్ అవర్ బెగ్గింగ్ ప్రొఫెషన్. వుయ్ ఆర్ హియర్ బికాస్ ఆఫ్ అన్ ఎంప్లాయ్‌మెంట్”

“ఏం చదువుకున్నావు బాబూ? ”

“నేనేకాదు, ఇక్కడున్నవారిలో చాలా మంది గ్రాడ్యుయేట్లు”

“ప్చ్...సారీ... ఈ ఒక్కసారి నా మాట మన్నించి మీరీరోజు రోడ్లమీద కనబడకండి. ఇది మంత్రిగారి ఆజ్ఞ... లేకపోతే నా ఉద్యోగం ఊడుతుంది”

“ఓ.కె. ఈ ఒక్కరోజు మేం డ్యూటీ ఎక్కం. పదండ్రా పోదాం. ముష్టి ఎత్తుకుందాం...రా... అనే సిన్మా బాగుందట. దానికి పోదాం” అంటూ కేకలు వేసుకుంటూ వెళ్ళిపోయారు.

అమెరికా ప్రెసిడెంట్ ఇలా వచ్చి అలా వెళ్ళారు. మన ఆర్థికాభివృద్ధి చూసి తరించి







పోయారు. ఆనక శాలువా కప్పుకొని వెళ్ళి పోయారు.

కొంతకాలం తర్వాత యస్.ఐ. భీమారావ్ మళ్ళీ ముష్టి సంఘాల లీడర్ల దగ్గరకెళ్లారు.

"ఏంసార్!? మళ్ళీ ఈరోజు ఏ దేశం ప్రెసిడెంట్ అయినా వొస్తున్నాడా? మేం రోడ్లమీద కనబడకూడదా? "

"కాదు... ఈరోజు మీరందరూ కంపల్స రీగా రోడ్లమీద అడుక్కోవాలి. మీరేకాదు ఇంట్లో మీ ఆడవాళ్ళని, పిల్లల్ని, అందర్నీ రోడ్లమీదకు తీసుకురండి. ఈరోజు రోడ్ల మీద ఎక్కడ చూసినా మీ ముష్టివాళ్ళే కన బడాలి"

"ఏంసార్... అలా అంటున్నారు? "

"ఇది మంత్రిగారి ఆజ్ఞ"

"ఎందుకు సార్?.. అలాగా? "

"ఏంలేదు. ఈరోజు ప్రపంచ బ్యాంక్ ప్రెసిడెంట్ 'తోడేల్‌సన్' వస్తున్నాడు. ఎక్కడ చూసినా అడుక్కుతినే వెధవలు కని పిస్తే మనకి డాలర్లిస్తారట... అప్పుగా"

"అలాగా... అయితే మా బొచ్చెల్లో పైస లకు బదులు, డాలర్లు పడతాయా? " ఆశగా చూశాడు భిక్షగాడు.

– కె.ఎస్.ఆర్

## అనుమానం

"నామీద అప్పుడే మోజు తీరిపోయిందా మీకు? " నిష్ఠూరంగా అంది నవ్య.

నరేష్ ఆమెకేసి ఆశ్చర్యంగా చూశాడు.

"అరె... అదేంటి నవ్యా? ఎందుకని అలా అంటున్నావ్? " ఒకింత గాభరాగా అడిగాడు.

"అమాయకత్వం నటించబాకండి! మోజు తీరిపోబట్టేగా నన్ను వదిలించుకోవాలని చూస్తున్నారు"

"వ్హాట్?..!!" అదిరిపడ్డాడు నరేష్.

"ఏంటా అర్థంలేని మాటలు? " జుట్టుపీక్కు నంత పనిచేశాడు.

"అదుగో ఆ బుకాయింపే వద్దు. నేను తెలి వైనదాన్ని కాబట్టి ఈ విషయం ఇంత తేలిగ్గా గ్రహించగలిగాను. నన్ను చంపేద్దామని ప్లాన్ వేశారు మీరు" భర్తకేసి ఈసడింపుగా చూస్తూ అంది నవ్య.

ఈటెతో పొడిచినంత బాధ కలిగించింది నరేష్‌కా చూపు.

"ఆధారం లేకుండా ఆరోపణలు చెయ్యడం మంచి పద్ధతి కాదు" అన్నాడు బాధగా.



"ఆహాc! ఓహో... ఎంత అతితెలివి ప్రదర్శిస్తున్నారండీ? " విచిత్రంగా చేతులు తిప్పుతూ భర్తకేసి మరింత ఈసడింపుగా చూసింది నవ్య.

కడుపులో తిప్పినట్టుగా అనిపించింది నరేష్‌కి.

నవ్యని ఎంతో ఇష్టపడి చేసుకున్నాడు నరేష్. ప్రేమ వివాహం కాదు. అరేంజ్డ్ మ్యారేజే అయినా పెళ్ళిచూపుల్లోనే ఆమెని బాగా ఇష్టపడ్డాడు. అందుకే కట్నం తక్కువైనా ఒప్పేసుకున్నాడు.

నిండా ఆర్నెల్లైనా కాలేదు పెళ్ళయ్యి. ఈ ఆర్నెల్లుగా ఆమెని ఎంతో ప్రేమగా చూస్కుంటూ వస్తున్నాడు.



అలాంటిది ఉన్నట్టుండి ఆమె ఇలాంటి అభాండం వేస్తే కడుపులో తిప్పకుండా ఎలా ఉంటుంది?

"అలా వ్యంగ్యంగా మాట్లాడొద్దు నవ్యా! విషయం ఏంటో స్పష్టంగా చెప్పు" అన్నాడు బాధగా.

"నా నోటితోనే చెప్పించాలని ఉందా? సరే వినండైతే" అంది నవ్య.

"ఊc చెప్పు..." అన్నాడు నరేష్ ఆత్రంగా.

"ఇంతకుముందు మీరేవన్నారు? "

"ఇంతకుముందంటే? "

"అదే... మనమధ్య ఈ వివాదం స్టార్ట్ అవ్వకముందు"

"ఏవన్నానూ? ఈరోజు సెలవేగా సర్దాగా అలా ఊరంతా ఓ రౌండ్‌కొట్టి తిరిగొద్దాం అన్నాను. అంతేగా? " ఇందాక తానన్న మాటలు గుర్తుచేసుకుని చెప్పాడు నరేష్.

"దేర్ యూ ఆర్. నిజంగా నామీద ప్రేమున్నవారే అయితే ఇంట్లో కూర్చుని ఏదైనా నములుతూ కబుర్లు చెప్పుకుందాం అనుండేవారు. కానీ మీకు నన్ను చంపేసి ఇంకెవర్నో చేసుకోవాలన్న ఉద్దేశం ఉండబట్టే బయట తిరిగొద్దాం అన్నారు"

భార్య ఉద్దేశం ఒక్కపిసరు కూడా అర్థంకాలేదు నరేష్‌కి.

"అంటే? !" అన్నాడు అయోమయంగా.

నవ్య భర్త దిక్కు కోపంగా చూస్తూ అంది.

"అదుగో ఆ నటనే వద్దంటున్నాను. మీరు నన్ను బయటికి తీస్కెళ్తానన్నది నన్ను కాలుష్య వాతావరణంలో తిప్పి తిప్పి రోగిష్టిని చేసి చంపేద్దామనేగా? "

ఢాం!

మరుక్షణం ఆ భాగ్యనగరవాసి నరేష్ స్పృహతప్పి పడిపోయాడు.

–కోలపల్లి ఈశ్వర్

# ఏరిన ముత్యాలు

★ స్వంత పొలాలు వదిలి పరాయి పొలాల్లో కలుపు తీయడం మానవ దుగ్మత.

–యాజీ కృష్ణమూర్తి

★ ఒకదేశం తయారుచేసే నాయకుల్ని బట్టి ఆ దేశం గుర్తింపు పొందుతుంది.

–నెహ్రూ

★ ఎప్పుడూ పడిపోకపోవటం కాదు. పడిపోయిన ప్రతిసారీ తిరిగి పైకి లేవడం లోనే మనిషి యొక్క గొప్పతనం బహిరంగమవుతుంది.

–గోల్డ్‌స్మిత్

★ చేసిన చెడ్డపని తిరిగి చేయకపోవడమే నిజమైన పశ్చాత్తాపం.

–లూథర్

★ అధర్మాన్ని ఎదుర్కోవడంలో ప్రకటితమయ్యే బ్రహ్మాండమైన భౌతికశక్తే వాస్తవ మైన విజయం.

–రవీంద్రనాథ్‌ఠాగూర్

★ తప్పు తంటాలతో ముందుకు పరిగెత్తడం కంటే వెనుకకు సర్దుకోవడం ఎంతో ఉత్తమం.

–మార్క్స్

★ డబ్బు నీకు తిండిని మాత్రమే తెచ్చిపెట్టగలదు. ఇదే నీ ముఖ్య గమ్యం కాకూడదు.

–శ్రీరామకృష్ణ

★ సారధి సమర్థుడైతే ఇంద్రియాలనే గుర్రాలు అదుపులో ఉండే ఉత్తమాశ్వాలు అవుతాయి.

–నిర్మలానంద

★ సత్సాంగత్యం ఆత్మవికాసానికి ముఖ్యాంగం.

–వినోబాభావే

★ ఆరోగ్యం, బలం, గౌరవం, ఔదార్యం, దాతృత్వం, సొగసు, సౌందర్యం అన్నీ ధనం మీదే ఆధారపడి ఉంటాయి.

–బెర్నార్డ్‌షా

★ కవితలో ఉండే రసమాధుర్యం కవికి కాదు వ్యాఖ్యాతకే తెలుస్తుంది.

–డా॥ సి. నారాయణరెడ్డి

★ ఇతర బాహ్యశత్రువులతో ఎందుకు పోరాటం? నిన్ను నీవు జయించుకుంటే సుఖ పడతావు.

–మహావీర్

★ శాంతితో కూడిన మనస్సు సృజనాత్మకమైన ప్రాపంచిక విషయాలు సాధించడా నికి నిరాటంకమవుతుంది.

–జవహర్‌లాల్ నెహ్రూ

★ నిష్కళంకమైన మనస్సుతో సౌశీల్యాన్ని పెంపుచేసుకో.

–బుద్ధుడు

సేకరణ: పి.వి.రమణకుమార్

# చతుర

సంపుటి: 24 సంచిక: 2

278వ సంచిక - మార్చి 2001

వైద్యరంగంలోని ఓ ముఖ్యాంశాన్ని గురించి ఆరోజు పేపర్లో వచ్చిన అంశం ఆ లేడీ డాక్టర్‌ని అమితంగా ఆకట్టుకుంది. ఆ రాసింది తను పనిచేసే హాస్పిటల్స్‌లోనే మరో కేంద్రంలో పనిచేసే తనకు తెలిసిన డాక్టరే. అది చదివిన తరువాత ఆమెలో కొన్ని అనుమాన బీజాలు అంకురించి, పెరగసాగాయి. దానికి తగ్గట్టు తను పనిచేసే హాస్పిటల్‌లో సంతానహీన దంపతుల్లో స్త్రీలకన్నా పురుషులలోనే లోపం అధికస్థాయిలో వుంటోందని నిర్ధారించి వైద్యం చేయడం గుర్తిచ్చింది. వెంటనే ఆ డాక్టర్‌ను కలిసి చర్చించాలని బెంగుళూరు ప్రయాణమైంది.

కానీ... ఈలోపే... పరిస్థితులు విషమించి తానొక భయంకర విషవలయంలో చిక్కుకున్నట్టు గ్రహించిన ఆమె ఏం చేసింది? ఏమయింది?

అమాయక రోగుల నుండి అన్యాయంగా లక్షలు పిండుతున్న వైద్యరంగంలోని కొందరి వికృతవిన్యాసాలకు అక్షరరూపం

**శైలబాల** రచన **'యజ్ఞం'**
ఈనెలచతుర సమగ్ర నవల.



## యజ్ఞం

-శైలబాల

ఆకాశం మేఘావృతమై వుంది. ఈ క్షణానో మరుక్షణానో వర్షించడానికి మేఘాలు సిద్ధంగా వున్నాయి.

సాయంత్రం ఆరు గంటలయ్యింది.

ఆ సమయంలో...

నగరానికి ఐదు కిలోమీటర్ల దూరంలో పదెకరాల విస్తీర్ణంలో అత్యాధునిక సౌకర్యాలతో నెలకొన్న 'సురక్ష' కాంపౌండ్‌లోకి ఒక దానివెంట ఒకటిగా రెండు కార్లు ప్రవేశించాయి. ఆ కార్లు చూస్తుంటేనే అందులోని వారెంత ధనవంతులనేది అర్థమవుతోంది.

'సురక్ష సూపర్ స్పెషాలిటీ హాస్పిటల్ అండ్ రీసెర్చి సెంటర్' మేనేజింగ్ డైరెక్టర్ డాక్టర్ కృష్ణప్రసాద్.

స్ఫురద్రూపం, వయసు యాభై సంవత్సరాలు. అయినా క్రమంతప్పక చేసే వ్యాయామం, మెడిటేషన్‌వల్ల చూడటానికి ముప్ఫైఅయిదేళ్ళ కుర్రాడిలా కన్పిస్తాడు. తాను ఎంత యాక్టివ్‌గా పనిచేస్తాడో ఇతరులతో కూడా అలాగే చేయిస్తాడు.

డాక్టర్ కృష్ణప్రసాద్ ప్రిన్సిపుల్స్ వున్న వ్యక్తి. జీవితంలో కష్టపడి పైకి రావడంవల్ల మనుషుల మనస్తత్వాలు ఏ క్షణాన ఎలా మారిపోతాయో ఆయనకు బాగా తెలుసు. చిన్ననాటినుండే ఈ 'మనస్తత్వ పరిశీలన' అనేది ఆయనకు అలవడింది. డాక్టరయ్యాక ఆయనకది బాగా ఉపకరించింది. అందుకేనేమో తీసుకున్న 'ఏ కేసు' కూడా ఇంతవరకు ఫెయిలవ్వలేదు. ఫలితంగా ఆయన హస్తవాసి మంచిదని, ఇప్పుడా ఇంకాసేపట్లోనా అన్నట్టుగా మృత్యువుతో పోరాడే వ్యక్తి కూడా కృష్ణప్రసాద్ చేయి తగిలితే లేచి కూర్చుంటారనే నమ్మకం ప్రజలలో పడిపోయింది.

'సురక్ష'లో పనిచేసే డాక్టర్లందరికి మొదట రోగులతో ఎలా మెలగాలి? మంచి మాటలు చెప్పి, జబ్బుతో పోరాడగల స్థైర్యం ఎలా కలిగించాలి? అనే విషయాలమీద శిక్షణనిస్తారు. డాక్టరుగాకాక ఆత్మీయులుగా నడుచుకోవడమెలాగో నేర్పడమే ఈ శిక్షణ ఉద్దేశ్యం.

ఏ డాక్టరు ప్రవర్తన అయినా ప్రవర్తనా నియమాలకు అనుగుణంగా లేకపోతే వారి మీద నిఘా మొదలవుతుంది. రోగులతో ఏమాత్రం మిస్ బిహేవ్ చేసినా, లేక వారి నుండి లంచాలు ఆశించినా మొదటి విడత వార్నింగ్ ఇచ్చి వదిలేస్తారు. సదరు వైద్యుడు తన ప్రవర్తనను మార్చుకున్నాడా! సరే... లేదంటే ఈసారి లిఖితపూర్వకంగా ఛార్జిషీటు ఇస్తారు. అప్పటికీ ఆశించిన మార్పు రాకపోతే నిర్మొహమాటంగా బయటకు సాగనంపుతారు. అప్పుడిక ఆ డాక్టరు సర్వీసు, సీనియారిటీ, నైపుణ్యత ఇవేమీ పరిగణలోకి తీసుకోరు. అయితే డాక్టర్ కృష్ణప్రసాద్ స్టాఫ్‌ను సొంతమనుష్యులుగా భావించడంవల్ల, సురక్షలో లభించే జీతాలు, ఇతర సౌకర్యాలు సంతృప్తికరంగా ఉండటంవల్ల అక్కడి డాక్టర్లు ఎంతో అంకితభావంతో పని చేస్తుంటారు.

★ ★ ★

కార్లు దిగి డ్రైవర్లు డోరు తెరిచిపట్టుకుని వినయంగా నిలబడ్డారు.

ఒక కారులోంచి ఇద్దరు మహిళలు, మరో కారులోంచి ఇద్దరు మగవారు దిగారు.

ఆ స్త్రీలిద్దరూ తలమీదుగా కొంగు కప్పుకుని మగవారివెనుక ఆస్పత్రిలోకి నడిచారు. వారిని చూస్తున్నవారిలో అందం, అలంకరణ, అణకువ కలిసి నడిచి వస్తున్న ఫీలింగ్ కల్గింది.

మగవారిలో వయసుమీరిన వ్యక్తిపేరు రాజాభూపతి. ఆయన ఏ సంస్థానానికి, ఎప్పుడు రాజో ఎవరికీ తెలీదు. బహుశా ఆయన పూర్వీకులు ఎవరో సంస్థానాధీశులై ఉంటారు. దాంతో తర్వాతి తరాలకు వారి పేర్లముందు 'రాజా' అనేది ఇంటిపేరులా స్థిరపడిపోయుంటుంది. పేరు మాట ఎలా వున్నా ఆ రాచరికపు దర్పం, గాంభీర్యం, వితరణతలు ఆయనలో పుష్కలంగా వున్నా





యని అందరూ అంటుంటారు.

మరొకతను రాజాభూపతి ఏకైక పుత్రుడు రాజా కుమారవర్మ.

ఆ ఇద్దరు స్త్రీలల్లో ఒకరు రాజాభూపతి భార్య, మరొకరు ఆమె కోడలు రాజా కుమారవర్మ భార్య గాయిత్రీదేవి.

వీరిని చూడగానే రిసెప్షనిస్ట్ తన వృత్తిసహజమైన దరహాసాన్ని ముఖాన పులుపుకుని నమ్రతగా అడిగింది. "ఎస్ సర్! వాట్ కెన్ ఐడూ ఫర్ యూ!? "

ఒక్కక్షణం చెప్పాలా వద్దా అని సందేహించి... తర్వాత గొంతు ఖంగుమనేలా "మా పేరు రాజా కుమారవర్మ! వీరు మా పితృదేవులు రాజా భూపతిగారు. ఈరోజు మేము డాక్టర్ కృష్ణప్రసాద్‌గారిని కలవవలసి ఉన్నది" అన్నాడు రాజాకుమారవర్మ.

ఆ స్వరంలోని గాంభీర్యానికి, దర్పానికి రిసెప్షనిస్ట్ విస్తుబోయింది. వచ్చిన వారు సామాన్యులు కాదని ఆమెకు అర్థమైంది. వారిని చూస్తుంటే భయంతో కూడిన గౌరవం కలిగింది.

"జస్టేమినిట్ సార్! ఐ విల్ ఇన్‌ఫార్మ్" అంటూ కృష్ణప్రసాద్‌కు ఫోన్ చేసింది. ఆయన రిసీవరు ఎత్తగానే "సర్! రాజాభూపతిగారూ, రాజా కుమారవర్మగారు మిమ్మల్ని కలవాలని వచ్చారు" అంది.

ఆయన పంపమని చెప్పగానే అటు వెడుతున్న వార్డ్‌బోయ్‌ని పిలిచి "వీరికి డాక్టర్ కృష్ణప్రసాద్‌గారి క్యాబిన్ చూపించు" అని పురమాయించింది.

అతను 'అలాగే' అన్నట్టు తలూపాడు.

"ప్లీజ్ సార్! అతనితో వెళ్ళండి. డాక్టర్‌గారు మీకోసం ఎదురుచూస్తున్నారు" అని చెప్పి ముఖాన అంటిన చెమటను కర్చీఫ్‌తో అద్దుకుంది రిసెప్షనిస్ట్.

తను ఎందుకంత ఖంగారుపడిందో ఆమెకే అర్థంకాలేదు.

రాజాభూపతి పరివారం కృష్ణప్రసాద్‌గారి క్యాబిన్‌లోకి ప్రవేశించారు.

వీరిని చూడగానే "ప్లీజ్ కమిన్... రండి... రాజా భూపతిగారూ!" అన్నారు డాక్టరు కృష్ణప్రసాద్.

ఆయన స్వభావసిద్ధమైన చిరునవ్వు ముఖంలో అలాగే వుంది.

పరస్పర పరిచయాలయ్యాక, గొంతులో అదే మార్దవంతో "చెప్పండి... ఏమిటి మీ ప్రాబ్లమ్? " ప్రశ్నించారు కృష్ణప్రసాద్.

ఆ ఆప్యాయతతో ఏ పేషెంట్‌కు అయినా ధైర్యం, నమ్మకం రెండూ కలుగుతాయి. వారి జబ్బు గూర్చిన ఖంగారు తగ్గి నిశ్చింతగా ఊపిరి పీల్చుకుంటారు.

తామెందుకు వచ్చారో ఎలా చెప్పాలో అర్థంగాక ఒక్కక్షణం సందిగ్ధంలో పడినా, వెంటనే తేరుకుని, గొంతు సర్దుకుని చెప్పడం ఆరంభించారు రాజాభూపతి.

"డాక్టరుగారూ! ఈమె మా కోడలు గాయత్రీదేవి! ఈమెకు ఇద్దరూ పుత్రికలే జన్మించారు. ఆడపిల్లలంటే ఎప్పటికైనా ఒక ఇంటికి వెళ్ళవలసినవారే కదా! మాకున్నది ఒక్కడే పుత్రుడు. అతని తర్వాత మా వంశం నిర్వీర్యమైపోతుందనే బాధ మాకెంతో ఆందోళన కల్గిస్తోంది. మాకిక వారసులు కలగరన్న నమ్మకంతో దాయాదులు కుట్రలు, కుతంత్రాలు మొదలుపెట్టారు. మా ఏలుబడిలో ఉన్న ప్రజలు కూడా చింతాక్రాంతులై ఉన్నారు"

ఒక్క నిముషం ఆగారాయన.

గాయిత్రీదేవి ఈ పరిస్థితికి తనేకదా కారణం అన్న బాధతో తల వంచుకుని కూర్చుని వుంది.

"మేము ఈమధ్య వార్తాపత్రికలో టెస్ట్‌ట్యూబ్ బేబీ గురించి చదివియుంటిమి. అందలి సమాచారం మమ్మల్ని ఎంతగానో ఆకట్టుకుని ఉంది. అప్పుడే మా మనసులో ఓ ఆలోచన ఉద్భవించింది. అదేమంటే... ఈ టెస్ట్‌ట్యూబ్ బేబీ ప్రక్రియను ఉపయోగించి మీరు మాకు ఓ వంశోద్ధారకుడిని ఎందుకు సృజించకూడదు? అందుకు ఎంత

రొక్కము వెచ్చించాల్సివచ్చినా మేము వెను కాడము" చేతులు జోడించి అభ్యర్థించారు రాజాభూపతి.

ఆయన గురించి కృష్ణప్రసాద్ కూడా ముందే వినివున్నారు. డబ్బు ఉండగానే సరికాదు. దానిని సత్కార్యాలకు వినియో గించినప్పుడే సద్వినియోగం అవుతుంది. ఆ విధంగా ఆయన దానధర్మాలకు పేరుప డ్డారు. ఖచ్చితంగా రాజాభూపతిగారి కోరిక సమంజసమే... కానీ, టెస్ట్‌ట్యూబ్ బేబీ టెక్నిక్ (ఇన్‌విట్రో ఫెర్టిలైజేషన్)ను ఉప యోగించి మగపిల్లాడు కలిగేలా చేయడ మనేది అంత తేలికకాదు.

డాక్టర్ కృష్ణప్రసాద్ ఏం చెప్తారా అని రాజాభూపతి ఎదురు చూడసాగారు. ఆయన తన జీవితంలో ఇంతవరకు ఎవరి దగ్గరా 'దేహీ' అని చేయిసాచి ఉండరు. ఆ భావన ఆయన ప్రతి కదలికలోను, మాట లోనూ కూడా వ్యక్తమవుతూనే వుంది.

"చూడండి! రాజావారూ! మీకోరిక, ఆలో చన రెండూ సమంజసమైనవే... కాద నను. కానీ ఇది చాలా క్లిష్టతరమైన ప్రక్రియ. అందులోనూ సక్సెస్ అయ్యే శాతం మరీ తక్కువ. ఇవికాక ఇతరత్రా ఎన్నో ఇబ్బందులు కూడా ఉంటాయి"

ఆ సమాధానాన్ని రాజాభూపతి ఊహిం చలేదు.

"కానీ టెస్ట్‌ట్యూబ్ బేబీ అనే వైద్యవిధానం ద్వారా ఎందరో సంతానవంతులు అవుతు న్నారు కదా!" ఆయన స్వరంలో అప్పటికే నిరాశ మేఘాలు కమ్ముకున్నాయి. తన ఆఖరి ఆశ కూడా అడుగంటిపోయిందని తెలిస్తే మనిషికి కలిగే బాధ, ఆవేదన ఆయనలో కన్పించాయి.

"నిజమే భూపతిగారూ! దానికి, దీనికి మధ్య చాలా తేడా ఉంది. పూర్తిగా విశద పరచడం మెడికల్ టెర్మినాలజీలోనే సాధ్యం అవుతుంది. కానీ మీకు అర్థంకావ డంకోసం క్లుప్తంగా చెప్తాను. స్త్రీ, పురుషు లిద్దరిలోను సెక్స్ క్రోమోజోములు ఉంటాయి. ఇవే లింగ నిర్ధారణకు కార కాలు. పురుషవీర్యంలో సగభాగం ఎక్స్ క్రోమోజోములు కాగా, మిగతా సగభాగం వై క్రోమోజోములు ఉంటాయి. ఇవి రెండూ డి.ఎన్.ఎలోని అతి సూక్ష్మభా గాలు. మగబిడ్డ ఉద్భవానికి 'వై' క్రోమో జోమే మూలకారణం. ఆడ శిశువు జననా నికి 'ఎక్స్' క్రోమోజోము హేతువు అవు తుంది. ఈ విధంగా పుట్టబోయే బిడ్డ ఆడ లేక మగ అనేది పూర్తిగా పురుషుని వీర్యం నుండి వచ్చే క్రోమోజోముల మీదనే ఆధార పడి ఉంటుంది. ఇక ఇప్పుడు మీరన్నట్టుగా మగబిడ్డను సృష్టించాలంటే అదో యజ్ఞం! మొదట స్త్రీ అండాశయం నుంచి ఫలదీక రణ చెందని అండాలను ఎంపికచేయాలి. అటు పిదప ఆ అండాలను వీర్యకణాలతో సంధానపరచాలి. తర్వాత 'ఎక్స్', 'వై' క్రోమోజోములను గుర్తించి కృత్రిమ గర్భ ధారణకు వినియోగించాలి. ఇది మనం చెప్పుకున్నంత తేలికకాదు. ఇందుకోసం ఎన్నోసార్లు ఆస్పత్రికి రావాల్సి ఉంటుంది. ఒక్కసారికే ఈ ప్రయోగాలు విజయ వంతం కావు. పదేపదే ఈ ప్రయోగాలకు పూనుకోవాల్సిరావడమనేది స్త్రీ మనోభావా లను ఎంతగానో దెబ్బతీస్తాయి. ఇంత కష్ట పడ్డా, రిస్క్ తీసుకున్నా ఈ ప్రయోగంలో సక్సెస్ ఛాన్సు చాలా చాలా తక్కువ. ఇవన్నీ తెలిసి, ఓ బాధ్యతాయుతవైద్యునిగా నేను మీ ఆలోచనను సమర్థించలేను. ఈ ప్రయోగాలకు పూనుకోలేను. నన్ను క్షమిం చండి" అన్నారు డాక్టర్ కృష్ణప్రసాద్. ఇక ఈ విషయంలో వాదప్రతివాదనలు అనవ సరం అని చెప్పకనే చెప్పినట్టుగా అన్పించ డంతో రాజాభూపతి కుర్చీలోంచి లేచి డాక్టర్ కృష్ణప్రసాద్‌కు నమస్కరించి బయ టకు నడిచారు. మిగతావారు ఆయనను





అనుసరించారు.



'అమృత పాలీక్లినిక్' కాన్ఫరెన్స్ హాల్లో జరుగబోతున్న ఫంక్షన్‌కోసం ఏర్పాట్లు చురుకుగా సాగుతున్నాయి.

పరిచయాలు, పలకరింపులతో ఆ ప్రదేశమంతా సందడిగా వుంది.

ఆస్పత్రి స్టాఫ్ ఒక్కక్కరే వచ్చి తమకు కేటాయించిన సీట్లలో ఆసీనులవుతున్నారు.

సమయం సాయంత్రం ఆరు గంటలవుతోంది.

అంత భారీ ఎత్తున ఆరోజు ఫంక్షన్ ఏర్పాటు చేయడానికి రెండు కారణాలువున్నాయి. 'అమృతా పాలీక్లినిక్' ఆరంభించి పది వసంతాలు పూర్తికావడం ఒక కారణమైతే, ఆ ఆస్పత్రి ఛీఫ్ డాక్టర్ మణి యాభై సంవత్సరాలు నిండి యాభై ఒకటిలోకి ప్రవేశించడం మరో కారణం.

డాక్టర్ మణి 'అమృతా'లో ఓ మామూలు డాక్టరుగా చేరాడు. ఆయన చేరేనాటికి 'అమృతా పాలీక్లినిక్' అనేది ఒకటుందని చాలామందికి తెలీదు. అత్యంత అధునాతన సౌకర్యాలతో ఎంతో డబ్బు వెచ్చించి మరీ నెలకొల్పిన 'అమృత క్లినిక్' పేషెంట్లు లేక వెలవెలబోతుండేది. స్వప్రయోజనం గురించి తప్పితే అక్కడున్న వారెవ్వరికీ క్లినిక్ శ్రేయస్సు గురించి ఆలోచించే తీరికలేదని చేరిన కొద్దిరోజులలోనే మణికి అర్థమైంది. దాంతో ఆ రంగంలో మణి కృషిచేయనారంభించాడు.

ఎదుటివారికన్నా భిన్నంగా ఆలోచించడం ద్వారా కూడా సక్సెస్ కావచ్చన్నది ఆయన అభిప్రాయం.

వైద్యం చేయడమంటే ప్రజలకు సేవ చేయటంలాంటిదని భావించే ఆస్పత్రి యాజమాన్యం మనసు మార్చి వైద్యం కూడా ఓరకమైన వ్యాపారమే అనే స్థితికి తీసుకువచ్చిన ఘనత పూర్తిగా 'మణి'కే దక్కుతుంది. మణి 'అమృత'లో చేరిన కొద్దిరోజులకే క్లినిక్ రూపురేఖలు పూర్తిగా మారిపోయాయి. దానితోపాటే ప్రజల నోటిలో హాస్పిటల్ అంటే అమృతా క్లినిక్ అనేంతగా ఆ పేరు నానిపోయింది. ఫలితంగా మామూలు డ్యూటీ డాక్టరుగా కెరీర్ ఆరంభించిన మణి కొద్దికాలంలోనే క్లినిక్‌కి ఛీఫ్ అయ్యాడు. తెలివితేటలు, చురుకుదనం, వ్యాపారధోరణితో పాటు మణి హస్తవాసి కూడా మంచిదన్న పేరురావడంతో 'అమృత పాలీక్లినిక్' నగరంలో నెంబర్‌వన్ ఆస్పత్రి అయ్యింది.

గత అయిదేళ్ళుగా ఏకఛత్రాదిపత్యంగా రాజ్యం ఏలుతున్న అమృతకు సూపర్ స్పెషాలిటీ హాస్పిటల్స్ వచ్చాక ముఖ్యంగా సురక్షతో కొంచెంకొంచెంగా క్రేజ్ తగ్గనారంభించింది. ఎందులోనూ రెండోవాడిగా ఉండడానికి అంగీకరించని మణి ఏం చేసైనా పూర్వపు వైభవం సంపాదించుకోవాలనే ఆలోచనలో వున్నాడు.

ఆ క్లినిక్‌లో ఇలాంటి సమావేశాలు చాలా అరుదుగా జరుగుతూ ఉంటాయి. ఏదైనా ముఖ్య విషయం వుంటే తప్ప డాక్టర్ మణి ఇలాంటి వేడుకలు జరపడని అక్కడున్న అందరికీ తెలుసు. అమృత క్లినిక్ స్థాపించబడి పది సంవత్సరాలు పూర్తయిన సందర్భంలో ఫంక్షన్ ఏర్పాటు చేశారని తెలిసినా

ఖచ్చితంగా దాని వెనుక ఏదో బలీయమైన కారణం ఉంటుందని వారికి అన్పించసాగింది.

అంతలో డాక్టర్ సునీల్ అక్కడికి వచ్చాడు.

డాక్టర్ సునీల్ మణికి కుడిభుజం. ఆయన సలహా తీసుకోనిదే, ఆయనను సంప్రదించందే మణి ఎలాంటి నిర్ణయమూ తీసుకోడు.

"హల్లో డాక్టర్ సునీల్! ఎలా వున్నారు?" షేక్‌హ్యాండ్ ఇస్తూ అడిగాడు డాక్టర్ భార్గవ్.

"బావున్నాను... మీరెలా ఉన్నారు?"

"పర్‌ఫెక్ట్‌లీ ఆల్‌రైట్..." నవ్వుతూ చెప్పాడు డాక్టర్ భార్గవ్.

వీళ్ళిలా మాట్లాడుకుంటూ ఉండగా మీటింగ్ హాల్లోకి హడావుడిగా ప్రవేశించింది తన్మయి.

ఆమె హాల్లోకి రాగానే సభ్యతకాదని తెలిసినా చాలామంది ఆమెమీంచి తమ చూపులు తిప్పుకోలేకపోయారు.

"ఆ ముఖము ఇందు బింబమును పోలె.
ఆ కన్నులు కలువలను పోలె.
ఆ చూపులు వెన్నెల వెలుగులను పోలె.
ఆ అధరములు కెంపులను పోలె."

అన్నట్టుగా ఉంది ఆమె రూపం.

ఆమె అక్కడ అడుగుపెట్టగానే కళ్లెదుట మెరుపు మెరిసినట్టు, ఏ దేవకన్యో దివి నుంచి భువికి అరుదెంచినట్టు అన్పించింది.

తన్మయిని చూడగానే నీహారిక పలకరింపుగా నవ్వి, తన పక్కకుర్చీ చూపించింది.

ఆమె కూర్చుంటూ "మన చీఫ్ గారు ఇంకా వచ్చినట్టు లేరే" అంది.

"లేదు... కొంచెం ఆలస్యమవుతుందని కబురు పంపించారు..." అంది నీహారిక.

"అవునా... అలాంటప్పుడు మనందరికీ ఆ విషయం ఇన్‌ఫార్మ్ చేస్తే ఈ ఎదురు చూసే బాధ తప్పుతుందికదా! టైమంతా వేస్ట్ అయిపోతోంది..." వాచీ చూసుకుంటూ అసహనంగా అంది తన్మయి.

నవ్వుతూ ఆమెవంక చూస్తుండిపోయింది నీహారిక. తన్మయి ప్రవర్తనలో ఎలాంటి భేషజంకాని, అసహజత్వం కానీ ఆమెకు కన్పించలేదు.

"బైదిబై నా పేరు నీహారిక... ఈమధ్యనే ఇక్కడ జాయిన్ అయ్యాను..." తనను తాను పరిచయం చేసుకుంది.

"ఓ సారీ... నా పేరు తన్మయి..." నొచ్చుకున్నట్టుగా ఉంది ఆమె స్వరం.

"తెలుసు..." చిరునవ్వుతో తల పంకించింది నీహారిక.

"తెలుసా? ఇంతక్రితం మనమెప్పుడూ కలుసుకోలేదే...?" ఆశ్చర్యం ధ్వనించింది తన్మయి స్వరంలో.

"నేనెవరో మీకు తెలీదుకాని, మిమ్మల్ని గూర్చి నాకు తెలుసు. ల్యాబ్‌లో మిమ్మల్ని చాలాసార్లు చూశాను. మీ గురించి ఇక్కడంతా చాలా గొప్పగా చెప్పుకుంటారు..."

"ఏమని...?"

"మీరు అందరితో ఫ్రెండ్లీగా వుంటారని, మీకు ఎలాంటి ఈర్ష్య, ద్వేషాలు లేవని, మీ వర్క్ గురించి తప్పితే మీరే విషయం పట్టించుకోరని"

నీహారిక చెప్తుంటే తన్మయి ఆసక్తిగా వింటోంది.

'నువ్వు సమాజం గూర్చి పట్టించుకోకపోతే ఈ సమాజమూ నిన్ను గూర్చి పట్టించుకోదు. అందుకే నీవేం చేయదలచినా ధైర్యంగా చెయ్యి' అని చెప్పేది ఆమె బామ్మ. తను ఇంతవరకు అదే నమ్ముతూ వచ్చింది. కాని మనం పట్టించుకున్నా లేకపోయినా మన చుట్టూ వున్న సమాజం మనల్ని గూర్చి ఆలోచిస్తూనే ఉంటుందని నీహారిక చెప్తున్నదాన్ని బట్టి ఆమెకు అర్థమైంది. అంతకుమించి అంతా తనను ఓ విభిన్నవ్యక్తిగా చూస్తున్నారనే మాట ఆమెలో ఎలాంటి స్పందన కలిగించలేదు. కారణమేమంటే తన పరిశోధన మినహా ఆమెకు ఏ

విషయమూ ఆసక్తినివ్వదు.

"సారీనండీ బోర్ కొట్టేస్తున్నానా...?" చిన్నపిల్లలా అడుగుతున్న నీహారికను చూస్తుంటే తన్మయికి నవ్వొచ్చింది. ఏదో తెలీని ఆత్మీయత కలిగింది.

నిజానికి నీహారిక, తన్మయి ఇరువురూ దాదాపుగా ఒక ఈడువారే. కాకపోతే వారి మనస్తత్వాలలో ఉన్న వైరుధ్యంవల్ల, తాను నీహారికకన్నా పెద్దదాన్నని భావించడంవల్ల కలిగిన వాత్సల్యం అది.

"లేదు నీహారికా! నేను చాలా తక్కువ మాట్లాడతాను. ఎందుకంటే ఏ ఇద్దరు వ్యక్తులు మాట్లాడుకున్నా అందులో ఆత్మ స్తుతి లేదా పరనింద ఎక్కువగా ఉంటాయి. మనం చేసే పనులు, నడవడిక ఇవన్నీ మన మేంటో చెప్తున్నప్పుడు ఇక ఆత్మస్తుతి అవ సరం ఏముంది? పైగా మన గురించి మన సక్సెస్ మాట్లాడాలి తప్ప మనమే గొప్పలు చెప్పుకోకూడదని నా అభిప్రాయం. పోతే ఒకవ్యక్తిలో నీకేమైనా లోటుపాట్లు కన్పిస్తే అవేంటో చెప్పి ఆ మనిషిని బాగుచేసేం దుకు ప్రయత్నించాలి. లేదా ఇక ఆ వ్యక్తి గురించి మర్చిపోవాలి. అలాకాక మరొకరి దగ్గర విమర్శించడంవల్ల అనవసర గొడ వలు, ఘర్షణలు, మనస్తాపం తప్పితే ఇందు వల్ల ఎవ్వరికీ ఎలాంటి మేలు జరగదు. అందుకే ఈ ఆత్మస్తుతి, పరనింద కోసం నా కాలాన్ని వృథా చేసుకోవడం నాకు ఇష్టం లేదు..."

ఒక్కక్షణం ఆగి తిరిగి కొనసాగించింది తన్మయి.

"అదీగాక నీకో విషయం చెప్పనా? ఎవ రితోనైనా మాట్లాడదామన్నా నాకు నా సబ్జెక్ట్ గురించి తప్ప ఏమీ తెలీదు. ఇప్పుడే కాదు చిన్నప్పటినుంచి అంతే! నేనొక లక్ష్యంతో పెరిగాను. ఆ లక్ష్యసాధనకోసం సంబంధిత అంశంలో అపరిమిత జ్ఞానాన్ని సంపాదించాలన్నది నా కోరిక. సో! కాస్తంత వ్యవధి దొరికినా లైబ్రరీకి వెడదా మనో, ఇంటర్నెట్ ముందు కూచుందామనో అన్పిస్తుంది. ఒకవేళ నేను ఎవరితోనైనా మాట్లాడటం మొదలుపెట్టాననుకో. నాకు తెలీకుండా నా ప్రపంచంలోకి వెళ్ళిపోతుం టాను. నా ఎదురుగా వున్నవారు వింటు న్నారా! లేదా! అనేది కూడా నాకు పట్టదు. వినేవాళ్లు అదేదో నా గొప్పతనం చాటుకోడా నికే నేను అలా మాట్లాడుతున్నానని అను కుంటున్నారన్న విషయం నాకీమధ్యనే తెలి సింది. అందుకే అప్పటినుంచి హలో అంటే హలో తప్పితే ఒక్కమాట కూడా ఎక్కువ తక్కువ మాట్లాడటంలేదు. అందుకే మా బామ్మ అప్పుడప్పుడు 'నీ పేరు ముందున్న ఆ డాక్టర్‌ని పక్కనపెట్టి కాసేపు మామూలు ఆడపిల్లలా ఉండవే' అని అంటుంది. అదే నాకు చాతకావడంలేదు..." నిస్సహాయత ధ్వనించింది తన్మయి స్వరంలో.

ఆమె చెప్పిన తీరుకు నీహారికకు నవ్వు ఆగలేదు.

రేపోమాపో ప్రపంచ నీరాజనాలు అందు కోబోయే అమ్మాయి. తన సబ్జెక్ట్‌లో అనర్గ ళంగా మాట్లాడగల అమ్మాయి నాకు 'మామూలు ఆడపిల్లలా మాట్లాడటం రావ డంలేదు' అని నిజాయితీగా చెప్పడం, ఆ బుంగమూతి నీహారికకు నవ్వు తెప్పిం చాయి.

ఆమె నవ్వుని పట్టించుకోకుండా, "మీ పేరేమన్నారు?' 'నీహారిక' కదూ. అంటే మంచు బిందువని' అర్థంకదా! మెరిసేప్పుడు ఓ మంచుబిందువే... అలా వున్నంతకాలం ఒక నీటిచుక్క. కాని అదే మంచుబిందువు ఏ చిగురుటాకుపైనో, ఏ పూబాలల చెక్కిలి పైనో జారి, వాటి అంతరంగాన్ని తన ముని వేళ్లతో స్పృశించినప్పుడు అవి సుతారంగా తమ ఆకులరెక్కల కిందో, పూలరేకుల కిందో కప్పేస్తే ఆ మంచుబిందువు రూపమే మారిపోతుంది. ఓ నీహారిక హరితపత్రం పైన వాలితే మంచి ముత్యం అవుతుంది. చిరుగులాబి గుండెల్లో ఒదిగితే పగడమవు



# పరిణముత్యాలు

★ జీవితం అనేది ఒక భ్రాంతి. ఆ భ్రాంతిలోనుంచి తేరుకుని సత్యాన్ని దర్శించాలనుకునేంతలోనే జీవితకాలం ముగిసిపోతుంది.

–షేక్స్పియర్

★ జీవిత మాధుర్యం జీవించే మనిషిననుసరించి వుంటుంది కానీ పనినిబట్టి, ప్రదేశాన్ని బట్టి వుండదు.

–ఎమర్సన్

★ జీవితపథంలో అటు ఇటు కనిపించేవన్నీ సమాధులే. ఆ సమాధుల మధ్య ప్రయాణం చేస్తూ స్వర్గాన్ని చేరాలని ఆరాటపడతాం.

–బక్టర్

★ జీవితంలో ఒక్కటే నిజమైన విజయం. మన ఇష్టం వచ్చినట్టు మనం జీవించగలగడం.

–క్రిష్టోఫర్ మోర్లీ

★ జీవితంలో విజయానికి కీలకం... వచ్చే అవకాశానికి సిద్ధంగా వుండడం.

–డిజ్రేలీ

★ జీవితం మానవుని అమరత్వం తాలూకు బాల్యదశ.

–గెథే

★ జీవితానికి రెండు ధ్యేయాలు. ఒకటి కావాలనుకున్నది పొందడం రెండు దాన్ని అనుభవించడం.

–లోగాన్ పియర్సాల్స్మిత్

★ సత్యంగా నిష్కల్మషంగా వున్నంతకాలం జీవితంలో కోరినవన్నీ లభిస్తాయి.

–నేసిట్

★ సంతృప్తిలేని జీవితానికి శాంతిలేదు. సంతృప్తిలేని జీవితానికి వృద్ధిలేదు.

–నార్ల

★ జీవితాన్ని అర్థంచేసుకోవడానికి కేవలం జీవితానుభవం చాలదు. కొన్ని సాంఘిక సిద్ధాంతాలు కూడా అవసరం.

–కొడవటిగంటి కుటుంబరావు

★ జీవితం అద్భుతాల పుట్ట.

–చెకోవ్

★ జీవితం ఒక క్షేత్రం. దాని ఫలసాయం నీవు నాటే విత్తనాలమీద ఆధారపడి వుంటుంది.

–బీచర్

సేకరణ: ఝాన్సీరాణి

తుంది. అదే మంచుబిందువు ఏ సన్న జాజో, సంపెంగ ఆలింగనంలోనో కరిగితే వజ్రమవుతుంది. ఆడపిల్లల మనసు ఎంత కోమలమైనదో అవసరమైతే వజ్రం అంత కటువుగా, కఠినంగా మారుతుందిట" భావోద్వేగంతో అంది తన్మయి.

తన్మయి మాటలు ఆమెలో ఆశ్చర్యాన్ని కల్గిస్తున్నాయి.

దీక్షగా తనపనేదో తాను చేసుకుపోయే తన్మయిలో ఇంతటి భావుకత ఉంటుందని నీహారిక ఊహించలేదు. అందుకే అంటారు. ప్రతి వ్యక్తిలోను ఇద్దరు మనుష్యులు ఉంటారని. ఒకరు సమాజంకోసం బతికితే రెండోమనిషి పూర్తిగా తన కోసం, తన అస్తిత్వం కోసం బతుకుతారట.

"మీరు చెప్పాకగానీ నా పేరు ఇంత అందమైనదని నాకు తోచలేదు తన్మయి గారూ..." అంది నీహారిక.

ఆ తర్వాత వారికి ఏం మాట్లాడుకోవాలో తెలీక దాదాపు పది నిముషాలపాటు ఇద్దరూ మౌనంగా ఉండిపోయారు.

అంతలో డాక్టర్ మణి వస్తున్నారని చెప్పటంతో అందరూ వారి వారి సీట్లలో మౌనంగా కూర్చున్నారు.

డాక్టర్ మణి, ఆయనతోపాటు అమృతా పాలీ క్లినిక్ యాజమాన్యం రావడం, అందరూ విషెస్ చెప్పుండగా మణి కేక్ కట్ చేయడం, అవి అందరికి సర్వ్ చేశాక, యాజమాన్యం మణి సేవలను ప్రస్తుతించి సెలవు తీసుకోవడం జరిగింది. ఈ మొత్తం కార్యక్రమం పూర్తికావడానికి కనీసం ఇరవై నిముషాలయినా పట్టింది. ఈ కాస్త వ్యవధిలో డాక్టర్ మణి కనీసం ఓ అయిదారుసార్లైనా వాచీ చూసుకుని వుంటాడు. టైం వేస్ట్ అయిపోతోందనే అసహనం ఆయన ముఖంలో స్పష్టంగా కన్పిస్తోంది.

క్లినిక్ యాజమాన్య సభ్యులు వెళ్ళిపోయాక మైక్ అందుకుని, అందరినీ సంబోధిస్తూ మాట్లాడటం మొదలుపెట్టాడు మణి.

"డియర్ ఫ్రెండ్స్! అమృతపాలీ క్లినిక్ పది వసంతాలు పూర్తిచేసుకుని పదకొండో సంవత్సరంలోకి అడుగుపెడుతున్న సందర్భంలో మీ అందరకు నా శుభాకాంక్షలు" అని అనగానే చప్పట్లు మోగాయి.

ఒక్క నిమిషం ఆగి చిరునవ్వుతో అందరి వంక చూసి మొదలుపెట్టాడు. "ఈ క్లినిక్ అభివృద్ధికి ఎంతగానో తోడ్పడిన మీరంతా ఇకమీదట కూడా ఇలాగే మీ తోడ్పాటును అందిస్తారని ఆశిస్తున్నాను. ఇదివరలో మన క్లినిక్ రోగులపాలిట వరంలా ఉండేది. జబ్బుపడ్డ ఎవర్కైనా మొదట మన క్లినిక్ పేరే గుర్తుకొచ్చేది. మనం కూడా వారి నమ్మకాన్ని ఎప్పుడూ వమ్ము చేయలేదు. కాని ఇప్పుడా పరిస్థితి లేదు. నగరంలో అనేక సూపర్‌స్పెషాలిటీ ఆస్పత్రులు వెలిశాయి. ఫలితంగా మన క్లినిక్‌కు వచ్చేరోగుల సంఖ్య తగ్గింది. ఇది ఇలాగే కొనసాగితే ఏదో ఒకనాటికి మన క్లినిక్ మూసేయాల్సిన పరిస్థితి వస్తుంది. అందువల్ల మనం తిరిగి మన పూర్వవైభవం సంపాదించుకోవాలి. ఇందుకోసం మనం కొన్ని ఆకర్షణీయ పథకాలు ప్రవేశపెట్టాలి. ఇక్కడున్నవారంతా ఈ కార్యక్రమంలో పాలు పంచుకోవాలన్నది నా అభిమతం. మీమీ ఆలోచనలు ఏమిటో చెప్తే అవి ఆమోదయోగ్యంగా వుంటే వాటిని అమలుపర్చడానికి ప్రయత్నిద్దాం..." అని చెప్పి తన సీట్లో కూర్చున్నాడు డాక్టర్ మణి.

అప్పటికిగానీ ఈ సమావేశం ఏర్పాటుచేయడం వెనుక కారణం తెలియలేదు. మొత్తంమీద తమని వేధిస్తున్న చిక్కుముడి విడిపోవడంతో అంతా హాయిగా ఊపిరి పీల్చుకున్నారు.

ఒక్కొక్కరు లేచి తమకు తోచిన ఐడియాను చెప్పడం మొదలెట్టారు. అవన్నీ చీఫ్‌కు నచ్చాలని కాదు. కేవలం మణి తమను గురించి క్లినిక్ శ్రేయస్సు కోరేవారిగా అనుకోవాలనే ఆ ప్రయత్నం.



డాక్టర్ తన్మయికి ఇదంతా కొత్తగానూ, ఆశ్చర్యంగానూ ఉంది.

ఆమె అమృతలో చేరి దాదాపు సంవత్సరం కావస్తోంది. ఈ కాలంలో ఆమె ఇలాంటి సమావేశాలకు ఎన్నడూ హాజరుకాలేదు. ఎంతో అవసరమైతే తప్ప ఆమెనెవ్వరూ డిస్టర్బ్ చేయకూడదని చీఫ్ ఖచ్చితంగా ఆజ్ఞాపించడంవల్ల ఆమెతో మాట్లాడాలని, పరిచయం చేసుకోవాలని మనసులో ఉన్నా చీఫ్ ఆజ్ఞ గుర్తుకు వచ్చి ఆ సాహసం ఎవ్వరూ చేయరు. అక్కడ ఆమెను ప్రత్యేకమైన వ్యక్తిగా ట్రీట్ చేస్తారు. ఆమెకేం కావాలన్నా క్షణాల్లో అమర్చేందుకు ఇద్దరు వ్యక్తులు ఆమెతోపాటు ఉంటారు.

★ ★ ★

తన్మయి రీసెర్చి పూర్తయి ప్రయోగం సక్సెస్ అయితే 'అమృత' పంటపండినట్టే. ఆ విషయం బాగా తెలుసు కాబట్టే ఆమెకు ఎలాంటి ఇబ్బందులు లేకుండా మంచి జీతం, ఫ్లాట్, కారులాంటి సౌకర్యాలెన్నో ఏర్పాటుచేశాడు. వీటన్నింటి వెనుకనున్న ఒకేఒక్క కారణం ఆమె తన పరిశోధనను మరింత వేగంగా పూర్తిచేయాలని.

తన్మయికి కూడా రీసెర్చి తప్పితే వేరే ఏమీ ఆనందాన్నివ్వదు కాబట్టి అమృతలో చేరాక తన పూర్తి సమయాన్ని ల్యాబ్ కే అంకితం చేసింది. తన ప్రపంచంలో తానుండిపోయి చుట్టూ ఏం జరుగుతున్నదీ పట్టించుకోవడం మానేసింది. ఇదిగో ఇప్పుడు ఈ సమావేశానికి హాజరు అయ్యాక డాక్టర్ మణి వ్యాపారతత్వం ఆమెకు అర్థం అయింది.

అందరూ చెప్పేవి ఆసక్తిగా వినసాగింది.

కొంతసేపు అక్కడంతా నిశ్శబ్దం చోటుచేసుకుంది.

తర్వాత హఠాత్తుగా అడిగాడు మణి "డాక్టర్ సునీల్! మీ అభిప్రాయం ఏమిటి? "

డాక్టర్ సునీల్ మణికి అత్యంత విశ్వాసపాత్రుడు. మణి ఆస్పత్రి అభివృద్ధికోసం చేసే పనులన్నింటిలోను భాగస్వామి. మణి తర్వాత తాను చీఫ్ కావాలన్న ఉద్దేశంతో సునీల్ అలా విధేయత నటిస్తాడని కొందరంటారు. ఏదిఏమైనా సునీల్ ను సంప్రదించనిదే మణి ఎలాంటి నిర్ణయాలు తీసుకోడు.

డాక్టర్ సునీల్ లేచి నిలబడి ఒకసారి గొంతు సవరించుకున్నాడు. "థాంక్యూ సర్! నా అభిప్రాయం చెప్పేముందు ఇక్కడున్న వారికి కొన్ని విషయాలు మనవి చేయాలనుకుంటున్నాను. హోప్ యూడోంట్ మైండ్ సర్!"

'చెప్పమన్నట్టు' తలాడించాడు డాక్టర్ మణి.

"వన్స్ ఎగైన్ థాంక్యూ! ఇక అసలు విషయానికి వస్తాను. నా ఉద్దేశంలో మిగతా క్లినిక్ లన్నీ పక్కన పెట్టేస్తే మనకున్న ఒకే ఒక పోటీదారు 'సురక్ష సూపర్ స్పెషాలిటీ హాస్పిటల్'. ఏమిటి ఆ హాస్పిటల్ సక్సెస్ కు కారణం? ప్రతిభావంతులైన డాక్టర్లా? అదే అయితే ఇక్కడా మనకు ఆ లోటేంలేదు. పోనీ అత్యాధునిక సౌకర్యాలా? మనతో పోలిస్తే బెటరేం కాదు. మరి ఏమిటి? ఆలోచించండి. ఈలోగా నేను మీకు ఓ సంగతి చెప్పాలి. బహుశా ఇది వింటే సురక్ష సక్సెస్ కు కారణమేంటో మీకే అర్థమవుతుందనుకుంటాను..."

అంతా ఆసక్తిగా వినసాగారు.

"ఢిల్లీలో అత్యధిక సర్క్యులేషన్ ఉన్న 'టైం' ఆంగ్ల దినపత్రికకు పోటీగా మరో పత్రికను ఆరంభించారు. ఆ పత్రిక పేరు 'వాయిస్'. అంటే పీపుల్స్ వాయిస్ అనే అర్థంలో వాళ్లు ఆ పత్రికకు 'వాయిస్' అని పేరు పెట్టారు. భారీఎత్తున యాడ్స్ ఇచ్చారు. ఇందుకోసం డబ్బును మంచినీళ్ళ ప్రాయంగా ఖర్చుపెట్టారని చెప్పచ్చు. పత్రికను ఓ మంచిరోజు చూసుకుని లాంచ్ చేశారు. చందాదారులకు మొదటి మూడురోజులు పత్రికను ఉచితంగా వేశారు. సాహి




త్యానికి కూడా ప్రాముఖ్యతనిస్తారని తెలియడంతో సాహిత్యకారులు సంబరపడ్డారు. అంతా బావుంది. పేపర్ సక్సెస్ కావడానికి కావలసిన హంగులన్నీ ఉన్నాయి. వార్తలు సేకరించే చక్కటి నెట్‌వర్క్, యాడ్స్, మంచి స్టాఫ్, ప్రోత్సహించే చందాదారులు అందరూ ఉన్నారు. త్వరలోనే 'వాయిస్' 'టైం'ను మించిపోతుందని నెంబర్‌వన్ స్థానాన్ని ఆక్రమిస్తుందని ఓనర్లూ, స్టాఫ్ అనుకున్నారు. కాని అలా జరగలేదు. కారణమేంటో ఊహించగలరా? "

ఒక్కక్షణం ఆగాడు సునీల్.

ఆయన ఏం చెప్తాడా అని అంతా ఆసక్తిగా ఎదురుచూడసాగారు.

అతిమామూలుగా స్పీచ్ ఆరంభించి, జనాన్ని ట్రాన్స్‌లోకి తీసుకువెళ్లి వాళ్లలా ఉండగానే తాను చెప్పాల్సింది పూర్తిచేసి వారితో ఆమోదముద్ర వేయించడం డాక్టర్ సునీల్ టెక్నిక్. అందుకే చీఫ్‌కు ఆయన అత్యంత ఆప్తుడయ్యాడు.

"కారణమేంటో మీలో ఎవరైనా ఊహించగలరా? " చుట్టూ చూస్తూ అడిగాడు సునీల్. అప్పటికే అక్కడ కూర్చున్నవారంతా దాన్ని గురించి ఆలోచిస్తున్నట్టు వాళ్ళ ముఖాలలో భావాలు మారుతున్నాయి.

దాదాపు మూడు నిమిషాలు గడిచినా ఎవ్వరూ జవాబు ఇవ్వకపోవడంతో చిరునవ్వుతో తలపంకించి ఏదో చెప్పబోయాడు. అంతలో.

"ఎస్ డాక్టర్ సునీల్! ఐ థింక్ నేను చెప్పగలననుకుంటాను..." తను కూర్చున్న చోటునే లేచి నిలబడి అంది ఆమె.

ఒక్కసారి అందరూ ఆమె వైపుకు తలలు తిప్పారు.

ఆమె మాటలకు సునీల్ ముఖంలో రంగులు మారాయి. అప్పటివరకు ఉన్న ప్రశాంతత స్థానంలో చికాకు చోటుచేసుకోబోతుంటే బలవంతాన నిగ్రహించుకుంటూ "ఎస్ డాక్టర్..." అంటూ పేరు తెలీనట్టుగా ఆగిపోయాడు.

ఎదుటివ్యక్తి పేరు తెలిసినా, తెలీనట్టుగాను మర్చిపోయినట్టుగాను నటించడం ద్వారా తనకు ఆసుపత్రి, రోగులు తప్ప వేరే విషయాలు పట్టవని, ఎంతో అంకితభావంతో పనిచేస్తానని ప్రొజెక్ట్ చేసుకోవడం ఆయన అలవాటు.

"డాక్టర్ తన్మయి..." ఆయన వాక్యాన్ని పూర్తిచేసింది.

"తన్మయి! వెరీనైస్ నేమ్... దయచేసి డయాస్‌మీదకు రండి" చిరునవ్వుతో ఆహ్వానించాడు సునీల్.

వేదికమీద తన్మయిని చూస్తుంటే సంప్రదాయానికి ప్రాణమొచ్చి, సంస్కృతికి రూపమొచ్చి కళ్ళెదుటకు నడచివచ్చినట్టుగా అనిపించింది వారందరికి.

చిరునవ్వుతో చేతులు జోడించింది.

తన్మయి చెప్పేది వినటంకోసం వళ్ళంతా చెవులు చేసుకుని మరీ వినసాగాడు మణి.

"డాక్టర్ సునీల్! మీరు చెప్పినట్టు 'వాయిస్' డైలీ పేపర్ మీద జనం కూడా చాలా ఆశలు పెట్టుకున్నారు. కాని ఊహించని విధంగా వారు అలా దెబ్బతినడానికి కారణం కేవలం 'పేపర్‌బాయ్స్'..."

నిరాసక్తంగా వింటున్న మణి "వాట్ తన్మయి! అంత పెద్ద సామ్రాజ్యపతనానికి కారణం కేవలం పేపర్‌బాయ్స్..." విభ్రమంగా అడిగాడు.

అవునన్నట్టుగా తలూపింది ఆమె.

"వెరీ ఇంట్రెస్టింగ్! కానీ నమ్మలేకపోతున్నాను..." ఈసారి కూడా ఆ మాటలలో ఆశ్చర్యం, దాంతోపాటే మెచ్చుకోలు తొంగి చూసింది.

సునీల్ ముఖంలో నవ్వు మాయమైంది.

తన్మయి చెప్పింది విని ఆ షాక్‌నుంచి తేరుకోడానికి ఆయనకు కొంచెం ఎక్కువ సమయమే పట్టింది. తన్మయిని సరిగా అంచనా వేయలేకపోయినందుకు తనను తానే నిందించుకుంటూ చిరునవ్వుని పులు

ముకుని అన్నాడు. "మేడమ్! మీరు చెప్పింది నూటికి నూరుపాళ్ళు నిజం. అయితే మన మిత్రులకు ఇంకా అర్థమైనట్టు లేదు కొంచెం వివరంగా చెప్పగలరా?"

ఆమె బెరుకుగా నీహారిక వంక చూసింది. ఏదో ఆవేశంలో ఈ మాత్రమైనా చెప్పిందికాని నిజానికి నలుగురిలో మాట్లాడ టమంటే ఆమెకు చాలా భయం.

'చెప్పండి ఫర్వాలేదు' అన్నట్టుగా కళ్లతో ధైర్యం చెప్పింది నీహారిక. దాంతో పూర్వపు ధైర్యం కొనితెచ్చుకుని వివరంగా చెప్పటం మొదలుపెట్టింది తన్మయి.

"ఢిల్లీల్లో ఎన్నో ఆంగ్లపత్రికలు వెలువడు తున్నా 'టైం', 'వాయిస్' ఈ రెండే ప్రధాన దినపత్రికలు. వీటిమధ్యే పోటీ. ఇంతకు ముందు కూడా 'టైం పత్రికను దెబ్బతీసేం దుకు తీవ్రంగా ప్రయత్నించారు. టైంలోంచి కొందరు వెళ్ళి ఆ పత్రికలో చేరినా కొన్నా ళ్లకు అది మూతపడిపోయింది. కాని 'వాయిస్' యాజమాన్యానికి ఉన్న ఆర్థిక వన రుల దృష్ట్యా ఈసారి 'టైం' పతనం కాకత ప్పదని అందరూ అనుకున్నారు.

సరే! అసలు విషయానికి వద్దాం... వాయిస్ సక్సెస్ కాలేకపోవడానికి పేపర్ బాయ్స్ ఎలా కారణం? అది అర్థం కావా లంటే ఈ రెండు పత్రికలు పాఠకులను చేరే సమయాన్ని దృష్టిలో పెట్టుకోవడం చాలా అవసరం. టైం పత్రిక సరిగ్గా అయిదు నుంచి అయిదున్నర లోపున వస్తుంది. అంటే ఇంకా పూర్తిగా తెల్లారకుండానే ప్రపం చవార్తలన్నీ మన చేతిలో వుంటాయన్న మాట. కానీ వాయిస్ పత్రిక మొదట్లో ఏడు, ఎనిమిది ఒక్కోసారి తొమ్మిది గంటలకు కూడా వచ్చేది. కొత్తగా పత్రిక ఆరంభించిన పుడు ఇలాంటి బాలారిష్టాలన్నీ తప్పవు. దాన్ని హుందాగా స్వీకరించి పాఠకులను తమతో సహకరించమని కోరితే బాగుం డేది. అలాకాక పత్రిక ఇంత ఆలస్యమవు తోందేంటి? అని అడిగితే పేపర్ బాయ్స్ చాలా నిర్లక్ష్యంగా సమాధానమిచ్చేవారు. మాకు కూడా పేపర్ ఆలస్యంగానే వస్తోం దండీ! ఇంతకన్నా పెందరాళే వేయటం కుద రదని చెప్పేవారు. అంటే అర్థమేమిటి? మేమింతే! ఇలాగే వుంటాము. మీ కోసం మా ప్రవర్తన మార్చుకోం. మీకు ఇష్టమైతే పేపర్ వేయించుకోండి. లేకపోయినా మాకేం నష్టంలేదనేగా."

అందరూ ఊపిరి బిగపట్టి మరీ వింటు న్నారు.

రెండు క్షణాల విరామం తర్వాత తన్మయి తిరిగి కొనసాగించింది. వాయిస్ పత్రిక బాయ్స్ ఉద్దేశ్యమేంటంటే పేపర్ ఇంట్లో మగవాళ్లే చదువుతారు. ఆడవారికి దాంతో అవసరం ఉండదు. కాబట్టి చాలా ఇళ్లల్లో మగవాళ్లు ఏడుదాటితే గాని నిద్రలేవరు కనుక ఆ టైంకి పేపర్ వేస్తే సరిపోతుంది. అయితే సరిగ్గా ఇక్కడే టైం పత్రిక భిన్నంగా ఆలోచించింది. పరిశోధనాత్మక వార్తలు, వ్యాసాలు ఇవన్నీ టైం సక్సెస్‌కు కారణాలే అయినా వాటిని పక్కన పెడితే టైం చదివే వారిలో మహిళలే ఎక్కువ. సహజంగా ఇక్కడి ఆడవారు ఉదయం అయిదునుంచి అయిదున్నర మధ్య నిద్రలేస్తారు. మర పుడు లేస్తేగాని వారి పనులు పూర్తికావు. అప్పుడు మొదలెట్టిన పనులు ఏ పన్నెం డుకో పూర్తవుతాయి. ఆ తర్వాత భోజనం చేసి కాసేపు నడుంవాలిస్తే బాగుండునను కుంటారేకాని పేపర్‌మీదకు మనసుపోదు. మరి వారితో పత్రిక చదివించాలంటే ఏ సమయం అనుకూలమైనదని ఆలోచిస్తే ఉదయం మాత్రమే అని తేలింది. నేటికీ చూడండి... నిద్రలేవగానే ముఖం కడిగి ఓ కప్పుకాఫీ తాగితేకానీ బండి కదలదు. ఆ కాఫీ తాగే సమయానికి కనుక వార్తాపత్రిక చేతిలో వుంటే భేషైన ఆలోచనకదూ! అందుకే ఎన్ని శ్రమలకోర్చి అయినా టైం పత్రికబోయ్స్ పాఠకులకు కావాల్సిన సమ యానికి పత్రిక అందించగలుగుతున్నారు.

అంటే గత కొన్నేళ్లుగా ఆడవారికి పేపర్ చదువుతూ కాఫీ తాగటం అలవాటయ్యింది. దీనివల్ల ప్రపంచంలో ఏమూల ఏం జరుగుతోందో తెలీటమే కాదు మధ్యాహ్నంపూట అమ్మలక్కల మీటింగ్‌లలో నానారకాల వార్తలు విన్పించడానికి కూడా పనికివచ్చింది. మరి వాయిస్ పరిస్థితి ఏమిటి? ఎన్నిసార్లు చెప్పినా పేపర్‌బాయ్స్ ప్రవర్తనలో మార్పురాలేదు. ఇది ఇలా కొనసాగుతుండగా టైం పత్రిక ఏజెంట్స్ ఇంటింటికి వెళ్లి తమ పేపర్ వేయించుకోమని, ఎప్పటిలాగే పెందరాళేనే వస్తుందనీ గుర్తు చేయసాగారు. మరోపక్క టైం పత్రిక నియమించిన బృందం తాలుకు వ్యక్తులు కూడా పాఠకులను కలిసి పత్రిక సకాలంలో వస్తోందా? పేపర్ బాయ్ ప్రవర్తన సరిగా ఉందా? సప్లిమెంట్స్ అన్నీ సక్రమంగా అందుతున్నాయా? పత్రిక మీకు నచ్చుతోందా? ఇంకా ఏఏ అంశాలు ఉంటే బాగుండుననిపిస్తోంది? మీకు అభ్యంతరకరమైనవి ఏవి? ఇతరత్రా మీ సూచనలు, సలహాలు ఏమైనా ఉన్నాయా? ఇలా అడగడం ఆరంభించారు. ఏజెంట్లతోపాటు ఇరవై ఐదేళ్ల లోపు యువకులైన పేపర్‌బాయ్స్ కూడా ఇంటింటికి వెళ్లి టైం వేయించుకోమని అభ్యర్థించసాగారు. ఉద్యోగం కోసం కాలయాపన చేయకుండా స్వశక్తితో పైకి రావాలనుకునే ఆ కుర్రాళ్లకు సాయం చేసినట్టుగా కూడా ఉంటుందని ఓ మోస్తరు ఆర్థిక పరిస్థితి ఉన్న వారెవ్వరికైనా అన్పిస్తుంది. ఈవిధంగా నేటికీ ఆ కుర్రాళ్ల లాంటివారు ఇంటింటికి తిరుగుతూనే ఉంటారు. అందువల్ల ప్రతినెలా వాళ్ల సర్క్యులేషన్ పెరుగుతూనే ఉంది. పై కారణాల దృష్ట్యా వాయిస్ మీద జనానికి ఆసక్తి తగ్గిపోయింది. ఫలితంగా పేపర్ ఆరంభమైన రెండో నెలలోనే అధికశాతం వాయిస్ వద్దని చెప్పి తిరిగి టైం వేయించుకోవడం మొదలెట్టారు. ఎక్కడో నగరాల్లో తప్పితే ఈ రోజుకీ ఒక పేపర్‌బాయ్ ఒక రకం పేపరే వేస్తాడు. అంటే టైం పత్రిక వేసే పేపర్‌బాయ్స్ వాయిస్ వేయరన్న మాట. ఒకవేళ అన్నిరకాల పత్రికలు ఒక్కరే వేసినా సమయానికి రాకపోతే ఎవ్వరు మాత్రం ఏం చేయగలరు? ఈవిధంగా ఒక గొప్ప ప్రాజెక్ట్ పతనమవడానికి కేవలం పేపర్ బాయ్స్ ప్రవర్తన కారణమయ్యింది" చప్పట్ల మధ్య ముగించింది తన్మయి. అందరికీ నమస్కరించి వేదికదిగిపోయి తన సీటు వద్దకు నడిచింది.

"చాలా బాగా చెప్పారు. యూ ఆర్ జీనియస్" తన్మయి చేయిపట్టుకుని వూపేస్తూ అంది నీహారిక.

"థాంక్యూ" అంటూ ముఖాన పట్టిన చెమటను కర్చీఫ్‌తో అద్దుకుంది తన్మయి.

క్షణకాలం అందరినీ పరికించి అప్పుడు అన్నాడు డాక్టర్ సునీల్ "కంగ్రాట్స్ డాక్టర్ తన్మయీ! చాలాబాగా చెప్పారు. నేను చెప్పివుంటే ఇంత వివరంగా చెప్పగలిగే వాడిని కాదేమో!"

మరోసారి అంతా ఆమెను అభినందించారు.

"సో! మైడియర్ ఫ్రెండ్స్! నేనిక్కడ చెప్పదలుచుకున్నదేంటంటే... మనం ఓ ప్రాడక్ట్‌ని తయారుచేశాం. చాలా అద్భుతమైనదే కావచ్చు. కానీ మార్కెట్లో మాక్సిమమ్ కాప్చర్ చేయగలిగితేనే సక్సెస్ అయినట్టు. అలా రీచ్ అవ్వాలంటే మన టార్గెట్ ఎవరు? ఎవరికోసం ఆ ప్రాడక్ట్ తయారు చేశాం? అనేవి దృష్టిలో పెట్టుకోవాలి. టైం, వాయిస్ ఈ రెండిటికే కాదు ఏ పత్రికకైనా టార్గెట్ పాఠకులే. వారిని సంతృప్తిపరచగలిగితే, వారితో తమ ప్రవర్తన సక్రమంగా ఉండేలా చూసుకోగలిగితే మనకు ఢోకా ఉండదు. డాక్టర్ తన్మయి చెప్పినట్టు టైం పత్రిక స్టాఫ్ ఎవ్వరైనా సరే ఎదుటివారితో ఎంతో నమ్రతగా ప్రవర్తిస్తారు. ఓ పేపర్ బాయ్, సెక్యూరిటీ, పత్రిక స్టాఫ్, ఎడిటర్, ఛైర్మన్ ఎవ్వరైనాసరే విధేయతకు ప్రతిరూ



పంగా ఉంటారు. ఏదైనా సమాచారం కోసం ఫోన్ చేస్తే వారికి సంబంధించనిది అయితే సంబంధిత డిపార్ట్‌మెంట్‌కు కనెక్ట్ చేస్తారే తప్ప మాకు తెలీదు. మాకు సంబంధంలేదు అనరు. టైం పత్రిక, సురక్ష లాంటివి నెంబర్ వన్‌గా నిలవడానికి కారణం వారు ప్రజలతో ప్రవర్తించేవిధానం. ఆ తర్వాతే మిగతావన్నీను. నా పరిశీలనలో తెలిందేంటంటే సురక్ష వారు జూనియర్ డాక్టర్స్‌కు, కొత్తగా జాయిన్ అయ్యే హాస్పిటల్ స్టాఫ్‌కు బిహేవియర్ ట్రైనింగ్ ఇస్తున్నారు. ప్రతి నిముషం వారిని పరిశీలిస్తూ వుంటారు. ఎవరి ప్రవర్తన అయినా బాగుండకపోతే రెండు, మూడుసార్లు హెచ్చరిస్తారు. అప్పటికీ వారిలో మార్పురాకపోతే నిర్దాక్షిణ్యంగా ఉద్యోగంలోంచి తీసేస్తారు. సదరు వ్యక్తి సర్వీసు, నైపుణ్యతలను ఎంత మాత్రం పరిగణనలోకి తీసుకోరు. అందుకే అక్కడకు వెళ్లిన రోగులు ఆస్పత్రిలో ఉన్నామే అని బాధపడరు. కష్టకాలంలో నలుగురు ఆత్మీయులు తోడున్నారుకదా అని ఆనందపడతారు. మన క్లినిక్‌లో కూడా అలాంటి ట్రైనింగ్ మొదలుపెడితే మంచిదని నా ఉద్దేశ్యం. ప్రత్యేకంగా ఎవరినీ ఉద్దేశించి చెప్పలేనుగానీ ఈమధ్య రోగులు తమ పట్ల మన స్టాఫ్ ప్రవర్తనా విధానం సక్రమంగా లేదని చాలా అసంతృప్తి వ్యక్తం చేస్తున్నారు. ఇది మనం ఇప్పుడే మొగ్గలో ఉండగానే సరిచేసుకోలేకపోతే భవిష్యత్తులో చాలా పెద్ద సమస్య ఎదుర్కోవలసి వస్తుంది" అని చెప్పి డాక్టర్ సునీల్ వెళ్లి తన స్థానంలో కూర్చున్నాడు.

తన్మయి మూలంగా డిస్టర్బ్ అవడంవల్ల ఆయన అంతకన్నా ఎక్కువ మాట్లాడలేకపోయాడు.

డాక్టర్ సునీల్ చెప్పినది అందరికీ నచ్చింది. చీఫ్ ఆయనను ప్రత్యేకంగా అభినందించారు. అయితే అవేమీ స్వీకరించే స్థితిలో లేడాయన.

ఆ తర్వాత కూడా సమావేశం కొనసాగేదేకానీ ఆరోగ్యశాఖమంత్రి గారి భార్య వస్తున్నారన్న సమాచారం రావడంతో అక్కడితో ఆ మీటింగ్‌ను అర్థాంతరంగా ముగించేశారు.

మామూలుగానే ఎవరి డ్యూటీలో వారు జాయిన్ అయిపోయారు. డ్యూటీ పూర్తయిన వారు ఇళ్లకు పయనమయ్యారు.

డాక్టర్ సునీల్ మాత్రం తన క్యాబిన్‌లోనే వుండిపోయాడు. తనను ఎవ్వరూ డిస్టర్బ్ చేయద్దని రిసెప్షన్‌లో చెప్పాడు.

డాక్టర్ సునీల్ తానుమాత్రమే తెలివికలవాడిననీ, మిగతావారంతా తెలిపితక్కువ వారనీ అనుకుంటాడు.

నిశ్చయంగా తనకన్నా తన్మయి మేధావురాలని సునీల్‌కు అర్థమైంది. అందుకే అంతగా డిస్టర్బ్ అవుతున్నాడు.

తన్మయి సమాధానం చెప్పేసరికి మొదట్లో మామూలుగానే తీసుకున్నాడు. కానీ ఆమె విశ్లేషణ విన్నాక సునీల్ విభ్రాంతి చెందాడు. ఆయన పరిస్థితి మతిపోవడానికి కాస్త అటుఇటుగా ఉంది.

సునీల్ ఇంతగా తన్మయి గురించి ఆలోచించడానికి ఓ కారణం ఉంది.

అమృతకు సంబంధించి డాక్టర్ సునీల్ తప్పితే మరొకరెవ్వరూ డాక్టర్ మణి దృష్టిలో పడకూడదు. ఆయనకు దగ్గర కాకూడదు. ఆవిధంగా ఇన్నాళ్లూ ఎలాగో అలా మానేజ్ చేసుకుంటూ వచ్చాడు. కాని ఇప్పుడు తన్మయి రూపంలో ప్రమాదం వస్తుందేమోనని భయపడుతున్నాడు. మణి తర్వాత కాబోయే చీఫ్‌గా హోదా అనుభవిస్తున్న సునీల్ ఆమాత్రం భయపడటంలో విడ్డూరమేం లేదు.

చాలాసేపు సుదీర్ఘంగా ఆలోచించాడు. కాని తన్మయిని ఎలా అడ్డు తొలగించాలో అర్థంకాలేదు. త్వరలో తన్మయి పని పూర్తయిపోవాలి. ఆమె తన ఉద్యోగం వదిలివెళ్లిపోవాలి. అందుకు ఏం చేయాలనేది మరు




సటి రోజు పేపర్లో ఓ వార్త చూశాక ఆయ నకు స్ఫురించింది.



"దేశంలో నానాటికీ పెరుగుతున్న ఇంపోటెన్సీ" అన్న హెడ్డింగ్‌తో మొదలైన ఐటమ్ అమృతలో పని చేస్తున్న నలుగురి దృష్టిని ఆకర్షించింది.

"పిల్లలు కలగక చికిత్సకోసం బెంగుళూరు లోని అమృతకు వస్తున్న మగవారిలో దాదా పుగా అందరూ ఇంపోటెన్సీతో బాధపడ్తున్న వారే! నిజంగా ఇంతమంది నిర్వీర్యం అయి పోవడానికి కారణమేంటో తెలుసుకోకపోతే రాబోయే కాలంలో దేశంలో ఇక సహజ గర్భధారణలు ఉండకపోవచ్చు. ఫలితంగా అంతా కృత్రిమ గర్భధారణ కోసం ఐ.వి. ఎఫ్ (ఇన్‌విట్రో ఫెర్టిలైజేషన్) మీద ఆధార పడవలసి వస్తుంది" అని అర్థం వచ్చేలా కొనసాగింది.

నిజానికి అది వార్త కాదు! వ్యాసమూ కాదు. బెంగుళూరులో వున్న అమృత పాలీ క్లినిక్‌లో పని చేస్తున్న డాక్టర్ జయరాం అభిప్రాయం అది. ఆయన తన దృష్టికి వచ్చింది చెప్పాడు తప్ప అందులో అమృత క్లినిక్‌కు నష్టం కలిగించాలనే ఆలోచన ఎంత మాత్రం లేదు.

అయితే సంచలనాత్మక వార్తలకే ఎక్కువ ఆదరణ కాబట్టి ఓ పక్క అమృతలో జరిగిన సంరంభాల గురించి వివరిస్తూ మరోపక్క డాక్టర్ జయరాం అభిప్రాయం కూడా ప్రచు రించేసరికి అది సంచలనానికి దారితీసింది.

యధాలాపంగా పేపర్ చదువుతున్న చీఫ్ డాక్టర్ మణి ఇది చదివి ఉలిక్కిపడ్డాడు.

తన్మయిని ఎలా అడ్డు తొలిగించుకోవాలా అని దీర్ఘంగా ఆలోచిస్తున్న డాక్టర్ సునీల్‌కు పరిష్కారం దొరికింది.

క్లినిక్ అడ్మినిస్ట్రేషన్ విభాగంలో పని చేస్తున్న విశాల్ కళ్లు ఆ వార్త చదవగానే ఆనందంతో మెరిశాయి.

ఇక డాక్టర్ నీహారికలో అనుమానం బల పడింది.

★ ★ ★

డాక్టర్ పవన్! ఆ రోజు చాలా ఉత్సా హంగా ఉన్నాడు.

సురక్ష సూపర్‌స్పెషాలిటీ హాస్పిటల్ అండ్ రీసెర్చి సెంటర్‌లో పని చేస్తున్నాడు. అతన్ని చూస్తే డాక్టర్ అని ఎవ్వరూ అను కోరు.

ఆజానుబాహుడు, అరవింద దళాయతాక్షుడు మాత్రమేకాదు. చక్కటి రూపం, హుందా తనం, ఠీవి. అయితే అతన్ని చూస్తే అంతా సినిమా హీరో అని అనుకుంటారు. ఆ హాస్పిటల్‌కు వచ్చే కొందరు చిన్న పిల్లలు పవన్ దగ్గర ఆటోగ్రాఫ్ తీసుకుంటుంటారు. వారికి చెప్పినా అర్థంకాదు కనుక ఓ సంతకం చేస్తే పోయేదేముందిలే అనుకుం టాడతను.

స్టేట్స్‌లో ఎమ్.ఎస్. చేసి వచ్చాడు. దేశ భక్తి కానీండి. తండ్రిమీద వాత్సల్యం అని కానీండి అమెరికాలో వచ్చిన ఆఫర్స్‌ను కాదని, సురక్షలో జాయిన్ అయ్యాడు.

ఆరోజు ఉదయం అతనికో ఫోను వచ్చింది.

సాధారణంగా ఆపరేటర్ రిసీవ్ చేసుకుని

సంబంధిత డాక్టర్‌కో లేక స్టాఫ్‌కో కనెక్ట్ చేస్తుంటుంది. కానీ అంత పొద్దున్నే రావటంవల్ల పైగా ఆ సయమంలో రిసెప్షన్ దగ్గర ఉండటంవల్ల పవన్ ఫోన్ లిఫ్ట్ చేశాడు.

కాజువల్‌గా ఫోన్ ఎత్తిన అతను అవతలివైపు మాట్లాడుతున్న వ్యక్తి పేరు వినగానే కొంచెం అలెర్ట్ అయ్యాడు. ఎందుకంటే ఆ వ్యక్తిమీదనున్న అభిమానం ఈనాటిది కాదు.

చిన్నతనంలో అతని రూమ్‌నిండా ఆమె ఫోటోలే ఉండేవి. అంత పిచ్చి ఆమె అంటే. ఇప్పుడంటే మెచ్యూరిటీ వచ్చిందికానీ ఆ వయసులో ఏం తెలుసని?

అటునుంచి ఆమె ఫోన్ టాప్ చేస్తూ హల్లో! హల్లో! అంటోంది.

తన ఆలోచనల్లోంచి బయటకు వచ్చి "ఆ చెప్పండి మేడమ్" అన్నాడు

"నేను డాక్టర్ కృష్ణప్రసాద్‌గారితో మాట్లాడాలి" అంది ఆమె.

"డాక్టరుగారు ఇంకా రాలేదు మేడమ్! నేను కృష్ణప్రసాద్‌గారి అబ్బాయిని మాట్లాడుతున్నాను" అన్నాడు పవన్.

ఎంత దాచినా దాగని ఉద్వేగం ఆ స్వరంలో వ్యక్తమవుతూనే వుంది.

"నేను హాస్పిటల్‌కు రావాలనుకుంటున్నాను. నాకు అపాయింట్‌మెంట్ కావాలి" అడిగింది ఆమె.

తన దగ్గరున్న డిజిటల్ డైరీ చూసి ఏ రోజు రావాలో చెప్పి ఫోన్ పెట్టేశాడు పవన్.

ఆమె ఆంధ్రుల ఆరాధ్య నటి.

చిన్నతనంలో తానెంతగానో అభిమానించిన వ్యక్తితో మాట్లాడటం అతనికెంతో అబ్బురంగా తోచింది.

అయితే ఆమె సురక్షకు ఎందుకు రావాలనుకుంటోందో అతనికి అర్థంకాలేదు. ఆ విషయం అప్పుడప్పుడు పవన్ మనసులో మెదులుతూనే ఉంది.

★ ★ ★

"హల్లో! ఈజిట్ అమృతా పాలీక్లినిక్"

"ఎస్..." అంది రిసెప్షనిస్ట్.

"నేను డాక్టర్ జయరాంగారితో మాట్లాడాలి" అంది నీహారిక.

పేపర్‌లో వార్త చదివాక ఎంతో ఆలోచించిన మీదట డాక్టర్ జయరాంతో మాట్లాడాలనే నిర్ణయించుకుంది.

"మీరెవరు మాట్లాడుతున్నారు? ఆయనతో మీకేంటి పని?" అటునుంచి రిసెప్షనిస్ట్ అడిగింది.

నీహారికకు తన పేరు చెప్పడం ఇష్టం లేదు. అలా చెప్పిన మరుక్షణం తాను బెంగుళూరుకు ఫోన్ చేసిన విషయం డాక్టర్ మణికి చేరిపోతుంది. అది తనను ప్రమాదంలో పడేస్తుంది.

"చూడండి మేడమ్! ఇది అఫిషియల్ కాల్‌కాదు. నేను ఆయనకు కజిన్‌ని అవుతాను. ఆయనతో పర్సనల్‌గా మాట్లాడాలి"

"సారీ మేడమ్! డాక్టరుగారు ఊళ్లోలేరు" అని రిసెప్షనిస్ట్ ఫోన్ పెట్టేసింది.

ఆ తర్వాత రెండు మూడుసార్లు ట్రై చేసింది. అప్పటిదాకా నమ్రతగా ఓపిగ్గా మాట్లాడుతున్నవారు జయరాంతో మాట్లాడాలి అని అనగానే ఫోన్ కట్ చేయడమో, డాక్టర్ ఊరు వెళ్లారని చెప్పడమో చేస్తున్నారు. అసలు ఆయన అక్కడ ఉన్నాడా? ఉద్యోగంలోంచి తీసేశారా? లేక ఆయనకేదైనా ప్రమాదం జరిగిందా?

ఒకసారి బెంగుళూరు వెళ్లి రావాలని నిర్ణయించుకుంది నీహారిక. అందుకోసం అన్ని ఏర్పాట్లు చేసుకుంది.

అంతలో ఫోన్ మోగింది.

సమయం రాత్రి పదకొండు గంటలవుతోంది.

"నీహారికా! నేను తన్మయిని. బామ్మకు గుండెనొప్పి... ఏం చేయను? వెంటనే వస్తావా?" టెలిగ్రాఫిక్ భాషలో మాట్లాడుతోంది ఆమె.





బామ్మకు గుండెనొప్పి వచ్చిందన్న ఆందోళన, భయం, కంగారు, వీటిన్నింటి మూలంగా ఆమె స్వరం తడబడుతోంది. ఫోన్‌లోనే ఏడ్చేస్తోంది.

తన్మయి చెప్పిందేంటో నీహారికకు అర్థమైంది. మరేమీ ప్రశ్నించకుండా "తన్మయీ! నేను వస్తున్నాను. నువ్వు ఖంగారు పడకు" అని చెప్పి ఫోన్ పెట్టేసింది.

తాను తన్మయి ఇంటికి బయలుదేరుతూ, అమృతక్లినిక్‌కు ఫోన్ చేసి తన్మయి అడ్రస్ చెప్పి అంబులెన్స్ పంపమంది.

బామ్మను ఆస్పత్రికి తీసుకెళ్లారు. కార్డియాలజీ విభాగంలో చేర్చారు.

తన్మయి ప్రేక్షకురాలిలా చూస్తుండిపోయింది. అన్ని ఫార్మాలిటీలు నీహారికే పూర్తి చేసింది. ఆ రాత్రంతా తన్మయికి తోడుగా నీహారిక కూడా ఆస్పత్రిలోనే ఉండిపోయింది.

మరుసటిరోజుకు బామ్మకు కొంచెం నెమ్మదించిందని డాక్టర్లు చెప్పాక తన్మయి మనసు కుదుటపడింది. వీలైనంత త్వరగా బైపాస్ సర్జరీ చేయాలని చెప్పినప్పుడు మాత్రం తన్మయి చిన్నపిల్లలా ఏడ్చేసింది. తల్లిలా అక్కున చేర్చుకుంది నీహారిక.

కష్టంలో ఉన్నప్పుడు మనిషికి సాయంగా ఎవరైనా వస్తే బాగుండుననిపిస్తుంది. అందుకే కాబోలు ఆ సమయంలో దేముడు గుర్తుకు వస్తాడు.

బామ్మకు గుండెనొప్పి రావడంవల్ల తన్మయి, నీహారికలిద్దరూ మరింత దగ్గరయ్యారు.

దీనిమూలంగా నీహారిక బెంగుళూరు ప్రయాణం వాయిదా పడింది. ఆ వాయిదా పడటం మరో రెండు రోజులదాకా ఊరు వెళ్లడానికి కుదరలేదు.

★ ★ ★

పేపర్‌లో డాక్టర్ జయరామ్ అభిప్రాయం అచ్చవడంవల్ల మణికి చాలా సమస్యలు ఎదురయ్యాయి. లాభాలకు అలవాటుపడ్డ ఆస్పత్రి యాజమాన్యం నష్టాన్ని భరించడానికి సిద్ధంగా లేదు. అందుకే ఛీఫ్‌ను పిలిచి వివరణ అడిగారు. అప్పటికి ఏదో సర్దిచెప్పాడు, కాని నిజానికి తన సమాధానం మణికే సంతృప్తికరంగా అన్పించలేదు. అందుకే డాక్టర్ సునీల్‌కు రింగ్‌చేసి వెంటనే తనని కలవమని చెప్పాడు.

డాక్టర్ సునీల్ ఈ అవకాశం కోసమే ఎదురు చూస్తున్నాడు. ఆ రోజు ఇద్దరూ లంచ్ సమయంలో కలిశారు.

"మీరు నిజంగా బ్రిలియంట్ డాక్టర్! ఆరోజు జరిగిన సమావేశంలో మీరు చేసిన సూచన నాకు బాగా నచ్చింది. దాన్ని గురించి వివరంగా చర్చిద్దామని పిలిపించాను. మనం కూడా అలాంటి శిక్షణలాంటిదేదైనా ప్రారంభిస్తే బాగుంటుందన్పిస్తోంది. మీరేమంటారు? "

"బానే వుంటుంది... కాకపోతే"

చెప్పండన్నట్టుగా తలాడించాడు మణి.

"మనం అనుకున్న శిక్షణాకార్యక్రమమదీ మొదలై రిజల్ట్ రావడానికి కొంచెం టైమ్ పడుతుంది. ఇందువల్ల క్రమంగా రోగుల సంఖ్య పెరుగుతుందే తప్ప ఎలాంటి సంచలనం కలిగించదు. మనమిప్పుడు ఏదైనా చేయాలి. దాంతో మరోసారి మన క్లినిక్ మారుమ్రోగిపోతుంది. జనం మన క్లినిక్ ముందు బారులు తీరతారు. అలాంటిది... అలాంటిదేదైనా చేయాలి" ఒకరకమైన ఎక్సైట్‌మెంట్‌తో అన్నాడు డాక్టర్ సునీల్.

క్లినిక్ గురించి అంతగా ఆలోచిస్తున్న సునీల్‌ను అభినందించకుండా వుండలేకపోయాడు మణి.

"చెప్పండి సునీల్! ఏం చేస్తే బాగుంటుందంటారు? " అడిగాడు ఛీఫ్.

"మనం చేయాల్సిందేంలేదు మణీ! ఏమైనా చేస్తే డాక్టర్ తన్మయి చేయాలి"

"తన్మయా? " విస్మయంగా అన్నాడు మణి.

"అవును! నేను తన్మయి పరిశోధన

గురించి అంతా వివరంగా తెల్సుకున్నాను. ప్రస్తుత పరిస్థితుల్లో ఆ పరిశోధనే మన ఆయుధం" ఛీఫ్ ముఖంలోకి చూస్తూ జాగ్రత్తగా చెప్పసాగాడు సునీల్.

"నిజమే... కాని ఆమె పరిశోధన ఇంకా పూర్తి కాలేదుగా" నిస్సహాయత ధ్వనించింది మణి స్వరంలో.

ఒక్క క్షణం మౌనంగా వూరుకుని, తర్వాత ఇలా అన్నాడు... "ఈ విషయం కూడా నేను ఆలోచించాను. గత ఆరు నెలలుగా డాక్టర్ తన్మయి ఈ పి.జి.డి. గురించి అధ్యయనం చేస్తూనే వుంది. కాని అది పూర్తికావడంలేదు. అలా అని ఆమె నిజాయితీని కాని మేధస్సును కాని శంకించడం లేదు. కాకపోతే మనమిప్పుడున్న పరిస్థితిలో ఆమె తన రీసెర్చిని పూర్తిచేయడం చాలా అవసరం"

"కానీ ఫోర్స్ చేస్తే ఆ అమ్మాయి బెదిరిపోతుంది. పైగా ఆ రంగంతో పరిచయం ఉన్న మనం ఆమెను ఒత్తిడి చేయడం భావ్యంకాదు కూడానూ"

తన ఆలోచనను వెంటనే ఒప్పుకోకపోయినా కనీసం పూర్తిగా కాదననందుకు సునీల్ ఆనందపడ్డాడు.

"నిజానికి పి.జి.డి. కొత్త పద్ధతేంకాదు. ఆ విషయం మాకూ తెలుసు. మాలిక్యులర్ జెనిటిక్స్‌లోని నవీన ప్రక్రియలనూ, ఇన్ విట్రో ఫెర్టిలైజేషన్‌ను మేళవించి పి.జి.డి.ని రూపొందించారు. ప్రపంచవ్యాప్తంగా కేవలం ఏడు కేంద్రాలలలో మాత్రమే అందుబాటులో ఉన్న దీనిని మనం కనుక ఆరంభించగలిగితే మన క్లినిక్‌తో పోటీపడ గలవారు ఎవ్వరూ ఉండరు. మీరు కోరుకున్న బిడ్డను కనే అవకాశం అమృతాపాలీ క్లినిక్ కల్పిస్తుందని కనుక ప్రకటన ఇస్తే జనం ఉప్పెనలా విరుచుకుపడతారు. ఇదంతా వీలైనంత త్వరలో పూర్తవ్వాలి" అన్నాడు సునీల్.

ఆయన చెప్తున్నదేమిటో మణికి పూర్తిగా అర్ధంకాలేదు. డాక్టర్ సునీల్ ప్రవర్తన ఆశ్చర్యం కల్గిస్తోంది. మొన్నటి సమావేశంలో 'బిహేవియర్' ట్రైనింగ్ గురించి మాట్లాడిన సునీల్ ఇప్పుడు దాన్ని పక్కన పెట్టి తన్మయి రీసెర్చిమీదే క్లినిక్ భవిష్యత్తు ఆధారపడి వుందని చెప్పడంలో నిజం వున్నా ఎలా సాధ్యమో ఆయనకు అర్ధంకావడంలేదు. అయితే సునీల్ గురించి తెలిసినవాడవటంచేత తొందరపడి తన సంశయాన్ని బయటపెట్టలేదు. ఎందుకంటే అవతలివాడు తనకన్నా తెలివితక్కువవాడని ఏమాత్రం అర్ధమైనా వారి భుజాలెక్కి మరీ స్వారీ చేస్తాడు సునీల్ అని మణికి తెలుసు.

"డాక్టర్ సునీల్!" నెమ్మదిగా పిలిచాడు. "మీరు ఏం చెప్పదల్చుకున్నారో నిస్సంకోచంగా చెప్పండి. మీరేం చేసినా ఈ క్లినిక్ భవితవ్యం కోసమే తప్ప ఇందులో మీకెలాంటి స్వార్ధం ఉండదని నాకు తెలుసు. ఎన్నోసార్లు మీ అమూల్యమైన సలహాలతో క్లినిక్‌ను ఆదుకున్నారు. సో! మీ మనసులో ఏముందో స్పష్టంగా చెప్పండి"

మణి ఇచ్చిన భరోసాతో సునీల్ స్వరంలో మరింత ఉత్సాహం చోటుచేసుకుంది.

"డాక్టర్! మీరు నా మీద ఉంచిన నమ్మకానికి చాలా థ్యాంక్స్! దాన్ని వమ్ముచేయననే అనుకుంటున్నాను. మీరు మన బెంగుళూరు బ్రాంచిలో పనిచేస్తున్న డాక్టర్ జయరాం ఇచ్చిన స్టేట్‌మెంట్ చదివారనుకుంటాను"

"చదివాను..." వెంటనే అన్నాడు మణి.

అది గుర్తురాగానే మణి ముఖం ఎర్రగా కందిపోయింది. కళ్ళు అగ్నిగోళాలయ్యాయి.

"సర్! మీరు ఆ సమస్యను మరోవిధంగా పరిష్కరించుకోవచ్చు అయితే ఇప్పటికే మనం నలుగురి దృష్టిలో పడ్డాం. వారు ఆ వార్త గురించి మాట్లాడుకోకుండా ఉండాలంటే, దాన్ని మర్చిపోవాలంటే ఏదైనా సెన్సే





షన్ క్రియేట్ చేయక తప్పదు. నిజానికి ప్రస్తుతం వైద్యం కూడా ఓ వ్యాపారమైపో యింది. అందుకే కొన్ని గిమ్మిక్స్ చేస్తే తప్ప పోటీదారులను తట్టుకోవటం, రోగులను ఆకర్షించడం కష్టం. దీన్ని దృష్టిలో పెట్టు కుని మనం మేల్ కాంట్రాసెప్టివ్‌ను రూపొందించాం. ఇందులో చాలా లొసుగు లున్నాయనీ, సంతానం కలగలేదన్న బాధతో చికిత్సకోసం వచ్చిన మగవారినంద రిని మనమే కావాలని నిర్వీర్యం చేసి తిరిగి వైద్యంపేరిట వారినుంచి వేలకువేలు డబ్బు గుంజుతున్నామనే అపోహ లేదా అను మానం క్రమంగా జనంలో కలుగుతోంది. దీనికి జయరాం స్టేట్‌మెంట్ ఆజ్యం అవు తుంది. పరిస్థితి చేయిదాటిపోకముందే మనం కళ్ళు తెరవాలి. 'కోరుకున్న బిడ్డ'ను మించిన స్లోగన్ మరోటి ఉంటుందని నేన నుకోను" చెప్పడం పూర్తిచేసి బలంగా శ్వాసించాడు. సునీల్.

"కానీ గత ఆరు నెలలుగా పూర్తికానిది ఇంత తక్కువ వ్యవధిలో మాత్రం ఎలా సాధించగలుగుతుంది" నిస్సహాయంగా అన్నాడు మణి.

"ఓ మంచి అవకాశం పోతోందనే బాధకు అసహనం కూడా తోడైంది.

సునీల్ తాపీగా అన్నాడు "ఆ నమ్మకం నాకు కూడా లేదు"

మొహం చిట్లిస్తూ "మరెలా? " అడిగాడు మణి.

మణి ముఖంలోకి సూటిగా చూస్తూ "మనమేమీ సాధించకపోయినా, పి.జి. డి.లో సక్సెస్ అయ్యామని ప్రకటించడం ద్వారా" అన్నాడు సునీల్.

చీఫ్ ఇంకా కన్‌ఫ్యూజన్‌లోనే ఉన్నాడు. ఆయన తేరుకోకముందే కొనసాగించాడు. "సర్! పి.జి.డి. ప్రయోగం పక్కనపెడదాం. లింగ నిర్ధారణకోసం మనం జరిపే అతిసా ధారణ పద్ధతిద్వారా కూడా మనం ఈ ఫలి తాన్ని సాధించవచ్చు. అయితే పి.జి.డి.తో పోలిస్తే దీనిలో సక్సెస్ శాతం చాలా తక్కువ. అయినా సరే ప్రస్తుతానికి మనముందున్నమార్గం ఇదే. కనుక మొదట తన్మయితో పి.జి.డి. ప్రక్రియ చేపట్టి సక్సెస్ అయ్యామని ఇంటర్వ్యూ ఇప్పించేద్దాం. అక్కడితో ఆమె పని అయిపోతుంది. మళ్ళీ ఆమె తన పరిశోధన తాను చేసుకోవచ్చు. మనం మాత్రం తన్మయి ప్రయోగం పూర్త య్యేదాకా అన్ని సంతానసాఫల్య కేంద్రాలలో అమలులో ఉన్న పద్ధతినే అనుసరిద్దాం"

సునీల్ చెప్పింది విని మణి నిజంగానే చకితుడయ్యాడు.

సంవత్సరంక్రితం తన్మయి వచ్చి యవ్వన రహస్యాన్ని ఛేదించే జన్యువు గురించి తాను పరిశోధన చేయదలుచుకున్నానని చెప్పిన ప్పుడు మణి చాలా ఆనందపడ్డాడు. ఆ ప్రయోగం సక్సెస్ అయితే వచ్చే లాభాల గురించి అప్పటికప్పుడే లెక్కలేసేశాడు. మామూలు ప్రజలను పక్కనపెడితే తమ గ్లామర్‌ను పణంగా పెట్టి డబ్బు సంపాదిం చుకునే మోడల్స్, సినిమా నటులు ఎంత ఖర్చయినా వెనుకాడకుండా తమ క్లినిక్ ముందు 'క్యూ'లు కడతారు. అందుకే తన్మ యికి ఎన్నో ప్రత్యేక సౌకర్యాలు కల్పిం చాడు. ఈలోగా పి.జి.డి. గురించి పేపర్లో చదివాడు. డాక్టర్ తన్మయి ఎంతో అంకిత భావంతో పనిచేస్తుందని తెలుసు కాబట్టి పి.జి.డి.ని అధ్యయనం చేయమని చెప్పాడు. 'కోరుకున్న బిడ్డను పొందే సౌకర్యం' అనే ప్రకటన జనాన్ని ఎంతగా ఆకర్షిస్తుందో మణికి తెలుసు. కాని ఎందువ ల్లనో డాక్టర్ తన్మయి గత ఆరు నెలలుగా ఎంత సిన్సియర్‌గా ప్రయత్నిస్తున్నా సక్సెస్ కాలేకపోతోంది. తొందరపెడితే తన్మయి లాంటి సున్నిత మనస్కురాలు ఎక్కడ ఉద్యోగం మానేసి వెళ్ళిపోతుందోనన్న భయంతో తన అసహనాన్ని, కోపాన్ని తన లోనే దాచుకుంటూ వచ్చాడు.

"డాక్టర్ మణి! నేను చెప్పింది..."



చతుర... 29

"బావుంది... నిజంగా బావుంది" చిరునవ్వు నవ్వాడు మణి.

డాక్టర్ సునీల్ పెదవులు కూడా నవ్వుతో విచ్చుకున్నాయి. జింకపిల్లను చూసి తనకు ఆహారం దొరికిందని సంబరపడే మృగరాజు పెదవులమీద కదలాడే నవ్వులా ఉంది. అయితే ఇక్కడ జింకపిల్ల డాక్టర్ మణి కాదు. ఈ కుట్రలు, కుతంత్రాలు ఏమీ తెలీని అమాయకురాలు డాక్టర్ తన్మయి.

"థాంక్యూ డాక్టర్! సరిగ్గా వారం తర్వాత ప్రెస్‌మీట్ ఏర్పాటుచేసి తన్మయి ప్రయోగం గురించి వివరిద్దాం. మన క్లినిక్‌లో పురుడుపోసుకుని, మగబిడ్డను కన్న ఓ జంటకు కొంత డబ్బు ముట్టచెప్పి వారినే తన ప్రయోగానికి ఎన్నుకున్నట్టుగా తన్మయితో చెప్పిద్దాం. మగబిడ్డ కలగాలని ఎందరో దేవుళ్ళకు మొక్కుకుంటే ఎవ్వరూ తమ మొర ఆలకించలేదని, అమృతకు వెళ్ళాక తమ చిరకాలవాంఛ నెరవేరిందని ఆ దంపతులు చెప్తారు. దాంతో మన క్లినిక్ పేరు మారుమోగిపోతుంది. జనం మన క్లినిక్ ముందు బారులు తీస్తారు. మనం ఉపయోగించే అతి మామూలు ప్రక్రియనే ఇందుకు వినియోగిద్దాం. ఒకరకమైన ప్రోటీన్ ద్రావణంలో వీర్యం శాంపిల్‌ను వేస్తే తేలికైన 'వై' క్రోమోజోమ్స్ పైకి తేలతాయి. వీటిని వేరు చేసి కృత్రిమ గర్భధారణకు వినియోగిద్దాం. దంపతులు కోరుకున్న బిడ్డను అందించేందుకు ప్రయత్నిద్దాం. కాని పరీక్షలో వారికి పుట్టిన బిడ్డే వారు కోరుకున్న బిడ్డ అని చెప్పేలా మానేజ్ చేస్తాం. అవసరమైతే ఇందుకోసం సామ, దాన, భేద దండోపాయాలు ఉపయోగించడంలో తప్పేంలేదు. మీరు తన్మయిని ఒప్పించండి చాలు! మిగిలినదంతా నేనే చూసుకుంటాను" ఛీఫ్‌వైపు సూటిగా చూస్తూ, తాను చెప్పాల్సింది చెప్పాడు సునీల్.

డాక్టర్ సునీల్ ముఖం ఇప్పుడెంతో ప్రశాంతంగా ఉంది.

తాను అనుకున్నది సాధించానన్న సంతృప్తి, గర్వం కూడా ఆయనలో కన్పిస్తున్నాయి.

ఇక డాక్టర్ మణి అయితే తేరుకోడానికి కొంచెం ఎక్కువ సమయమే పట్టింది. మణి కాకుండా ఆ స్థానంలో మరొకరు ఉండి ఉంటే సునీల్‌మీద అభినందనల వర్షం కురిపించేవారు, ఆకాశానికి ఎత్తేసేవారు. కాని మణి అలా చేయలేదు. సునీల్ చెప్తున్న విషయం ఎంతటి ఉద్వేగాన్ని కల్గించినా దాన్ని కంట్రోలు చేసుకోడానికి ప్రయత్నించాడు. ఒక్కొక్క ప్రశ్న బయటపెడుతూ తన సందేహాలన్నీ తీర్చుకున్నాడు.

అప్పటిదాకా ఎంతో ఆసక్తిగా విన్న మణి "ఓకే డాక్టర్! చాలా చక్కటి ఉపాయం చెప్పారు. నేను దీని గురించి ఆలోచిస్తాను" అన్నాడు.

"థాంక్యూ సర్! వస్తాను" అని చేతులు జోడించి నమస్కారంచేసి ఆ రూమ్‌లోంచి బయటకు వచ్చాడు డాక్టర్ సునీల్.

ఇప్పుడాయన మనసు ఎంతో ఉల్లాసంగా ఉంది. సన్నగా విజిల్ వేసుకుంటూ తన క్యాబిన్‌వైపుకు నడిచాడు.

డాక్టర్ మణి ఆలోచనలోపడ్డాడు.

ఈ పనికి తన్మయి ఒప్పుకుంటుందా? ఒప్పుకోకపోతే ఏం చేయాలి? ఆమెనెలా ఒప్పించాలి? అని యోచిస్తున్నాడు.

కాసేపటి తర్వాత పర్సనల్ డిపార్ట్‌మెంట్‌లో ఓ వ్యక్తికి ఫోన్ వెళ్ళింది. 'డాక్టర్ తన్మయికి సంబంధించిన పూర్తి వివరాలు అందించమన్నది' ఆ ఫోన్ సారాంశం.

ఓ గంట తర్వాత తన్మయికి సంబంధించిన వివరాలతో ప్రత్యక్షమయ్యాడు ఆ వ్యక్తి. అతన్ని పంపించేసి ఆసక్తిగా ఫైల్ ఓపెన్ చేశాడు.

తన్మయి చదువు, పొందిన స్కాలర్‌షిప్‌లు అందుకున్న మెడల్స్ ఇవేమీ ఆయనను ఆకర్షించలేదు. చిట్టచివర ఒకేఒక్క వాక్యం మణిని ఆకట్టుకుంది.





'తన్మయి బామ్మకు త్వరలో మన క్లినిక్‌లో బైపాస్ జరగబోతోంది'

ఈ వాక్యం చదివాక డాక్టర్ మణి చిన్నగా నవ్వుకున్నాడు. క్రమంగా ఆ నవ్వు పెద్దదవుతూ వచ్చింది. కళ్ళల్లో నీళ్ళు చిప్పిల్లేవరకు అలా నవ్వుకుంటూనే ఉన్నాడు. తర్వాత పెన్ను తీసి తనకు కావాల్సిన పాయింట్స్ నోట్ చేసుకుని ఆ వాక్యం కింద గీతగీశాడు.

ఒక వ్యక్తికి సక్సెస్‌ను తెచ్చిపెట్టేవాటిల్లో అన్నింటికన్నా ప్రధానమైంది. 'అదృష్టం' అని నమ్ముతాడు మణి. దురదృష్టవంతుడ్ని ఎవ్వరూ బాగుచేయలేరని, అదృష్టవంతుడ్ని ఎవ్వరూ చెరపలేరని మణి ప్రగాఢవిశ్వాసం. అది ఈసారి బామ్మ గుండెపోటురూపంలో ఆయనకు కలిసివచ్చిందని అనుకుంటున్నాడు. మరి ఈసారి ఏమవుతుందో... తన్మయే చెప్పాలి.

★ ★ ★

బెంగుళూరు ఎయిర్‌పోర్టులో దిగింది నీహారిక.

ఆమెకి ఊరు కొత్త. అందుకే స్నేహితురాలికి తన ప్రయాణం గురించి వివరంగా ఫోన్ చేసి చెప్పింది. ఒకవేళ ఏకారణంవల్లనైనా ఆమె రాకపోతే తాను ఎక్కడికి వెళ్ళాలనేది ఆమె ఆలోచిస్తోంది.

ఫార్మాలిటీస్ అన్నీ పూర్తయ్యాక బయటకు వచ్చింది.

స్నేహితురాలి కోసం అటూఇటూ చూస్తుండగా వెనకనుంచి "హాయ్!" అని వినిపించింది.

పరధ్యానంగా నిలబడ్డ నీహారిక ఉలిక్కిపడి వెనక్కి తిరిగి చూసింది.

"భయపడ్డావు... భయపడ్డావు" చప్పట్లు కొడుతూ అంటోంది కీర్తన.

"హు... ఇంకా చిన్ననాటి లక్షణాలు పోలేదన్నమాట" స్నేహితురాలి చేతిని తన చేతిలోకి తీసుకుని ఆప్యాయంగా అడిగింది నీహారిక.

"పుట్టుకతో వచ్చినవి కదండీ. అంత తొందరగా పోతాయా?" ఈసారి పక్క నుంచి వినిపించింది.

"మావారు... శ్రీధర్!" పరిచయం చేసింది కీర్తన.

నమస్కారం చేసింది నీహారిక.

"శ్రీధర్‌గారూ! మిమ్మల్ని ఇబ్బంది పెడ్తున్నందుకు క్షమించండి! మీరేమీ అనుకోకపోతే నన్ను 'అమృత క్లినిక్' దగ్గర డ్రాప్ చేయగలరా?"

"ఓ ష్యూర్! ఇందులో అనుకోడానికి ఏముంది? కాకపోతే ముందు ఇంటికి వెళ్ళి ఫ్రెష్‌అయి వెడితే బాగుంటుంది కదా!?"

శ్రీధర్ మాటకు నీహారిక జవాబు చెప్పలేదు.

"సరే మీ ఇష్టం... అన్నట్టు కీర్తనా! నువ్వు కూడా మాతో రారాదూ!" అన్నాడు శ్రీధర్.

"ఏమో! ఆవిడగారికి ఏమైనా అభ్యంతరమేమో?" కోపంగా అంది కీర్తన.

స్నేహితురాలు వస్తోందని ఎంతో సంబరపడితే కనీసం 'ఎలా ఉన్నావు?' అనయినా అడగకుండా వస్తూనే క్లినిక్ వెళ్ళాలనేసరికి ఆమెకు చాలాకోపం వచ్చింది.

"ప్లీజ్ కీర్తనా! నన్ను తప్పుగా అర్థంచేసుకోకు. నేనో ముఖ్యమైన పనిమీద వచ్చాను. ఆ టెన్షన్‌లో ఉన్నాను" ఆమె స్వరంలో మార్పు గమనించగానే కీర్తన మనసు ఆర్ద్రమైంది.

"లేదులే... ఏదో సరదాగా అలా అన్నానులే... నీ ఇష్టప్రకారమే కానీ. ముందు క్లినిక్‌కు వెడదాం... ఆ తర్వాతే ఇంటికి సరేనా?" మొహంమీదకు నవ్వు తెచ్చుకుంది.

కార్‌లో వెడుతున్నంతసేపూ కీర్తన ఏదో మాట్లాడుతూనే ఉంది. మామూలుగా కీర్తనకన్నా నీహారిక వెయ్యిరెట్లు యాక్టివ్... కాకపోతే 'జయరాం'ను చూడబోతోందన్న టెన్షన్‌వల్ల ఆమె ఏమీ మాట్లాడలేకపోతోంది.



"నీహా! ఏమిటీ! పక్కన నేనిలా వాగుతూనే ఉన్నాను. నీ పాటికి నువ్వు ఏదో సుదీర్ఘంగా ఆలోచిస్తున్నావు. అసలేమిటి నీ ఉద్దేశ్యం? "

"లేదు...లేదు... నేనేం ఆలోచించడం లేదు. నువ్వేదో చెప్తుంటే వింటున్నాను" అబద్ధమే అయినా నిజమని నమ్మేలా చెప్పింది నీహారిక.

"నేను చెప్తున్నది వింటున్నావా? "

నీహారిక ఏదో చెప్పబోయేంతలో శ్రీధర్ అడిగాడు, "అవును అమృతలో ఏంటి మీకు పని? "

"పనంటే..." సందిగ్ధంగా ఆపేసిందామె.

"నువ్వుండవే! అసలీప్రశ్న అడగడం వెనుక మీ ఉద్దేశ్యమేంటి? అది హైద్రాబాద్ అమృత క్లినిక్‌లో పనిచేస్తోంది. ఇక్కడ వాళ్ళ బ్రాంచిలో ఏదో పనుండి వచ్చింది. డాక్టరుకు వేరే పనులేముంటాయి? రోగుల్ని చూడటం, కాన్ఫరెన్స్‌లకు హాజరవడం అంతే కదా! ఇంత చిన్న సంగతి మీకర్థంకాలేదు. పెద్ద మేధావిలా ఫోజు. ఎప్పుడూ నువ్వు బుర్ర తక్కువ దానివి అని నన్ను ఎద్దేవాచేస్తారుగా? మరి ఇప్పుడు మిమ్మల్నేమనాలి? నువ్వు చెప్పవే నేనన్నదానిలో తప్పేంలేదుగా? "

నీహారిక తేలికగా ఊపిరిపీల్చుకుంది. తాను బెంగుళూరు ఎందుకు వెడుతోందో తల్లితండ్రులకు కూడా చెప్పలేదు. వాళ్ళు కారణమడిగితే ఏదో సర్దిచెప్పింది. నిజానికి చెప్పినందువల్ల ప్రమాదమేమైనా కలుగుతుందేమోనని కాదు ఆమె భయం. అనవసరంగా తల్లితండ్రులను బాధపెట్టడమెందుకు అని చెప్పలేదు. అదీగాక ఎందుకో ఆమెకి ఎవ్వరికీ ఏమీ చెప్పబుద్ధికావడం లేదు.

"నీహా!" కీర్తన కుదిపేసరికి ఆమె ఆలోచనా స్రవంతి తెగింది.

ఏదో చెప్పబోయేంతలో ముందు వెడ్తున్న స్కూటర్‌ని వెనుక వస్తున్న లారీ గుద్దేయడం, స్కూటర్ మీద ఉన్న వ్యక్తి అంతెత్తున ఎగిరి అవతలపడటం జరిగిపోయింది. అంతా లిప్తపాటు వ్యవధిలో జరిగిపోయింది.

ట్రాఫిక్ అంతా స్తంభించిపోయింది.

యాక్సిడెంట్ అయిన వ్యక్తికి చికిత్సచేయడానికి, కళ్ళారా ఆ దుర్ఘటనను చూడటానికి చాలా తేడా వుంది. నీహారిక ఖిన్నురాలైందంటే ఇక కీర్తన పరిస్థితి చెప్పనే అక్కర్లేదు. నోటిమాట లేకుండా అలా నోరు తెరుచుకుని బొమ్మలా చూస్తుండిపోయింది.

కారు డోరు తీసుకుని దిగబోతున్న నీహారికను శ్రీధర్ వారించాడు. "నీహారికగారూ! మీది ఈ ఊరు కాదు... ఏదో పనిమీద వచ్చారు. అలాంటి మీరు ఈ విషయాలలో తలదూర్చకండి. కేసులు, కోర్టు, విచారణ అంటూ తిరగాల్సి వస్తుంది. పొద్దున్న లేస్తే ఇలాంటివి బోలెడన్ని చూస్తుంటాం. ఎంత మందికని సాయపడగలం? ఏదో కొంచెంసేపు కళ్ళు మూసుకుంటే ట్రాఫిక్ క్లియర్ అయిపోతుంది. మనం వెళ్ళిపోవచ్చు"

శ్రీధర్ వంక అసహ్యంగా చూసి "నేను డాక్టర్‌నండి. కళ్ళముందు ఓ ప్రాణి చావుబతుకుల్లో కొట్టుమిట్టాడుతుంటే చూస్తూ వూరుకోలేను. ఐయామ్ సారీ! మీకేదైనా సమస్య వస్తుందనుకుంటే మీరు వెళ్ళిపోవచ్చు" అంటూ కారు దిగి డోర్ వేసేసి పరిగెత్తింది.

కోపంతో పళ్ళు కొరికాడు శ్రీధర్.

ఆ వ్యవధిలో కీర్తనకూడా తేరుకుంది. నీహారిక బ్యాగ్ తీసుకుని కారు దిగబోతుండగా "నువ్వెక్కడికి? " అసహనంగా అరిచాడు.

"మీరు వెళ్ళిపోండి? మేం క్లినిక్‌కు వెళ్తాంలే" అని చెప్పి వేగంగా అటువైపు నడిచింది ఆమె.

అప్పటిదాకా చోద్యం చూస్తున్న జనంలో నీహారిక అతనికి ఫస్ట్‌ఎయిడ్ చేయడం








ఈ శీర్షికద్వారా ప్రతినెలా 'చతుర'లో వెలువడే నవలను సమీక్షించే అవకాశాన్ని కల్పిస్తున్నాం. పాఠకులు తమకు నవల ఎందుకు నచ్చిందో లేదా ఎందుకు నచ్చలేదో వివరిస్తూ రచన బాగోగులు గురించి రాయాలి. సమీక్షలు రాసేవారు కథ మొత్తం మళ్ళీ చెప్పకుండా, అవసరమైనమేరకే ప్రస్తావిస్తూ రాయాలి.

1. సమీక్ష అరఠావుకి మించకుండా కాగితానికి ఒకవైపునే రాయాలి.
2. ఏ నెల సమీక్ష ఆ నెల 20వ తేదీలోపు మాకు అందేటట్లు పంపాలి.
3. మీ సమీక్షకు తప్పనిసరిగా ఈ కింది కూపన్ జతపరచాలి.
4. కవరుపై 'చతుర సమీక్ష'కు అని పేర్కొని ఎడిటర్, 'చతుర', ఈనాడు కాంపౌండ్, హైదరాబాద్-500 482 అనే చిరునామాకు పోస్ట్‌చేయాలి.

**మాకు సకాలంలో అందిన సమీక్షలలో ఎన్నికచేసిన అయిదు ఉత్తమ సమీక్షలకు రు. 100/- ప్రథమ బహుమతి, రు: 75/- ద్వితీయ బహుమతి, రు: 50/- చొప్పున మూడు తృతీయ బహుమతులను అందజేస్తున్నాం. పాఠకుల పరిశీలనాశక్తిని, రచనాసక్తిని పెంచే లక్ష్యంతో ఏర్పాటుచేసిన ఈ సమీక్షా రచనలో పాల్గొని ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకోగోరుతున్నాం.**

★ కొందరు బహుమతి విజేతలు తమ బహుమతి తాలూకు చెక్కు అందలేదనీ, అడ్రసు మారిందనీ రాస్తున్నారు. బహుమతి మొత్తాలు ప్రతినెలా మొదటివారంలోనే పంపుతున్నాం. అడ్రసుల విషయంలో కూపన్‌లో రాసేటప్పుడే జాగ్రత్తపడటం మంచిది. ఈ విషయంలో ఉత్తర ప్రత్యుత్తరాలు సాధ్యంకాదు.

**కూపన్**

**మార్చి చతుర నవల యజ్ఞం**

..................................................

**సమీక్షకుని పేరు :** ..................................................

**చిరునామా :** ..................................................

..................................................

..................................................

..................................................

మొదలుపెట్టాక చలనం వచ్చింది.

అతని తలకు బాగా గట్టి దెబ్బ తగిలినట్లుంది. రక్తస్రావంవల్ల అతని బట్టలు తడిసిపోయాయి. అసలు ప్రాణం ఉందో లేదో అన్నట్టుగా చాలా నెమ్మదిగా శ్వాసిస్తున్నాడు.

నీహారికకు కన్నడం రాకపోవడంతో ఆమె మాట్లాడుతున్న తెలుగు అక్కడ ఎవ్వరికీ అర్థంకావడంలేదు. కీర్తన వచ్చి "దయచేసి హెల్ప్‌చేయండి ఆస్పత్రికి తీసుకువెడదాం" అని వాళ్ళ భాషలో అర్థించింది.

ఆ మాటతో చాలామంది వెనక్కి తగ్గారు. "మనకెందుకు? రేప్పొద్దున ఆ మనిషి ఛస్తే మన పీకకు చుట్టుకుంటుంది" అని తమలోతాము మాట్లాడుకుంటూ అంతా వెళ్ళిపోయారు.

ఓ పెద్దాయన "ఆడోళ్ళు మీకెందుకమ్మా ఇదంతా! పోలీసులకు ఫోన్ చేశాను. వాళ్ళొస్తారుకానీ మీరెళ్ళండి పెద్ద వీరవనితలు పుట్టుకొచ్చారు" అని గొణుక్కుంటూ వెళ్ళబోతుంటే,

"వెళ్ళు... రేపు నీకూ ఇలాంటి పరిస్థితి ఎదురైతే అప్పుడు తెలుస్తుంది ఆ బాధేంటో?" తనలోతాను అనుకోబోయి పైకే అనేసింది కీర్తన.

"ఏంటమ్మో మాటలు మీరుతున్నావు? అంటే నాకు యాక్సిడెంట్ అయి ఇలా దిక్కులేనివాడిలా రోడ్డుమీద పడుండాలని నీ ఉద్దేశ్యమా?" కీర్తన మీదకు వచ్చి అడిగాడు.

అతనలా రియాక్ట్ అవుతాడని తెలీని కీర్తన భయపడిపోయింది.

తనను ఎవ్వరూ ఏమి చేయలేరని ధైర్యంతో ఆమె భుజంమీద చేయివేసి "చెప్పు... అసలేంటి నీ ఉద్దేశ్యం? నేను నీకేం ద్రోహం చేశానని ఇలా శపిస్తున్నావ్?"

కీర్తన గింజుకుంటున్నకొద్దీ పట్టు బిగుస్తుంటోంది. ఇదేమి తెలీని నీహారిక వచ్చే పోయే వాహనాలకు అడ్డంపడి ఆపమని వేడుకొంటోంది. ఎవ్వరూ ఆమె మొరని ఆలకించడంలేదు.

తన మాట వినలేదని కోపంతో వున్న శ్రీధర్ దూరంనుంచి ఈ దృశ్యాన్ని చూశాడు. ఎవడో తన భార్య వంటిమీద చెయ్యివేయడం చూసేసరికి రక్తం సలసలా మరిగిపోయింది. కళ్ళు కోపంతో ఎర్రబడ్డాయి. దవడ కండరం బిగుసుకుంది. అంతే... పిడికిలి బిగించి బలమంతా పిడికిట్లోకి తెచ్చుకుని అతని ముఖంమీద ఒకే ఒక్క దెబ్బ కొట్టాడు. ఊహించని ఈ దాడికి ఏమరుపాటుగా ఉన్నతను కిందపడిపోయాడు. తన ముష్టిఘాతం తిన్నవారెవ్వరూ అంత త్వరగా కోలుకోరని అతనికి తెలుసు.

"అయ్యింది చాలుకానీ ఇక పద" ఆమె చేయి పట్టుకుని కారు దగ్గరకు లాక్కెడుతూ అన్నాడు శ్రీధర్.

"శ్రీ... ప్లీజ్... నీహాను చూడు... వచ్చీపోయే వాహనాలకు ఎలా అడ్డుపడుతోందో చూడు! ఈ ఒక్కసారి నా మాట విను... నిన్ను ఇప్పటివరకు ఏమీ అడగలేదు. ఈ ఒక్క కోరిక తీర్చు! నీహాకు సాయం చేయి" చేతులు జోడించి అడిగింది కీర్తన.

మరీ కఠినంగా ప్రవర్తిస్తే కీర్తన ఎదురు తిరుగుతుందని శ్రీధర్‌కు తెలుసు. అందుకే "సరే! కేవలం నీకోసం ఒప్పుకుంటున్నాను. అయితే ఆస్పత్రిలో చేర్చడంవరకే మన బాధ్యత. ఆపైన ఈ కేసుతో మనకేసంబంధంలేదు" అన్నాడు.

"సరే" చిన్నపిల్లలా సంతోషపడింది కీర్తన.

కొన ఊపిరితో వున్న అతనిని దగ్గరలో ఉన్న ఆస్పత్రిలో చేర్చారు. చేర్చగానే వెళ్ళిపోవడం కుదరలేదు. ఈలోగా శ్రీధర్‌కు ఏదో ముఖ్యమైన ఫోన్ రావడంతో వారిద్దరిని ఇంటికి వెళ్ళిపోమని అక్కడ ఎక్కువసేపు ఉండవద్దని పదేపదే చెప్పి వెళ్ళిపోయాడు శ్రీధర్.

యాక్సిడెంట్ కేసు కావడంవల్ల అతన్ని చేర్చుకునేందుకు హాస్పిటల్ వర్గం మొదట అంగీకరించలేదు. కానీ శ్రీధర్ వాళ్ళతో మాట్లాడాక జాయిన్ చేసుకోవడానికి అంగీకరించారు.

ఆస్పత్రిలో చేర్చాం కాబట్టి అక్కడినుంచి వెళ్ళిపోదామా అని అనిపించింది నీహారికకు. అంతలోనే మనసు నీకంత తొందరేంటి? అని కేకలేసింది.

ఆమె ఊహించినట్టు అతని తలకు పెద్ద దెబ్బ తగిలింది. రాత్రి గడిస్తేగాని చెప్పలేం అన్నారు డాక్టర్లు. అంతవరకు అక్కడ ఉండాలో అక్కర్లేదో తేల్చులేకపోతోంది.

"డాక్టర్ అతనికి సంబంధించిన వివరాలేమైనా తెలిశాయా? వాళ్ళవాళ్ళకు కబురు చేశారా? " డ్యూటీ డాక్టర్‌ని అడిగింది నీహారిక.

"తెలిశాయి మేడం...! ఈయన పర్స్‌లో ఐడెంటిటీకార్డ్ దొరికింది. దాంట్లో అతను పనిచేస్తున్న ఆస్పత్రి"...

"ఏ హాస్పిటల్ అది? " వెంటనే అడిగింది.

"అమృతాపాలీ..." డాక్టర్ మాట పూర్తికాకముందే "ఆయన పేరేంటి? " అని ప్రశ్నించింది నీహారిక.

'తాను కలవాలనుకుంటున్న వ్యక్తి కాకూడదు' అని మనసులో అనుకుంటూనే గుండె చిక్కబట్టుకుని అడిగింది.

"డాక్టర్ జయరాం..."

అంతే! నిలబడిన చోటే బల్లమీద కూర్చుండిపోయింది. తలలో సన్నగా హోరు మొదలై అంతకంతకు ఎక్కువైపోయింది. రక్తం లేనట్టుగా ముఖం పాలిపోయింది. వాస్తవం తన ముందు నిలిచి వికటాట్టహాసం చేస్తున్నట్టుగా భయంతో కదిలిపోయిందామె. ఆ అచేతనావస్థలోంచి ఒక్కసారి స్పృహవచ్చినట్టుగా కదిలి అంది. "నేను... నేను ఒకసారి ఆయన ఐడెంటిటీ కార్డ్ చూడచ్చా? "

"ఓ... ష్యూర్..." అంటూ సిస్టర్‌ని పిలిచి ఆ కార్డ్ తెప్పించాడు.

డాక్టర్ చెప్పింది నిజమే! డాక్టర్ జయరామ్. వయసు ఇరవై ఎనిమిది సంవత్సరాలు. అమృతలో జూనియర్ డాక్టర్. కార్డ్ మీద క్లినిక్ అడ్రస్ మాత్రమే ఉంది.

"క్లినిక్‌కు ఫోన్ చేస్తే ఆయన రెసిడెన్స్ అడ్రస్ దొరుకుతుందనుకుంటాను" తనలో తాను అనుకుంటున్నట్టుగా పైకే అన్నాడు అతను.

అసంకల్పితంగా తలూపింది నీహారిక.

ఆమెకు చెప్పలేనంత నీరసంగానూ, అలసటగానూ ఉంది. తన అనుమానం తీర్చుకోడానికి ఎవరినైతే కలవాలని వచ్చిందో ఆ వ్యక్తినే ఆస్పత్రిలో చేర్చాల్సిరావడాన్ని మించిన మెలోడ్రామా ఏం వుంటుంది? అది కూడా కాదు. జయరాంకు యాక్సిడెంట్ అవడం నిజంగా యాదృచ్ఛికమేనా? లేక ఎవరైనా చేయించారా? అదే ఆమెని ఎక్కువగా బాధిస్తోంది. ఒకవేళ ఆయన పేపర్‌కు ఇచ్చిన స్టేట్‌మెంట్ తాలూకు ఫలితం కాదుకదా ఇది!!?

ఆ ఆలోచనకు సన్నగా వణికిందామె. ఒకవేళ అదే నిజమైతే తాను ఊహించినదానికన్నా ప్రమాదకర మనుష్యులతోనే తలపడుతోంది.

"మేడమ్! ఆయనకు స్పృహవచ్చింది. మిమ్మల్ని చూడాలనుకుంటున్నారు" సిస్టర్ వచ్చి చెప్పింది.

గబగబ రూమ్‌లోకి నడిచింది నీహారిక. 'నాకా మందుల వాసనలు పడవు కాని నువ్వెళ్ళు. నేనిక్కడే ఉంటాను' అంది కీర్తన.

అప్పటికే డ్యూటీ డాక్టర్ జరిగింది చెప్పినట్టున్నాడు. నీహారికను చూడగానే చేతుల్లోకి శక్తినంతా తెచ్చుకుని నమస్కరించాడు.

ఆమె కళ్ళల్లో నీళ్ళు నిండాయి.

నిజానికి ఇంతకుముందువరకు ఇద్దరికీ పరిచయంలేదు. అయినా ఏదో తెలీని ఆత్మీయతాభావం వారిని కుదిపేస్తోంది.

ఇద్దరి వృత్తి ఒకటే కావడంవల్ల ఏర్ప డిందో లేక ఒకే క్లినిక్‌లో పనిచేస్తున్నందు వల్ల కలిగిందో తెలీదు.

జయరామ్ ఏదో మాట్లాడాలని ప్రయ త్నించాడు. అంతలోనే భళ్ళున వాంతయి పోయింది. దాంతో పరిస్థితి విషమించింది. అంతే డాక్టర్లు, నర్సులు హడావిడిపడ్డారు.

నీహారికలో తెలీని నైరాశ్యం చోటుచేసు కుంది. అతనెవరో తెలీకముందు అక్కడుం డటంలో ఎలాంటి ప్రమాదమూ లేదు. కాని అమృత స్టాఫ్ ఎవరైనా తనను ఇక్కడ చూస్తే చాలా ప్రమాదం.

అందుకే రిసెప్షన్‌లో తాను వెడ్తున్నానని చెప్పింది. "ఓకే మేడమ్! ఆయన పరిస్థితి ఎలా ఉందో మేము ఫోన్ చేసి చెప్తాం లెండి" అంది.

"ఎక్కడికి ఫోన్ చేస్తారు?" ఆశ్చర్యంగా అడిగింది నీహారిక.

"శ్రీధర్‌గారింటికి"

"ఆయన మీకు తెలుసా?" నీహారిక గొంతులో విభ్రమం.

"ఎందుకు తెలీదు? 'క్యూర్ ఫార్మాస్యూటి కల్స్ కంపెనీ మేనేజింగ్ డైరెక్టర్ కదా" నీకు తెలీని విషయం నాకు తెలుసు చూశావా అన్నట్టు చెప్పిందామె.

"ఏమిటీ?" నీహారిక కంఠం కీచుమంది.

రిసెప్షనిస్ట్ చెప్పింది వినేసరికి ఆ షాక్‌కు ఆమె గొంతు కీచుమంది.

పాపం సరిగా వినబడలేదేమోలే అని మళ్ళీ అదే చెప్పింది.

నీహారిక తేరుకోవడానికి కొంచెం ఎక్కువ సమయమే పట్టింది.

గొంతు తడారిపోయిన భావన. అప్పటివ రకు పళ్ళబిగువున అలసటను అదిమిపెట్టేం దుకు ప్రయత్నించింది. కాని సాధ్యంకా లేదు. నెమ్మదిగా ఒక్కో అడుగు వేస్తూ కీర్తన దగ్గరకు వచ్చింది.

"కీర్తనా! మీవారు... మీకు..." ఎలా అడ గాలో తెలీలేదు. ..కాని అడగాలి తప్పదు. "మీవారేం చేస్తారు?" బొంగురుపోయిన కంఠంతో అడిగింది.

"హమ్మయ్య... ఈ ప్రశ్న నువ్వు ఈ ఊరులోకి అడుగుపెట్టగానే అడుగుతావను కున్నాను. కాని ఏం చేస్తాం? నీకిప్పటికి తీరింది"

నీహారిక ఏం మాట్లాడలేదు.

"మా వారు క్యూర్ ఫార్మాస్యూటికల్స్ కంపెనీ మేనేజింగ్ డైరెక్టర్. ఎమ్.డి. ఏమిటీ. ఆ కంపెనీయే మాది. మా మావ గారు ఛైర్మన్. అన్నట్టు నీకో విషయం తెలుసా? అందులో నేను కూడా ఒక డైరె క్టర్‌నే. కాకపోతే ఆఫీసుకు మాత్రం వెళ్ళను అంతే!"

తనమానాన తాను చెప్పుకుపోతోంది కీర్తన.

నీహారిక పెదవులమీద జీవంలేని నవ్వు కదలాడింది. తను కీర్తన పెళ్ళికి రాలేదు. పెళ్ళయ్యాక తన బిజీలోపడి కీర్తనను కల వలేకపోయింది. ఎప్పుడైనా ఫోన్‌లో రెండు మాటలు మాట్లాడుకోవడం మినహా ఈ వివరాలు తెలుసుకోవడానికి వీలుకాలేదు. తీరా ఇప్పుడు... ఆమెకెందుకో చాలా విర క్తిగా అన్పించింది.

ఎంత ప్లాన్ చేసుకుని వచ్చింది తను! జయరాంని కలిసి మాట్లాడటం పూర్తికాగానే స్నేహితులు ఇద్దరూ కలిసి షాపింగ్ చేయా లని, బాగా తిరగాలని, కీర్తన పెళ్ళికి రాలేక పోయింది కాబట్టి వాళ్ళిద్దరికీ ఓ మంచి కానుక ఇవ్వాలని ఎన్నెన్నో అనుకుంది.

"పద వెడదాం...కావాలంటే మళ్ళీ వద్దాంలే" అంది కీర్తన.

నిజానికి నీహారికకు వాళ్ళింటికి వెళ్ళాలని లేదు. కానీ కీర్తనను బాధపెట్టలేక బయలు దేరింది. కీర్తన ఏదో మాట్లాడుతుంటే వింటుండిపోయింది. మధ్యలో అడిగిన వాటికి జవాబిచ్చింది. వచ్చేప్పుడున్న హుషారు ఇప్పుడు ఆమెలో లేదు. ప్రాణస్నే హితురాలి భర్త శత్రువులలో ఒకడవుతా

డేమో? ఆ ఊహ ఆమెకు వెన్నులో జలద రింపు పుట్టిస్తోంది.

వాళ్ళు ఇంటికి వచ్చి భోజనం చేసిన గంటకు హాస్పిటల్‌నుండి ఫోన్ వచ్చింది. ఆ వార్తతో ఆమె మరింత డీలాపడిపోయింది.

స్నేహితురాలు ఎంత వారించినా వినకుండా హైదరాబాద్ బయలుదేరింది.

రెండు విషాదకర విషయాలు తనతో తీసుకువెడుతోంది.

క్యూర్ ఎమ్.డి. తన స్నేహితురాలు భర్త కావడం ఒకట్టైతే, డాక్టర్ జయరాం ఈ లోకాన్నించి శాశ్వతంగా సెలవు తీసుకోవడం మరో విషాదం.

క్యూర్ కంపెనీ మందులే అమృత డాక్టర్స్ ప్రిస్క్రైబ్ చేస్తారు. తన ఊహే కనుక నిజమైతే డాక్టర్ జయరాం చెప్పింది నూటికి నూరుపాళ్ళు నిజమే అయి వుంటుంది. బహుశా ఆ మందులు కూడా క్యూరే తయారు చేస్తోందేమో? అందుకే అమృతకు వెళ్ళాలనగానే ఏం పనక్కడ అని శ్రీధర్ అడిగాడా? అయితే తానిక్కడకు వచ్చి వెళ్ళిన విషయం 'మణి'కి తెలిసిపోతుంది. తనమీద కూడా హత్యాప్రయత్నాలు మొదలెడతారేమో?

విమానం సాగిపోతుంటే మేఘాల్లోంచి తెల్లని దుస్తులు ధరించి డాక్టర్ జయరాం తనకు చెయ్యి ఊపుతున్నట్టు అనిపించింది. ఎందుకో కరువుతీరా ఏడవాలన్పిస్తోంది. 'మిత్రమా! నీది సహజ మరణం కాదన్న నా ఊహ నిజమైతే రేకెత్తిన అనుమానం ద్వారా నా కర్తవ్యం స్ఫురింపచేసినందుకు నీ మరణానికి కారణమైన వారిమీద కూడా నేనే పగతీర్చుకుంటాను. ఎన్ని కష్టాలొచ్చినా చివరిదాకా పోరాడుతూనే ఉండాలని నీ మరణంద్వారా నేర్చుకున్నాను. అది మర్చిపోను. నాకు కర్తవ్యం బోధించినందుకు నీకు కృతజ్ఞతలు' మనసులోనే రోదించింది నీహారిక.

విమానం మాత్రం ఆమె ఆలోచనలతో సంబంధంలేకుండా సాగిపోతూనేఉంది.

అలసటవల్ల ఆమెకు నిద్రపట్టేసింది.

ఫ్లైట్ హైదరాబాద్ చేరాక ఆమెకు మెలకువచ్చింది. ఈ వ్యవధిలో ఆమె కొంచెం కోలుకుంది. పోరాటం తప్ప బాధ ఏ సమస్యకూ పరిష్కారంకాదని ఆమెకు తెలుసు.



ఒక్క స్నేహస్పర్శ

వందల ఏళ్ళకొద్దీ ఘనీభవించిన నిశ్శబ్దాన్ని బద్దలుకొడుతుంది.

ఓ నిర్మల మందహాసం

ఒంటరి హృదయంమీద ప్రేమజల్లు కురిపిస్తుంది.

ఓ మంచిమాట.

గాయాలను మాన్పి నూతనోత్సాహాన్ని నింపుతుంది.

ప్రస్తుతం తన్మయి పరిస్థితి అలాగే వుంది. ఇంతకాలం ఆమె ప్రపంచంలో బామ్మ తప్పితే మరొకరు లేరు. ఇప్పుడు స్నేహతురాలిగా నీహారిక అడుగుపెట్టింది. మనకోసం చెమ్మగిల్లే నయనం ఒక్కటైనా ఉందన్న సంతృప్తి మనిషికి ఎంతో బలాన్ని, ఉత్సాహాన్ని ఇస్తుంది.

ఆమెను చూస్తే కువకువలాడే ధవళపా

పురం గుర్తొస్తుంది. వసంత గీతికపాడే కోకిల తలపుకొస్తుంది. జలక్రీడలాడుతున్న రాయంచలా గోచరిస్తుంది.

తన్మయి మాట్లాడితే ముత్యాలజల్లు కురుస్తున్నట్టే ఉంటుంది. పైగా వైద్య వృత్తి తాలుకు మార్దవం, నెమ్మదితనం, ఓర్పు ఇవన్నీ ఆమెకు పెట్టని ఆభరణాలు అయ్యాయి.

ఎంతసేపు తను, తన ప్రయోగాలు తప్పితే ఆమెకు మరోవిషయం పట్టదు. పాతికేళ్లు వస్తున్నాయి. ఇకనైనా ఎవరో ఒక అయ్య చేతిలో పెడితే తన బాధ్యత తీరుతుందని బామ్మగారి ప్రయత్నం. కాని తనకు పెళ్ళైతే ఆ వచ్చినతను బామ్మను సరిగా చూస్తాడో చూడడోనని తన్మయికి భయం. పైగా వారిద్దరి అనుబంధం బలీయమైనది. ఒకసారి తల్లీకూతుళ్ళుగా, మరోసారి బామ్మ, మనవరాలిగా ఎక్కువసార్లు మంచి స్నేహితుల్లా ఉంటారు. అందుకే బామ్మ ఎప్పుడు పెళ్ళి ప్రస్తావన తెచ్చినా మాట మార్చేస్తూ ఉంటుంది. అదీగాక పెళ్ళి గురించి ఇంకా ఆమెకు ఓ అవగాహన కూడా ఏర్పడలేదు.

యవ్వనం తాలుకు జన్యురహస్యం పరిశోధించాలనే కోరికతో, ఆశయంతో ఆమె అమృత క్లినిక్ ఛీఫ్ డాక్టర్ మణిని కలిసింది. క్లినిక్‌కు అనుబంధంగా రీసెర్చి సెంటర్ కూడా ఉందని ఆమెకు తెలుసు. తన్మయి చెప్పింది విని మణి సంబరపడ్డాడు. ఆమెకు అన్ని సౌకర్యాలు కల్పించాడు. ఆవిధంగా తన్మయి ఆర్థిక ఇబ్బందులు తొలగిపోయాయి.

ఆరు నెలల క్రితం మణి ఆమెను పిలిచి "పి.జి.డి. గురించి అవగాహన ఉందా?" అనడిగాడు.

అంతే ఆమె తనకు తెలిసిన సమాచారం మొత్తం గుక్కతిప్పుకోకుండా చెప్పేసింది.

సబ్జెక్ట్ ... మెడికల్ సబ్జెక్ట్ ఏదైనా ఆమెకు కరతలామలకం.

తన్మయికి పి.జి.డి. మీద ఉన్న అవగాహన తెలుసుకుని మొదట దాన్ని గురించి అధ్యయనం చేయమని చెప్పాడు ఛీఫ్. ప్రస్తుతం ఆమె ఆ పనిలోనే ఉంది. ఇంత క్రితం లేదుగాని ఇప్పుడు అది కూడా మొన్నటి సమావేశం తర్వాత పి.జి.డి.ని మణి వ్యాపారంగా మారుస్తాడేమోననే అనుమానం కలుగుతోంది. అది ఆమె ఏకాగ్రతను దెబ్బతీస్తోంది.. దానికితోడు బామ్మ అనారోగ్యం.

మైక్రోస్కోప్ కింద స్లైడ్స్ పరిశీలిస్తున్న ఆమె కళ్ళు విశ్రాంతితో పెద్దవయ్యాయి. మనసులో మొదలైన ఆనందవీచిక కనుల దాకా విస్తరించడంతో ఆ కళ్ళల్లో మెరుపు తళుక్కుమంది. 'ఇది... ఇది నిజమా? తాను సాధించిందా?' ఆనందంతో ఆమెకు చిన్నపిల్లలా గంతులు వేయాలన్పించింది. మరొకరైతే అలాగే చేసేవారేమో? కాని తెచ్చిపెట్టుకున్న పెద్దరికం ఆమెకి ప్రతిబంధకమైంది.

ఎవరితోనైనా ఈ ఆనందం పంచుకోవాలన్పించింది. కాని ఆస్పత్రిలో ఉందని గుర్తుకువచ్చింది. అందుకే తాను తయారుచేసుకున్న నోట్సు మైక్రోస్కోప్, స్లైడ్స్ ఇంకా ఇతర పరికరాలు అన్నింటినీ ఆత్మీయంగా చూసుకుంది.

"మే ఐ కమిన్ మేడమ్?" అన్న మాటలు, వెంటనే నవ్వు విన్పించాయి.

నీహారికను చూడగానే 'ఈమెకు చెప్తేనో' అన్పించింది కాని ఏదో సందేహం?

"రండి నీహారికా! ఊరు నుంచి ఎప్పుడొచ్చారు?" చిరునవ్వుతో ఆహ్వానించింది తన్మయి.

"వెంటనే బయలుదేరి వచ్చేశాను" అని "నేను మిమ్మల్ని డిస్టర్బ్ చేస్తున్నానా?" అంది.

"నో...నో... నాటెటాల్ అసలు నేనే మీదగ్గరకు వద్దామనుకుంటున్నాను. ఇంతలో మీరే వచ్చారు"



"నిజమా.." నమ్మలేనట్టుగా చూస్తూ అడిగింది నీహారిక.

అవునన్నట్టుగా తలాడించింది తన్మయి. ఆ కళ్ళల్లో ప్రశాంతత ఉంది. దాని వెనుక సంతృప్తి, తీక్షణత... ఎక్కడో ఓ మూలన రవ్వంత విషాదం కూడా ఉంటాయి.

'తన మనసులోదంతా ఈమెకు చెప్పేస్తేనో'? అన్పించింది నీహారికకు. ఆమెకు తన్మయిమీద వేరేరకం అనుమానాలేవి లేవు గాని, ఇదంతా విని క్లినిక్‌ను వదిలి వెళ్ళిపోతుందేమోనని భయం. అదే జరిగితే కోరి 'మణి'తో శత్రుత్వం తెచ్చుకున్నట్టే. గట్టిగా కేకలేస్తేనే భయంతో ముడుచుకుపోయే తన్మయి, మణిలాంటి శత్రువుతో తలపడగలదా? వద్దు...తన బాధలు తనలోనే ఉండనీ. అవన్నీ చెప్పి ఈ అమాయకురాలి నెందుకు బాధపెట్టాలి? ఈ నిర్ణయానికి వచ్చాక ఆమె మామూలు నీహారిక అయిపోయింది.

"ఏంటి నీహా! మీకు కూడా మాట్లాడుతూ ఆలోచనల్లోకి జారిపోవడం అలవాటయ్యిందా? "

"లేదు...లేదు" ఖంగారుగా అంది నీహారిక.

"బామ్మగారికి ఎలా ఉంది? "

నీహారిక ప్రశ్నతో తన్మయి విచలితురాలయ్యింది. ఆమె కనులు కొలనులే అయ్యాయి.

చొరవగా తన్మయి చేతులు తన చేతుల్లోకి తీసుకుంటూ "తన్మయీ! ఆవిడకేం కాదు... ఈ రోజుల్లో బైపాస్ సర్జరీ చాలా మామూలు విషయం. ఓ డాక్టర్‌గా అది నేను మీకు చెప్పక్కర్లేదనుకుంటాను",

నీహారిక చేతిని గట్టిగా పట్టుకుంది తన్మయి. "నీహా! ఓ డాక్టర్‌గా బైపాస్ సర్జరీ గురించి నేను భయపడటంలేదు. కాని ఓ మనవరాలిగా బామ్మ అనారోగ్యం గురించి బాధపడ్తున్నాను"

తన్మయి మాటలకు నీహారిక విస్తుబోయింది. అతి మామూలు వాక్యాలే కాని దాని వెనుకనున్న భావం?

నీహారిక ఆలోచనలతో సంబంధం లేకుండా ఏదో ఒక ట్రాన్స్‌లో ఉన్నట్టుగా చెప్పుకుపోసాగింది. "మీరు చాలా తెలివైన వారు. ధైర్యం, హుషారు మీ సొంతం. మీరు పక్కనుంటే చాలా ధైర్యంగా అనిపిస్తుంది. ఈ మాట బామ్మను ఆస్పత్రిలో చేర్చినరోజే మీకు చెప్దామనుకున్నాను. కాని ఏదో తెలీని సందిగ్ధం. నేను చిన్నతనం నుంచి ఒంటరిగా పెరిగాను. బామ్మ తప్పితే నాకీప్రపంచంలో ఎవ్వరూ లేరు. బామ్మ అనారోగ్యంతో ఆస్పత్రిలో ఉండటంవల్ల నేను పూర్తిగా ఒంటరి దాన్నయిపోయాను. అందుకే వర్క్‌మీద కూడా కాన్‌సన్‌ట్రేట్ చేయలేకపోతున్నాను" తన్మయి స్వరంలో ఎంతో బాధ గూడుకట్టుకుంది.

"తన్మయీ! ఎందుకో తెలీదు. కొందరితో వెంటనే స్నేహం చేయాలనిపిస్తుంది. ఎన్నో జన్మల బంధమని, ఈ బంధం అలా కొనసాగుతూ వస్తోందని అనిపిస్తుంది. సరిగ్గా నిన్ను చూస్తే నాకదే భావన కలుగుతుంది. ఎస్... యూ ఆర్ మై ఫ్రెండ్. నువ్వు కూడా అలా భావించగలవా? "

నీహారిక స్పర్శలో తన్మయి ఓ అనిర్వచనీయమైన అనుభూతి పొందుతూంది. ఓ ఆత్మీయతాభావం ఆమెను కుదిపేస్తోంది. సంవత్సరాల క్రితం ఘనీభవించి ప్రేమరాహిత్యమైన శిల నెమ్మదిగా కరగనారంభించింది.

"నీహా! నేను అడుగుదామనుకున్నదే నీ నోటి వెంట వచ్చింది. ఎస్ నీహా! ఇకనుంచి మనం మంచి ఫ్రెండ్స్‌మే" చాలా నెమ్మదిగా చెప్పినా తన్మయి కంఠంలో ఆప్యాయత వుట్టిపడింది.

ఇద్దరూ ఒక్కక్షణంపాటు ఒకరినొకరు చూసుకుని ఫక్కుమని నవ్వుకున్నారు. "ఏదో ఎల్. కె. జి. పిల్లలు చేసుకునే ప్రమాణాల్లా వున్నాయి కదూ!" నీహారిక మాటకు

తన్మయి తలూపింది.

తను సాధించిన విజయం గురించి చెప్ప బోతుండగా ఫోన్ మోగింది.

"నమస్తే మేడమ్! ఛీఫ్ మిమ్మల్ని వెంటనే కలవమని చెప్పారు. ఆయన మీకోసం తన క్యాబిన్‌లో ఎదురుచూస్తున్నారు" మణి పర్స నల్ అసిస్టెంట్ వందన చెప్పింది.

"ఓకే... వస్తున్నాను. అయిదు నిము షాల్లో అక్కడుంటాను"

"థాంక్యూ మేడమ్! సార్‌కి ఇన్‌ఫార్మ్ చేస్తాను" అంటూ అవతలివైపు ఫోన్ పెట్టేసిందామె.

టేబుల్‌మీది కాగితాలు సర్దుతూ, "డాక్టర్ మణి వెంటనే వచ్చి కలవమన్నారట" అంది తన్మయి.

"ఎందుకు? " కనుబొమ్మలు పైకి ముడిచి అడిగింది నీహారిక.

"ఏమో? " అని అంతలోనే ఏదో గుర్తొచ్చి నదానిలా "అవును! నువ్వు ఫ్రీ అయితే నాతో కూడా రారాదూ? " అంది తన్మయి.

"ఓ... ష్యూర్! వస్తాను. కాకపోతే లోప లికి రాను. బయటే వెయిట్ చేస్తాను"

ఇద్దరూ ల్యాబ్‌లోంచి బయటకు వచ్చి డాక్టర్ మణి క్యాబిన్‌వైపుకు నడిచారు.

తన్మయి వెళ్ళేసరికి ఛీఫ్ డాక్టర్ ఎవరి తోనో ఫోన్‌లో మాట్లాడుతున్నాడు. ఆమెను చూడగానే కూర్చోమని సైగచేశాడు.

ఆయనకు ఎదురుగా ఉన్న కుర్చీలో కూర్చుంది.

ఫోన్ మాట్లాడి పెట్టేశాక తన్మయి వంక చిరునవ్వుతో చూస్తూ అడిగాడు డాక్టర్ మణి, "ఎలా వున్నారు? మీ ప్రయోగం ఎంతవరకు వచ్చింది? "

వెంటనే ఏదో సమాధానం చెప్పబో యింది. కాని చెప్పబుద్ధి కాలేదు. "అసలు ఛీఫ్ నిన్నెందుకు పిలిచాడో చెప్పనీ తర్వాత నీ సక్సెస్ గురించి చెప్పచ్చులే..." అని కేక లేసింది ఆమె మనసు. అందుకే ఉద్వేగాన్ని అదుపులో పెట్టుకుని

"థాంక్యూ సర్! ఐయామ్ ఆల్‌రైట్... ప్రయోగం కొనసాగుతోంది. దాదాపు తొంభై శాతం పూర్తయినట్టే. కాని ఆ చివరి పదిశా తమే నన్ను కొంచెం ఇబ్బంది పెడు తోంది..." నిజాయితీగా చెప్పింది తన్మయి.

సంభాషణంతా ఇంగ్లీషులోనే జరుగు తోంది.

మణి తననెందుకు పిలిపించివుంటాడు? అని ఆలోచిస్తూనే ఆయన అడిగినదానికి సమాధానాలు ఇవ్వసాగింది. ఆరోజు సమా వేశం తర్వాతనుంచి మణి డాక్టర్‌గా కాక ఆమెకు ఓ వ్యాపారవేత్తలా కన్పిస్తున్నాడు.

"గత మూడు నెలలుగా మీరు ఇదే సమా ధానం చెప్తున్నట్టున్నారు..." మణి చాలా కాజువల్‌గానే అన్నా ఆ మాటతో తన్మయి ముఖం ఎర్రగా కందిపోయింది.

ఏదో అనబోయి, వెంటనే తననితాను సంభాళించుకుంటూ అంది "ఎస్. సర్! నా పరిధిలో నేను శాయశక్తులా ప్రయత్నిస్తూనే ఉన్నాను. కాని ఏం చేయను? ఆశించిన ఫలితం కన్పించడంలేదు. ఈ విషయంలో నేను నిస్సహాయురాలిని..."

తన్మయిలో మణికి నచ్చేగుణం అదే "నిజాయితీ..."

"మీరేమీ అనుకోకపోతే మీరిప్పుడు చేస్తున్న పి. జి. డి. ప్రయోగం గురించి ఓసారి వివరిస్తారా? " రివాల్వింగ్ చైర్లో వెనక్కి వాలుతూ అడిగాడు మణి.

ఆయన ఎందుకలా అడిగాడో ఆమెకు అర్థం కాలేదు.

ఒకసారి తలెత్తి చీఫ్‌వంక చూసి గొంతు సవరించుకుని చెప్పనారంభించింది. పి. జి. డి. అంటే ప్రీ ఇంప్లాంటేషన్ జెనెటిక్ డయాగ్నసిస్"

తన్మయి మాటలకు అడ్డు తగులుతూ అన్నాడు మణి. "నేను అడుగుతున్నది పి. జి. డి. వివరణ, పుట్టుపూర్వోత్తరాలు కాదు! మీరు ఇక్కడ మన ల్యాబ్‌లో చేస్తున్న ప్రయోగం గురించి... ఇంకా చెప్పా

లంటే మీరు ఫాలో అవుతున్న ప్రొసీజర్ చెప్పండి..."

స్వరం కొంచెం పెంచి అందులో తన చీఫ్ డాక్టర్ అధికారం కూడా కాస్త కలిపి అడిగేసరికి తన్మయికి ఏం మాట్లాడాలో అర్థం కాలేదు.

ఆమె ఏదో చెప్పాలని ప్రయత్నించింది. పెదవులు కదిలాయి. కాని గొంతులోని మాట మాత్రం రాలేదు.

ఆమెను గమనిస్తున్న మణి తన స్వరం మార్చి ఇలా అన్నాడు.

"చూడండి మిస్ తన్మయి మీ ఇంటలిజెన్స్ గురించీ, సిన్సియారిటీ గురించి నేను ప్రశ్నించడం లేదు. నిజానికి మీరు మా రీసెర్చి సెంటర్‌కు వచ్చిన పర్పస్ వేరు. మేము మీకు అప్పగించిన పని వేరు. ఈ పనికి మీరు సమర్థులని భావించే దీనిని మీకు అప్పగించాం. అయితే కొంచెం మా పరిస్థితులు కూడా మీరు అర్థం చేసుకోవాలి. మన క్లినిక్ ఇంతక్రితం వరకు నెంబర్‌వన్ పొజిషన్‌లో ఉండేది. కాని ఇప్పుడు ఇతర హాస్పిటల్స్ తాకిడి ఎక్కువై మన క్లినిక్‌కు వచ్చే రోగుల సంఖ్య తగ్గుతోంది. ఈ నేపథ్యంలో మనం ఏదైనా సెన్సేషన్ క్రియేట్ చేస్తేకాని గత వైభవం అందుకోలేం. అందుకు మీ సహకారం మాకు ఎంతో అవసరం. మామీద ఉన్న ఒత్తిడి కారణంగా మిమ్మల్ని మీ ప్రయోగం గురించి ఇలా ప్రశ్నించాల్సి వస్తోంది తప్ప సాధారణంగా మన రీసెర్చి ల్యాబ్‌లో పనిచేస్తున్న శాస్త్రవేత్తల పనిలో మేము ఎంత మాత్రం కల్పించుకోం. ఆ విషయం ఈపాటికే మీకు అర్థమయి ఉంటుందనుకుంటాను.

అప్పటికి తన్మయి కొంచెం సర్దుకుంది. "సర్! ఈ పి.జి.డి. ప్రయోగం వినడానికి, చదవడానికి ఇంతేనా అని అన్పిస్తుంది. కాని ప్రాక్టికల్‌గా దీనిలో ఎంతో రిస్క్ వుంది. ఉదాహరణకు పి.జి.డి. ప్రయోగంలో మొదట స్త్రీ అండాశయంనుంచి ఇంకా ఫలదీకరణం చెందని అండాలు సేకరించాలి. వాటిని వీర్యకణాలతో సంధానపరచి దాదాపు మూడురోజులపాటు ఇంక్యుబేటర్‌లో ఉంచాలి. అంటే పది అండాలతో ప్రయోగం మొదలుపెట్టామనుకుంటే వాటిలో ఆరేడు మాత్రమే లేబొరేటరీలో ఫలదీకరణం చెందుతాయి. మిగిలినవి పాడైపోతాయి. మనకు మిగిలిన పిండాలలో కూడా ఆడ, మగ రెండూ వుంటాయి. మనకు మగబిడ్డ కావాలనుకుంటే ఆడపిండాలను పక్కన పెట్టేస్తాం. ఈ ప్రక్రియ పూర్తయ్యేసరికి మహా అయితే రెండు లేదా మూడు పిండాలు మిగులుతాయి. వీటిలో ఒక పిండాన్ని గర్భాశయంలో ప్రవేశపెట్టాలి. ఇందులో ఎక్కడ ఫెయిలయినా తిరిగి మొదటినుంచి మొదలుపెట్టాలి. మీరన్నట్టు ఈ పి.జి.డి. సక్సెస్ అయినా సామాన్య జనానికి అందుబాటులో ఉండదు. ఎందుకంటే ఇందుకోసం కనీసం లక్షన్నరనుంచి రెండు లక్షలదాకా ఖర్చుచేయాల్సివస్తుంది. పోతే ఈ పి.జి.డి. సౌకర్యం ప్రపంచవ్యాప్తంగా కేవలం ఏడు కేంద్రాల్లో మాత్రమే అందుబాటులో ఉంది. మనం సక్సెస్ అయితే ఎనిమిదో కేంద్రం మనదవుతుంది. అంతకు తప్పించి మనం ఎలాంటి సెన్సేషన్ క్రియేట్ చేయలేం..." చెప్పాలనుకున్నది పూర్తిచేసి నుదుట పట్టిన చెమటను కర్చీఫ్‌తో అద్దుకుంది తన్మయి.

డాక్టర్ మణి కన్నార్పకుండా తన్మయి వంకే చూస్తుండిపోయాడు. ఆమెను చూసినప్పుడల్లా ఇలాంటి కూతురుంటే ఎంత బావుండేది? అని అన్పిస్తుంటుంది. పెళ్లయిన మూడు నెలలకే భర్తతో పోట్లాడి అలిగి పుట్టింటికి వచ్చేసిన కూతురికి భార్య సపోర్ట్ తోడవడంతో ఏమనలేక ఊరుకున్నాడు మణి. వారంక్రితమే పండంటి బిడ్డను ప్రసవించిన కూతురు కాపురాన్ని ఇకమీదట మనవడైనా చక్కబరుస్తాడేమో




నన్ను ఆశతో ఉన్నాడాయన.

హాస్పిటల్ విషయంలో డాక్టర్ సునీల్ చెప్పింది చేయకుండా ఉందామా! అని క్షణ కాలం అన్పించినా వెంటనే సర్దుకున్నాడు. సెంటిమెంట్స్‌తో క్లినిక్ రెప్యుటేషన్ నాశనం చేయడం మణి దృష్టిలో పాపమేకాదు చాలా ఘోరం కూడా.

"నిజమే తన్మయిా! మీరు చెప్పింది నూటికినూరుపాళ్లు యదార్థం. అందుకే నేనో మార్గం ఆలోచించాను. తక్కువ ఖర్చుతో పి.జి.డి. ఫలితాలను అందరికీ అందుబాటులోకి తీసుకురావడమే దీని ఉద్దేశం..."

ఆమె ముఖంలో చోటుచేసుకుంటున్న మార్పులు జాగ్రత్తగా గమనిస్తూ చెప్పసాగాడు డాక్టర్ మణి.

"మీరన్నట్టు పి.జి.డి. ప్రయోగం సక్సెస్ అయినా సామాన్యజనానికి అందుబాటులో ఉండే అవకాశం లేదు. అలాంటప్పుడు కనీసం మన క్లినిక్ శ్రేయస్సు కోసమైనా ఉపయోగపడాలిగా. అందుకే మామూలుగా సంతాన సాఫల్య కేంద్రాల్లో ఉపయోగించే ఎరిక్సన్స్ పద్ధతినే మనమూ ఇందుకు వినియోగిద్దాం. ఇక్కడ మన ఐ.వి.ఎఫ్.లో ఆల్రెడీ ఇది అందుబాటులోనే ఉంది. పోతే దీనివల్ల సక్సెస్ శాతం తక్కువ. అన్ని ఫెర్టిలిటీ సెంటర్స్‌లో అమలులో ఉన్నదే. అలాంటప్పుడు జనాన్ని ఆకర్షించడం కష్టం. అందుకే మీ సహాయం కావాలి"

డాక్టర్ చెప్తున్నది చాలా జాగ్రత్తగా వింటోందామె. ఆయన చెప్పే విషయం అర్థమయ్యీ కానట్టుగా ఉంది.

"మీరు పెద్దగా చేయాల్సిందేమీ లేదు. మేం ఒక ప్రెస్‌మీట్ ఏర్పాటుచేస్తాం. దానిలో మీ గురించి, మీ ప్రయోగం గురించి చెప్పి ఇందులో మీరు విజయం సాధించారని చెప్తాం. మీరేం చేయాలంటే మీ దగ్గరున్న నోట్సు ప్రకారం మీరు ఈ ప్రయోగాన్ని ఎలా జరిపారో వివరించి చెప్పాలి. ఆ తర్వాత వారంక్రితం డెలివరీ అయిన మా అమ్మాయిని ప్రెస్‌కు పరిచయం చేస్తాను. తనమీదే ప్రయోగం జరిపారని, తాను కోరుకున్న విధంగా మగబిడ్డ పుట్టాడని మా అమ్మాయి చెప్తుంది. ఇక నేను ఈ క్లినిక్ ఛీఫ్‌గా ఆ ప్రయోగం సక్సెస్ అయిందని ధృవీకరిస్తాను. మొదట కన్నకూతురినే ప్రయోగానికి ఎన్నుకున్నానని కూడా చెప్తాను. దాంతో మన క్లినిక్ పేరు, నీ పేరు కూడా మారుమోగిపోతుంది. జనం అమృత క్లినిక్ ఎదుట బారులు తీస్తారు. మనం మాత్రం లింగనిర్ధారణ కోసం జరిపే ప్రయోగమే దీనికి ఉపయోగిస్తాం. ఎవరికి ఏ బిడ్డ పుడితే వారే తాము కోరుకున్న బిడ్డ అని దంపతులచేత చెప్పిస్తాం. ఇదంతా మా తలనొప్పి, నువ్వు ఒక్కసారి ప్రెస్‌మీట్‌కు వచ్చి పి.జి.డి. గురించి చెప్తే చాలు. ఆ తర్వాత నీ ప్రయోగాలు నీవి! మా తిప్పలు మావి. ఏమంటావ్!"

డాక్టర్ మణి మాటలకు తన్మయి అవాక్కయింది.

అసలు ఎలా రియాక్ట్ కావాలో కూడా ఆమెకు అర్థం కావటంలేదు.

డాక్టర్ మణి మంచి డాక్టరే కాదు. వ్యాపారవేత్త కూడా అని ఆమె గతంలోనే వినివుంది. ఇప్పుడు ప్రత్యక్షంగా చూస్తోంది.

మొదటిసారి మణి తనకు ఆ పని అప్పగించినప్పుడు ఆయన చెప్పిన మాటలు గుర్తుకొచ్చాయి. "పి.జి.డి. ప్రపంచవ్యాప్తంగా కేవలం ఏడు కేంద్రాలలో మాత్రమే అమలులో ఉంది. దానిని వారు కోరుకున్న బిడ్డను పొందే మార్గంగా ఉపయోగిస్తున్నారు. అలా చేయటం నాకిష్టంలేదు. హీమోఫీలియా, డౌన్ సిండ్రోమ్ వంటి క్రోమోజోమ్ సంబంధ అపశ్రుతులను ముందుగా పసిగట్టేందుకు తోడ్పడే ఈ అధునాతన ప్రక్రియను నిర్దేశించిన దానికోసమే ఉపయోగించాలన్నది నా కోరిక. పి.జి.డి.ని అధ్యయనం చేసి మనకు అందుబాటులోకి తీసుకురాగలవని ఆశిస్తున్నాను" అన్నాడు.



కాని ఇప్పుడు ఆయన ప్రపోజల్ వింటుంటే తన మంచితనం, అమాయకత్వాలను ఆసరాగా తీసుకుని తననో బలిపశువును చేసేందుకు ప్రయత్నిస్తున్నారని ఆమెకు అనిపించసాగింది. తన ప్రయోగం మానవాళి శ్రేయస్సు కోసంకాక ఇలా ఉపయోగిస్తారని తెలిస్తే తను ఆరంభంలోనే ఇందుకు అంగీకరించేది కాదు.

ఆమె ఆలోచనలతో సంబంధం లేనట్టుగా డాక్టర్ మణి చెప్పుకుపోతున్నాడు. "ఇందుకు మీరు చేయాల్సింది పెద్దగా ఏమీ లేదు తన్మయి! జస్ట్ మా ప్రపోజల్‌కు ఒప్పుకుంటే చాలు. మేం చెప్పినట్టు మాట్లాడితే సరిపోతుంది. మిమ్మల్ని ఇలా అడగడం భావ్యం కాకపోవచ్చు. కాని క్లినిక్ అభివృద్ధి దృష్ట్యా తప్పడం లేదు"

ఆమె మనసంతా ఖాళీగా అయిపోయినట్టుగా వుంది. తన్మయి మారుపలకకుండా కూర్చుండిపోయింది.

తన్మయి నిశ్శబ్దం మణిలో అసహనాన్ని పెంచుతోంది.

సూదిపడితే వినపడేంత నిశ్శబ్దం అక్కడ వ్యాపించింది.

"చెప్పండి తన్మయి! ఈ ప్రపోజల్ మీ కిష్టమేగా...? "

"డాక్టర్! మనం చేయబోయేది అనైతికం కదా? " ఒక్కో అక్షరం కూడదీసుకుంటున్నట్టుగా అడిగింది తన్మయి.

ఆమెనుంచి ఊహించని ప్రశ్న ఎదురయ్యేసరికి విస్తుబోయాడు మణి.

'మీరేం చేయక్కర్లేదు. ప్రెస్‌మీట్‌కు వచ్చి మేం చెప్పిన నాలుగు మాటలు మాట్లాడితే చాలు. మీకు బోలెడంత కీర్తిప్రతిష్ఠలు వచ్చే అవకాశం కల్పిస్తామం'టే ఆనందంలో ఎగిరి గంతులు వేయాల్సిందిపోయి ఇలా అనైతికం, అధర్మం అని ఆమె ఆలోచిస్తున్నందుకు మణిలో చికాకు చోటుచేసుకుంది.

తన్మయి కొనసాగించింది.

"డాక్టర్‌జీ! నేను ఈ రీసెర్చి ల్యాబ్‌లో చేరినప్పటినుంచి మీ గురించి వింటున్నాను. మీకు వైద్యం అనేది కూడా ఒకరకమైన వ్యాపారమేనని అంతా అంటుంటారు. మీరు ఈ క్లినిక్‌లో చేరకముందు 'అమృత క్లినిక్' పరిస్థితి చాలా దయనీయంగా ఉండేదనీ, మీరు చేరాకే దీని రూపురేఖలు మారిపోయాయని కూడా అంటారు. వాటిమాట ఎలా ఉన్నా మీరు నిర్వహించిన హెల్త్‌క్యాంప్‌లు, ఎవేర్‌నెస్ ప్రోగ్రామ్‌ల గురించి విన్నప్పుడు నేను చాలా థ్రిల్ అయ్యాను. దాని వెనుకనున్న కారణం 'అమృత'ను ప్రజలు గుర్తించటమే కావచ్చుగాక. కాని ఇందువల్ల ప్రజలలో అనారోగ్యం, ఆరోగ్యం, పోషకాహారం ఇలాంటివాటికి సంబంధించిన ఓ అవగాహన ఏర్పడింది. అంటే ఇందువల్ల ఇద్దరూ లాభపడ్డారన్నమాట. ఇలాంటి మంచి పనులు చేస్తున్న మీకు మన స్టాఫ్ అన్యాయంగా 'వ్యాపారవేత్త' అని 'స్వార్థపరుడని' బిరుదులు ఇచ్చారేమో అని నవ్వుకున్నాను. కాని ఇప్పుడు మీ మాటలు విన్నాక వారి మాటల్లో అసత్యం లేదని అర్థమవుతోంది"

డాక్టర్ మణి ఏదో చెప్పబోయాడు.

తన్మయి ఆ అవకాశం ఇవ్వలేదు. "మణిగారు! నా గురించి నేను గొప్పగా చెప్పడం కాదుకాని అవసరం వచ్చింది కాబట్టి ఒక్క మాట మాత్రం చెప్తాను. 'వైద్యోనారాయణో హరిః' అన్న మాటలు నేను సంపూర్ణంగా విశ్వసిస్తాను. నేను రావ్‌బహాదూర్‌గారి మనవరాలిని. మా తాతగారు ఎన్నో ఆస్పత్రులకు లక్షల రూపాయలు విరాళంగా ఇచ్చారు. ఎందుకో తెలుసా? వైద్యులు భూమిమీద అవతరించిన దేవుళ్లని ఆయన నమ్మకం. దురదృష్టవశాత్తు మేం మా ఆస్తంతా పోగొట్టుకున్నా బామ్మ నన్ను ఎంతో అపురూపంగా పెంచింది. కట్టుబట్టలతో మేం రోడ్డు మీద నిలబడినప్పుడు మా లాయర్‌గారు 'కొడుకు చేసిన అప్పులతో తనకేం సంబంధంలేదని ఈ ఆస్తి అంతా





తనకు పుట్టింటివారు పసుపుకుంకుమల కింద ఇచ్చారని బామ్మను చెప్పమన్నారు. అలా చెప్తే ఆస్తి మిగులుతుందని తాను ఆవిధంగా కేసు ఫైల్ చేస్తాను అని చెప్పారు. కాని మా బామ్మగారు ఒప్పుకో లేదు. 'అప్పులు చేసింది నా కన్నకొడుకు అయినప్పుడు నాకు వాటితో సంబంధం లేదని ఎలా అనగలను? ఆ ఆస్తి ఐశ్వర్యాల కోసం తరతరాలుగా వస్తున్న మా వంశప్రతిష్ట, గౌరవాలకు భగ్నం కలిగించలేను. ఏదో భగవంతుడు ఇచ్చిన శక్తి ఇంకా నా రెక్కలలో ఉంది. నా మనవరాలిని ఎలాగోలా పోషించుకోలేకపోను. అలా చేయలేనినాడు ఇద్దరం ఏ నుయ్యో గొయ్యో చూసుకుంటాం' అంది. ఆ తర్వాత నిజంగానే బామ్మ నన్ను పెంచేందుకు చాలా కష్టపడింది. ఇదంతా ఎందుకు చెప్తున్నానంటే నీతి, నిజాయితీ, నైతికత ఈ మూడింటిని రంగరించి మా బామ్మ నన్ను పెంచింది. మరి వాటినన్నింటిని పణంగా పెట్టి ఇప్పుడు డబ్బుకోసమో లేక పేరు ప్రఖ్యాతులు వస్తాయనో మీరు చెప్పిన పనికి నేను అంగీకరించలేను. నన్ను క్షమించండి"

తాను చెప్పాల్సింది చెప్పాక గుండెల మీంచి పెద్ద బరువు దిగిపోయినంత రిలీఫ్ కనిపించింది తన్మయి ముఖంలో.

కాని డాక్టర్ మణి ముఖంలో చాలా అసహనం ద్యోతకమైంది. రెస్ట్‌లెస్‌గా కుర్చీలో అటు ఇటు కదిలాడు. మిగతా వారితోలాగా తన్మయితో కఠినంగా ప్రవర్తించలేకపోతున్నందుకు తననుతానే తిట్టుకున్నాడు.

"అంటే మీరు చెప్పేది...?"

"డాక్టర్ మణీ! మీరు మంచి వ్యాపారవేత్త అయివుండి ఇంత చిన్న విషయం అర్ధం చేసుకోలేకపోతున్నారంటే నమ్మశక్యంగా లేదు. ఎనీహౌ మీరు చేయబోయే పని తప్పని, మీ మనసులు మార్చాలని నేను ప్రయత్నించబోవటంలేదు. అందువల్ల ఎలాంటి ప్రయోజనం ఉండదని నాకు తెలుసు. కాకపోతే ఇందుకోసం మీరు ఎన్నుకున్న వ్యక్తి మాత్రం సరైనవారు కాదని చెప్పగలను. ఎందుకంటే ఆ వ్యక్తిని నేనే గనుక! నేను ఎప్పటికీ ఈ ప్రయోగానికి అంగీకరించను గనుక" అంది తన్మయి తాపీగా ఆమెలో ఇప్పుడు మునుపటి భయంలేదు.

తన్మయి మాటలకు మణి ముఖం కందగడ్డలా ఎర్రగా మారింది. 'అమృత'లో ఆయన మాటకు ఎవ్వరూ ఎదురుచెప్పేందుకు సాహసించరు. అలాంటిది మొదటిసారి ఓ స్త్రీ తన మాటలు పెడచెవిన పెట్టడం చూస్తుంటే ఆయనలో ఆవేశం లావాలా ఎగచిమ్ముతోంది. అంతవరకూ తన స్వభావానికి విరుద్ధంగా నచ్చజెప్తున్న ధోరణిలో మాట్లాడుతున్న మణిలోని అసలు వ్యక్తి బయటకు వచ్చాడా క్షణంలో..."

తాను చెప్పగానే ఒప్పుకోకపోతే ఏంచేసి ఆమెని ఒప్పించాలో చీఫ్‌ముందే నిర్ణయించుకున్నాడు. రాని నవ్వు ముఖంలోకి బలవంతంగా తెచ్చుకుని "ఓ.కె. మిస్ తన్మయీ! మీకు ఇష్టం లేకపోతే పోనీండి. దీన్ని ఇంతటితో వదిలేద్దాం. ఇక్కడ జరిగినదంతా మర్చిపోదాం" అన్నాడు మణి.

తన్మయి ఆయనవంక అపనమ్మకంగా చూసింది.

ఈ సమస్య ఇంత తొందరగా పరిష్కారమవడం ఆమెకు ఆశ్చర్యంగా ఉంది.

ఎప్పుడెప్పుడు ఆ రూంలోంచి బయటకు వచ్చేద్దామా అని ఆరాటపడ్తున్న తన్మయి వెళ్ళడానికన్నట్టు కుర్చీలోంచి లేచింది "థాంక్యూ సర్! నన్ను అర్థం చేసుకున్నందుకు కృతజ్ఞతలు"

అప్పటికీ ఆయన ముఖంలో మార్పు లేదు. ఇంతక్రితం వున్న ఆవేశం ఇప్పుడు మచ్చుకైనా కన్పించకపోవటం తన్మయికి ఊరటనిచ్చింది. ఇక్కడే మణి విషయంలో ఆమె పొరపడింది.

"ఆc... మిస్ తన్మయీ! ఒక్కక్షణం!

అవునూ! మీ బామ్మగారికి ఆరోగ్యం బాలేదని విన్నాను" పరామర్శించినట్టుగా అడిగాడు డాక్టర్ మణి.

"అవును సార్..."

"ఏంటి ప్రాబ్లమ్?" గొంతులో తెచ్చిపెట్టుకున్న మార్దవంతో అడిగాడు.

అడగటం వెనుకనున్న అంతరార్థం ఆమె గ్రహించలేకపోయింది.

"బైపాస్ సర్జరీ చేయాలన్నారు సార్! ఇక్కడ మన కార్డియాలజీ విభాగంలోనే జాయిన్ చేశాను. ఈ ప్రపంచంలో నాకున్న ఒకేఒక్క తోడు మా బామ్మ. ఆమెకేదైనా అయితే నేను తట్టుకోలేను" కళ్లు తుడుచుకుంటూ చిన్నపిల్లలా చెప్తున్న తన్మయిని చూస్తూ 'మొత్తానికి నీ బలహీనత ఏమిటో నీ నోటితోనే చెప్పావు. ఇంక ఇప్పుడెలా నానుంచి తప్పించుకుంటావు?' అన్నట్టుగా చూశాడు మణి.

బామ్మ గుర్తుకు రాగానే ధైర్యం స్థానాన ఆమెలో బేలతనం చోటుచేసుకుంది.

"చూడు తన్మయీ! నేను చాలా మంచివాడ్ని అని చెప్పనుగాని, జనం అనుకునేంత దుర్మార్గుణ్ణి మాత్రం కాదు. అందుకే ఎల్లవేళలా భగవంతుడు కూడా నాకు సాయపడ్తుంటాడు. ఇప్పుడు కూడా అదే జరిగింది. అందుకే మీ బామ్మగారికి బైపాస్ సర్జరీ చేయాల్సివచ్చింది"

మణి చెప్తున్నదేమిటో అర్థంకానట్టు చూసింది డాక్టర్ తన్మయి. తన బామ్మకు బాగుండకపోవడంవల్ల ఆయనకు కలిగే మేలేమిటి?

"అర్థం కాలేదుకదూ. వివరంగా చెప్తాను. మీ బామ్మగారికి బైపాస్ సర్జరీ చేయించనిదే ఆమె బతకదు. అందుకోసం 'అమృత'లాంటి క్లినిక్‌లో కనీసం లక్ష రూపాయలదాకా ఖర్చుపెట్టాలి. కాని ఇక్కడి స్టాఫ్‌కు ఫీజులో రాయితీ ఉంటుంది. ఆ మిగిలిన డబ్బు కూడా ఒకేసారి పే చేయాల్సిన అవసరం ఉండదు. నెలకు కొంత చొప్పున జీతంలో కట్ అవుతుంది. కాని ఇదంతా నేను చెప్పిన పనికి నువ్వు అంగీకరించినప్పుడు. లేదనుకో మీ బామ్మకు ఇక్కడ ట్రీట్‌మెంట్ జరగదు. నీ ఉద్యోగానికి నువ్వు రాజీనామా చేయాల్సివుంటుంది. రాజీనామా చేసిన వెంటనే ఫ్లాట్ ఖాళీ చేసి వెళ్ళిపోవాలి. ఒక్కమాటలో చెప్పాలంటే నువ్వు నా ఆఫర్ తిరస్కరిస్తే రోడ్డుమీద పడతావు. నీకు తోడు అనారోగ్యంతో ఉన్న మీ బామ్మ" క్రూరమైన నవ్వు కదలాడింది మణి ముఖంలో.

"ఇది... ఇది చాలా అన్యాయం సర్" దాదాపుగా అరిచినట్టే అంది తన్మయి. ఊహించిన దానికన్నా దుర్మార్గుడిగా కన్పిస్తున్నాడు మణి ఆమె కళ్లకు.

"రిలాక్స్ తన్మయీ! ఈ క్షణంలో నువ్వు ఏం ఆలోచిస్తున్నావో చెప్పనా? వీడి గురించి హాస్పిటల్ యాజమాన్యానికి కంప్లెయింట్ చేయాలి అని... అంతేగదూ"

తన్మయి మనసులోని భావాన్ని చదువుతున్నట్టుగా అన్నాడు డాక్టర్ మణి.

అవును! ఆ క్షణంలో తన్మయి సరిగ్గా అదే అనుకుంది.

"మిస్ తన్మయీ! నువ్వు ఇంతకుముందు చెప్పావే నీతి, నిజాయితీ అని. నేను మొదట్లో వాటిని పట్టుకునే ప్రాకులాడేవాడిని. కాని కట్టుకున్న భార్య 'నువ్వు చాతకానివాడివి' అన్నాక నాలో కసి మొదలైంది. మనకంటూ వ్యక్తిత్వం, మంచితనం, నలుగురికి సాయం చేయాలనే తపన ఉన్న నన్ను ఈ సమాజం ఎందుకూ కొరగానివాడిగా ముద్రవేసినప్పుడు నేనేమిటో నిరూపించుకోవాలనే పట్టుదల పెరిగింది. అందుకే నీతి నిజాయితీలను పక్కనపెట్టి ప్రజల బలహీనతలమీద ఆడుకోవడం మొదలుపెట్టాను. అందుకోసం నేను వ్యక్తిగా చాలా పతనమైపోయుండచ్చు. ఈ మనసుకు వ్యాపారం, డబ్బు తప్పితే ఆత్మీయత, అనురాగం పట్టని స్థితికి చేరుకున్నాను. ఇక ఇప్పుడు ఈ





మార్గంలో ముందుకు పోవటం తప్పితే వెనక్కి మరలలేను. ఎందుకంటే నేనిప్పుడు మంచిగా మారదామన్నా ఈ సమాజం నన్ను మారనివ్వదు. అంతెందుకు నేను ఆడమన్నట్టుగా ఆడే ఈ ఆస్పత్రి యాజమాన్యం కూడా నేను మంచితనం, మానవత్వం గురించి చెప్తే నన్నో పిచ్చివెధవను చూసినట్టు చూస్తుంది. తక్షణం నన్ను తొలగించి మరొకరిని ఆ స్థానంలో నియమిస్తుంది. తన్మయీ! అందుకే చెప్తున్నాను. నిన్ను చూస్తే నాకు నీలాంటి అమ్మాయి వుంటే ఎంత బాగుండేది అని అనిపిస్తుంటుంది. ఆ వాత్సల్యంతోనే చెప్తున్నాను. మణిని ఎదిరించి శత్రుత్వం కొనితెచ్చుకోకు. మా ఆఫర్ అంగీకరిస్తే నీ జీవితమే మారిపోతుంది. అసలు నా తర్వాత నా స్థానాన్ని నీవు ఆక్రమించినా ఆశ్చర్యపోవక్కర్లేదు. లేదంటే నువ్వు చాలా కష్టాలు పడాల్సివస్తుంది" మంద్రస్థాయిలో వినిపించింది మణి స్వరం. అసలు ఓ వ్యక్తికి అంత నచ్చజెప్పడం మణి ఎప్పుడూ చేయలేదు. కాని తన్మయిని చూస్తే మణికి పుత్రికా వాత్సల్యం కలుగుతుంటుంది.

తన్మయి మనసులో బాధ సుడులు తిరుగుతోంది. ఆమెలోని శక్తినంతా ఎవరో తోడేసినట్టుగా తిరిగి కుర్చీలో కూలబడిపోయింది.

ఎదుటివ్యక్తి అసహాయతను కూడా సొమ్ము చేసుకోవాలని ప్రయత్నిస్తున్న డాక్టర్ మణి మీద ఆమెకు ఆగ్రహం తన్నుకొస్తోంది. కానీ ఏం చేయగలదు?

ఆమెకు భరించలేనంత నిస్సత్తువుగా అన్పించింది. కనీసం అక్కడినుంచి లేచే ఓపికకూడా లేనట్టుగా ఆమె కూర్చుండిపోయింది. అవును మరి గుండెలనిండా దిగులు, ఆవేదన పేరుకున్న వ్యక్తి పరిస్థితి అలాగే ఉంటుంది.

"ఓకే తన్మయీ! తొందరేంలేదు. మీరు బాగా ఆలోచించుకున్నాక చెప్పండి. అండ్ నౌ యు ప్లీజ్ ఎక్స్‌క్యూజ్ మి. ఐ హావ్ యాన్ ఇంపార్టెంట్ మీటింగ్" అంటూ ఆమెవైపు చూసి చిన్నగా నవ్వుతూ టేబుల్ మీద ఉన్న సెల్‌ఫోన్ తీసుకుని బయటకు వెళ్లిపోయాడు.

ఆ రూమ్‌లోంచి బయటపడాలి అనే ఆలోచన కూడా లేకుండా అలాగే కూర్చుండిపోయింది తన్మయి. బామ్మ గుర్తొచ్చింది.

తన కడుపు నింపటానికి తాను ఆకలితో పడుకున్న ఆ అమృత హృదయం, తన భుజం మీద వేసుకుని నిద్రబుచ్చిన ఆ మాతృమూర్తి తన చేయి పట్టి అక్షరాలు దిద్దించిన గురువు.

ఈ రోజు హాస్పిటల్ బెడ్‌మీద పడుకుని వుంది. ఆమెను బతికించుకోవాలంటే మణి ఆఫర్‌ను ఒప్పుకోవాలి. లేదంటే... అంత కన్నా ఆలోచించడానికి తన్మయి మనసు అంగీకరించలేదు. బామ్మను బతికించుకోడానికి మణి చెప్పినదానికి అంగీకరించినా విషయం తెలిశాక బామ్మ ఎందుకు చేశావీ పని? నేను నీకు నేర్పింది ఇదేనా అని ప్రశ్నిస్తే ఆమె దగ్గర సమాధానం లేదు. అంత కష్టపడి మనసు చంపుకుని బామ్మను బతికించుకున్న దానికి అప్పుడిక అర్థం ఉండదు.

ఆమె కళ్లముందు బామ్మే కన్పిస్తోంది.

హాస్పిటల్లో జాయిన్ చేస్తున్నప్పుడు తను కంటతడిపెడితే పేషెంటుకు ధైర్యం చెప్పాల్సిన నువ్వు బేలగా ఇలా ఏడవడం తప్పు కాదూ? మనిషన్నాక రోగం, రొప్పూ రాకుండా ఎలా వుంటాయి? దిగులుపడకు తగ్గిపోతుందిలే. అయినా అమ్మడూ! నీకు పెళ్లి కావాలి. మనవడిని, మనవరాలిని ఎత్తుకుని ఆడించాలి. అప్పటివరకు ఆ భగవంతుడు ఎన్నిసార్లు పిలిచినా రానని చెప్పేస్తానే అని తనకు ధైర్యం చెప్పిన బామ్మను ఎలా బతికించుకోవాలి?

ఆమె కళ్ల వెంబడి నీళ్లు ధారాపాతంగా కారిపోతున్నాయి. కేవలం తన అసహాయత

వల్ల బామ్మ తనకి దక్కదేమోనన్న బాధ... అసహాయత మాత్రమే కాదు భరించలేని విషాదంవల్ల కూడా వచ్చిన కన్నీళ్లవి.

అంతలో భుజంమీద ఎవరిదో చేయిపడటంతో ఈ లోకంలోకి వచ్చి కళ్లు తుడుచుకుంది.

"తన్మయీ! వెడదాంపద..." ఆమె భుజాలు పట్టుకుని లేపుతూ అంది డాక్టర్ నీహారిక.

తన్మయికోసం చాలాసేపు వెయిట్ చేసిన నీహారిక ఎంతకీ ఆమె రాకపోవడంతో మణి కాబిన్‌లోకి అడుగుపెట్టింది.

చిత్తరువుకు ప్రాణం వచ్చినట్టుగా నీహారిక వెంటనడిచింది తన్మయి.

"ఏమైంది?" అని అడుగుదామనుకుని కూడా ఇప్పుడు సమయం కాదని విరమించుకుంది నీహారిక.

"మా ఇంటికి వస్తానన్నావుగా! గుర్తుందా?" కారు ఫ్రెంట్ డోర్ తెరిచి ఎక్కమన్నట్టుగా తన్మయి వంక చూస్తూ అడిగింది నీహారిక.

"కానీ ఇప్పుడు" అంటూ ఏదో చెప్పబోయి అంతలోనే విరమించుకుని నీహారిక కారెక్కింది తన్మయి.

★ ★ ★

"హాయ్ నీహా! ఏమిటి అర్జంటుగా రమ్మని కబురు చేశావ్? కొంపదీసి మీ నాన్నగారు మళ్లీ ఏదైనా సంబంధం చూశారా? అయినా నీకీ పెళ్లి వైరాగ్యం ఏమిటి? లక్షణంగా ఆయన తెచ్చిన పెళ్లి చేసుకోవచ్చుకదా! అసలిలా వచ్చిన సంబంధమల్లా కాదంటున్నావంటే దీని వెనుక ఏదో లవ్ ఎఫేర్ లాంటి కారణం ఉండే ఉంటుంది" వస్తూనే కామా, ఫుల్‌స్టాప్ లేకుండా మాట్లాడటం మొదలెట్టేసిన పవన్ ఆ గదిలో మరో వ్యక్తి ఉన్నారన్న విషయం చాలా సేపటి వరకు గమనించలేదు.

నీహారిక, పవన్ చిన్నతనం నుంచి మెడిసన్ వరకు కలిసి చదువుకున్నారు. వృత్తి ఉద్యోగాలవల్ల విడిపోయినా ఆ స్నేహం అలాగే స్వచ్ఛంగా కొనసాగుతూ వస్తోంది. మెడిసన్ పూర్తవగానే తమ హాస్పిటల్‌లో చేరమని పవన్, కృష్ణప్రసాద్ ఇద్దరూ అడిగారు. కానీ ఎందువల్లనో నీహారిక ఒప్పుకోలేదు. తర్వాతెప్పుడో కలిసినప్పుడు అమృతలో జాయిన్ అయ్యానని చెప్పింది. రెండు ఆస్పత్రులమధ్య పరోక్షంగా యుద్ధం నడుస్తోందని తెలిసి కూడా నా స్నేహితురాలివి అయివుండి అక్కడెందుకు చేరావు? అని అడగకపోవడం పవన్ సంస్కారానికి నిదర్శనం. ఎందుకంటే పైకి భోళా మనిషిలా కన్పించినా లోపల చాలా తెలివైందని కారణం లేకుండా ఆమె ఏ పనీ చేయదని పవన్‌కు బాగా తెలుసు. అందుకే అప్పటి నుంచీ ఎప్పుడైనా కలిస్తే ఏదో లోకాభిరామాయణం తప్పితే వృత్తిజోలికి వెళ్లరు.

"పవన్! నేను చెప్పానే తన్మయి అని తనే. డాక్టర్ తన్మయి" అని తన్మయి వైపు తిరిగి "నా ఫ్రెండ్ పవన్. డాక్టర్ కృష్ణప్రసాద్‌గారి అబ్బాయి" అంది.

"నమస్తే..." అంది తన్మయి.

పవన్ కూడా ప్రతి నమస్కారం చేశాడు.

అదేదో తెచ్చి పెట్టుకున్న మర్యాదలా ఉంది తప్ప మనస్ఫూర్తిగా ఆమె విష్ చేయలేకపోయింది.

"అదిసరే ఏమిటా థ్రిల్లింగ్ న్యూస్?" అడిగింది నీహారిక.

"మొదట కాఫీ తీసుకురా! తర్వాత చెప్తాను" ఆర్డర్ జారీ చేశాడతను.

"సరే! మీరు మాట్లాడుతూ ఉండండి. నేనిప్పుడే వస్తాను" అని లోపలికి వెళ్లింది నీహారిక.

గడ్డం కింద చేయి ఆన్చి ఆ గదిలో మరో మనిషి ఉన్నారన్న ధ్యాస కూడా లేకుండా దీర్ఘాలోచనలో మునిగిపోయిన తన్మయి వంక చూస్తుండిపోయాడు పవన్.

అతను స్వతహాగా భావుకుడు. దానికి తోడు హాబీగా తెలుగు సాహిత్యం చదివా

డేమో ఈ ప్రకృతిలో అందమైనదేది కన్పిం చినా ఆశువుగా ఓ కవిత చెప్పేస్తుంటాడు. ఆవిధంగా చదువుకునే రోజుల్లో ప్రతి అమ్మాయి మీద ఓ కవిత అల్లేవాడు. కాని డాక్టరయ్యాక ఆస్పత్రి రోగుల మధ్య గడిపే జీవితంలో రసాస్వాదనకు సమయమె క్కడ?

తన్మయిని చూస్తుంటే ఏ కవి కలానికి అందని అందం దాగుందా అని అన్పించసా గింది అతనికి. అసలు ఆమె అందమంతా ఆ కనులలోనే ఉందా? అనే సందేహం కూడా కలిగింది.

ఎందుకంటే... ఆ కన్నులు ఒక్కోసారి కలువలను పోలినట్టు... అటునిటు కదిలే తుమ్మెదలను పోలినట్టు... చెంగు చెంగున దూకే హరిణులను పోలినట్టు... చిరు మీనా లను పోలినట్టు... చంద్రకిరణాలను పోలి నట్టు అన్పించింది అతనికి.

డాన్స్ నేర్చుకుని వుంటే ఆ కళ్లల్లో అద్భుత భావాలు పలికేవికదా! అని అనుకు న్నాడతను.

"ఏమిటిలా ఇద్దరూ బొమ్మల్లా కూర్చుండి పోయారు" కాఫీ కప్పులు చెరొకటి అందిస్తూ అడిగింది నీహారిక.

తన్మయి చిన్నగా నవ్వి ఊరుకుంది. ఆ నవ్వులో దిగులు, అసహాయత వ్యక్తమవుతు న్నాయి. ముఖ్యంగా ఆ నవ్వులో జీవం లేదు.

"అది సరే పవన్! ఇప్పుడు చెప్పు ఆ థ్రిల్లింగ్ న్యూసేమిటో? "

నీహారిక అడగగానే ముఖంలో ఉద్వేగం పొంగులా వచ్చింది. ఆ సంఘటన తల్చు కుంటుంటే అతడెంత థ్రిల్లవుతున్నాడో అన డానికి అంతకన్నా ఉదాహరణ ఏం కావాలి?

"నీకు దేవిశ్రీ తెలుసుగా? "

విస్తుపోతూనే నీహారిక "ఆ తెలుసు" అంది.

"ఈమధ్య ఆవిడ మా హాస్పిటల్‌కు వచ్చారు"

అప్పటికి గానీ పవన్ ఎక్సైట్‌మెంట్‌కు కారణం అర్థం కాలేదు నీహారికకు.

చిన్నప్పటినుంచీ పవన్‌కు దేవిశ్రీ అంటే ఎంత అభిమానమో నీహారికకు తెలుసు.

"పోనీ అభిమాన నటి దర్శన భాగ్యం కలి గిందన్నమాట" నవ్వుతూ అడిగింది నీహా రిక.

"అవును"

"ఇంతకీ ఎందుకొచ్చినట్టు? "

పవన్ సమాధానం చెప్పకపోవడంతో "అంత రహస్యం అయితే చెప్పద్దులే" నిష్ఠూ రంగా అంది నీహారిక.

"అబ్బేబ్బే అదేంలేదు" తడబడ్డాడతను.

తన్మయి కూడా తన బాధను మర్చిపోయి కుతూహలంగా వినసాగింది.

"ఏముంది... సినిమారంగంలో తరచుగా జరిగేదే. గ్లామర్ ఉన్నంతకాలం సినీ సామ్రాజ్యాన్ని ఏలింది. పెళ్లి పిల్లలు లాంటి జంజాటంలోపడితే గ్లామర్ దెబ్బతింటుం దేమో ప్రేక్షకులు ఆదరించరేమోనని భయ పడి పెళ్లి చేసుకోలేదు. ఇప్పుడు నలభై పైబ డ్డాయి. పెళ్లైతే అయ్యిందిగాని పిల్లల దగ్గర సమస్య వచ్చింది. ఆవిడకు పిల్లలు పుట్టే అవకాశం చాలాచాలా తక్కువ. అసలు లేదని చెప్పచ్చు కానీ తల్లి కావాలనే కోరిక బలంగా ఉంది. నాకేదైనా పరిష్కారం చూపండి అంటూ వచ్చింది. డాడీతో మాట్లాడి ఫోన్ చేస్తాను అని చెప్పాను. నిజంగా ఆవిడ పిల్లల కోసం పడే తపన చూస్తుంటే చాలా జాలేస్తుంది"

"అదేమంత కష్టం కాదండీ" ఠక్కున అంది తన్మయి.

అతనొచ్చి దాదాపు గంట కావస్తోంది. ఈ గంటసేపటిలో ఆమె అతనితో మాట్లాడిన మొదటి మాట అదే.

"వాడ్డూయూ మీన్"

"ఎస్ మిస్టర్ పవన్! ఐ మీన్ వాట్ ఐ సెడ్.. ఈమధ్య అమెరికాలోని లాస్‌ఏంజి

ల్స్‌కు చెందిన వైద్యనిపుణులు ఇలాంటి ప్రయోగం ఒకటి చేశారు. దాని ద్వారా ప్రయత్నిస్తే ఏ స్త్రీ అయినా వయసుతో నిమిత్తం లేకుండా తల్లి కావచ్చు" అంటూ ఆ పద్ధతిని వివరించింది తన్మయి.

తన్మయి వంక అబ్బురంగా చూస్తుండిపోయాడు పవన్.

ఆమె చెప్పిన దాని గురించి అతను కూడా చదివి వున్నాడు. అయితే సమయానికి గుర్తురాలేదు. మనకు తెలిసిన విషయాన్ని సరైన సమయంలో ఇంప్లిమెంట్ చేయడం మీద కూడా ఒక వ్యక్తి సక్సెస్ ఆధారపడి వుంటుంది. అది ఒక్క అంకిత భావంతోనే సాధ్యమవుతుంది.

"అయితే మీరు.... మీరామె కలలను సాకారం చేయగలరా? " ఒక రకమైన ఉద్వేగంతో అడిగాడతను.

తన్మయి వెంటనే సమాధానం చెప్పలేదు. మౌనంగా ఉండిపోయింది.

ఇలా అడిగి ఆమె మనసు నొప్పించానా? తొందరపడి అడిగేశానా? అని మథనపడ్డాడు అతను.

ఏదో తెలిసిన విషయమే కాబట్టి ఉత్సాహంగా మాట్లాడింది తప్ప మళ్లీ ఆమె మనసును దిగులు మేఘం కమ్ముకుంది. రేపు బామ్మకు ఎలా ఆపరేషన్ చేయించాలా అన్న దిగులు క్షణక్షణానికి కొండలా పెరిగిపోతోంది. ఈ సమయంలో ఎవరికైనా ఎలాంటి వాగ్దానాలు చేయగలుగుతుంది?

"తన్మయిగారూ! నేనేదైనా పొరపాటుగా మాట్లాడానా? " అడిగాడు పవన్.

"అయ్యయ్యో అదేంలేదండీ" అంది తన్మయి నొచ్చుకుంటున్నట్లు.

అంతకన్నా ఏం మాట్లాడాలో ఆమెకు అర్థంకాలేదు. అసలు విషయం చెప్పేందుకు ఆమె మనసు అంగీకరించలేదు.

అప్పుడు కల్పించుకుంది నీహారిక.

"అదికాదు పవన్ అసలు విషయం ఏంటంటే... తన్మయి కూడా మా అమృతా లోనే పని చేస్తోంది. పి.జి.డి. ప్రయోగం గురించి అమృత రీసెర్చి ల్యాబ్‌లో అధ్యయనం చేస్తోంది. కాని మా ఛీఫ్ డాక్టర్‌తో అభిప్రాయభేదాలు వచ్చిన కారణంగా కొంచెం క్లిష్ట పరిస్థితి ఎదురైంది. తన్మయి బామ్మగారికి రేపటిలోగా బైపాస్ సర్జరీ జరగాలి. లేకపోతే ఆవిడ... సరే ఆ డబ్బేదో నేను ఏర్పాటు చేస్తాను అంటే వినటంలేదు. నాకు ఉద్యోగం ఎప్పుడొస్తుందో తెలీదు. అంత అప్పు నేనెలా తీర్చగలను? అంటోంది. నువ్వేమైనా మీ డాడీతో మాట్లాడి తనకు సహాయం చేస్తావేమోనని పిలిపించాను" అసలు విషయం చెప్పుకొచ్చింది నీహారిక.

ఒక్కక్షణం రెప్పవాల్చకుండా తన్మయి వంక చూశాడు పవన్. ఈ అమ్మాయిలో ఇంత పట్టుదలవుందా అన్న సంశయమది.

అంతే ఒక నిర్ణయానికి వచ్చిన వాడిలా టీపాయిమీద ఉంచిన సెల్‌ఫోన్ చేతిలోకి తీసుకుని హాల్లోకి నడిచాడు. ఎవరికో ఫోన్ చేసి మాట్లాడాడు. దాదాపు పది నిముషాల తర్వాత తిరిగి వాళ్లున్న గదిలోకి వచ్చాడు. ఇప్పుడతని ముఖం ఆనందంతో వెలిగిపోతోంది.

"వాట్ పవన్! నీ మీద ఎన్నో ఆశలు పెట్టుకుంటే సమాధానమేమీ చెప్పకుండా అలా వెళ్లిపోయావేంటి? " నిలదీస్తున్నట్టుగా అడిగింది నీహారిక.

పవన్ ఏమంటాడోనని చాలా టెన్షన్ పడుతోంది ఆమె.

"నీకు తెలుసుగా పవన్ చేతలవ్యక్తే గాని మాటల వ్యక్తి కాదని.." అతని స్వరంలో ఉత్సాహం ఉరకలు వేస్తోంది.

అర్థం కానట్టు చూసింది నీహారిక.

"మిస్ తన్మయి! మీకు మా సురక్ష రీసెర్చి సెంటర్‌లో జాయిన్ కావడానికి ఏమైనా అభ్యంతరముందా? " చాలా మంద్రస్థాయిలో అభిమానం ఉట్టిపడుతున్న స్వరంతో అడిగాడు పవన్.




పవన్ అడుగుతున్నదేమిటో మొదట తన్మయికి అర్థంకాలేదు. అర్థం చేసుకోడానికి కొంచెం ఎక్కువ సమయమే పట్టింది.

"మీరు చెప్పేది"

"నిజమే..." చిరునవ్వుతో తల పంకించాడు పవన్.

"థాంక్యూ పవన్" మనస్ఫూర్తిగా అంది నీహారిక.

మనసులో పెల్లుబికుతున్న ఆనందాన్ని కంట్రోలు చేసుకోవడం తన్మయికి సాధ్యంకా లేదు.

ఆ క్షణంలో డాక్టర్ పవన్ ఆమెకు భగవంతుడిలా కనబడ్డాడు.

ఆ తర్వాత జరగాల్సిన పనులన్నీ చకచకా జరిగిపోయాయి.

నీహారిక ఇంటినుంచే ఫోన్ చేసి డాక్టర్ మణితో మాట్లాడింది తన్మయి. మొదట ఆయనకు ఆ విషయం మింగుడు పడలేదు. కానీ తన్మయిని ఆపేందుకు మరో మార్గమేమీ కన్పించకపోవడంతో ఆమెను రిలీవ్ చేసేందుకు కావాల్సిన ఫార్మాలిటీస్ పూర్తి చేయమని చెప్పాడు.

ఈలోగా పవన్ సురక్ష నుంచి అంబులెన్స్ పిలిపించాడు.

పవన్ కారులో అమృత ముందు వెయిట్ చేస్తుండగా తన్మయి, నీహారికలిద్దరూ లోపలికి వెళ్లారు. అవసరమైన ఫార్మాలిటీస్ అన్నీ పూర్తి చేశారు.

తన రిజిగ్నేషన్ లెటర్, క్యాబిన్ కీస్, తాను ప్రిపేర్ చేసుకున్న నోట్సు అన్నీ డ్యూటీ డాక్టర్‌కు అప్పజెప్పింది. జీరాక్స్ కాపీ మాత్రం తన దగ్గర ఉంచుకుంది.

నీహారిక బామ్మగారిని సురక్ష అంబులెన్స్ లోకి ఎక్కించింది.

ఈ తతంగం అంతా పూర్తయ్యేసరికి రాత్రి పదకొండు గంటలయ్యింది.

తన్మయికి ఎందుకో ఎప్పుడూ లేనంత ధైర్యంగా ప్రశాంతంగా అన్పించసాగింది. ఇద్దరు మంచి మిత్రులు తనకు తోడుగా ఉన్నారన్న సంతృప్తిలోంచి వచ్చిన ధైర్యం, ప్రశాంతతలవి.

నిజానికి మనిషి కష్టంలో ఉన్నప్పుడు కేవలం ఓదార్చితే సరిపోదు. ఆ కష్టం ఎదుర్కోగల ధైర్యం కూడా ఇవ్వగలిగితేనే ఆ ఓదార్పుకు అర్థం ఉంటుంది. లేదంటే అది నిరుపయోగమే. ఒక్కోసారి ఆ ఓదార్పే మనిషిని నిర్వీర్యుడినైనా చేయచ్చు



డాక్టర్ జయరామ్ ఈలోకాన్ని విడిచిపోయి దాదాపు పదిహేను రోజులు కావస్తోంది. ఈపాటికి అతని కుటుంబసభ్యులు కొంచెం కోలుకుని ఉండచ్చన్పించింది నీహారికకు. ఎందుకంటే కాలం ఎలాంటి గాయాన్నైనా మాన్పుతుందంటారుకదా! అయితే ఈసారి మాత్రం కీర్తన ఇంటికి వెళ్లడంగానీ తాను వస్తున్నట్టుగా ఆమెకు తెలియజేయడంకాని నీహారిక చేయదలుచుకోలేదు.

బెంగుళూరులో దిగగానే మొదట ఆమె చేసిన పని అమృతకు ఫోన్ చేయడం. డాక్టర్ జయరామ్ లేడు కాబట్టి ఇప్పుడైనా అతని వివరాలు చెప్తారనుకుందామె. అయితే ఆమె ఊహ నిజంకాలేదు.

డాక్టర్ జయరామ్‌గారి అడ్రస్ అడగగానే "సారీ మేడమ్! వాళ్ల అడ్రస్ ఎవ్వరికీ ఇవ్వ

ద్దని చెప్పారు" అని రిసెప్షనిస్ట్ ఫోన్ పెట్టేసింది. అక్కడికీ ఆశ చావక రెండుమూడు సార్లు ప్రయత్నించింది. అయినా అదేజ వాబు... ఆయన ఫ్యామిలీ మెంబర్స్‌కు ఇష్టంలేదు. తమ అడ్రస్ ఎవ్వరికీ ఇవ్వద్దన్నారు.

ఇక లాభంలేక పోలీస్‌స్టేషన్‌కు వెళ్లడానికి నిర్ణయించుకుంది. అక్కడకు వెళ్లడంలో ఓ ఇబ్బంది ఉంది. ఒకవేళ మణి ఎవరినైనా అబ్జర్వేషన్‌కు పెడితే వాళ్లు తన గురించి చెప్తే తను చిక్కుల్లో పడాల్సి వస్తుంది. శ్రీధర్‌ను కదిపితే తన పేరు తెలిసిపోతుంది. తనకు కూడా జయరామ్‌కు పట్టిన గతే పడుతుంది. అదే జరిగితే మణి ఆగడాలను అడ్డగించేవారెవ్వరూ ఉండరు. తనకు తెలిసిన నిజం తనతో సమాధి కాకూడదంటే తను అప్పుడే చావకూడదు. బతికే ఉండాలి. మరి జయరాం అడ్రస్ తెలిసేదెలా?

హఠాత్తుగా ఆమెకు డాక్టర్ పవన్ గుర్తుకు వచ్చాడు. చదువుకునే రోజుల్లో ఎన్నో స్టేజి నాటకాలాడినవాడు కాబట్టి ఈ సమస్యను అతడే పరిష్కరించగలడు.

అంతే వెంటనే పవన్‌కు ఫోన్ చేసి తానెక్కడ ఉందో చెప్పి వెంటనే రమ్మని చెప్పింది నీహారిక.

ఎందుకు? ఏమిటి? అని అడగకుండానే వెంటనే బయలుదేరుతున్నట్టు చెప్పాడు పవన్.

పవన్ వచ్చేదాకా ఆమెకేం పనిలేదు కాబట్టి హాయిగా ఫ్రెషప్ అయి భోంచేసి నిద్రపోయింది. ఆ పడుకోవడం పవన్ వచ్చి బెల్ కొడితే కానీ మెలకువరాలేదు.

"ఏమిటి నీహా! ఎందుకలా వెంటనే బయలుదేరి రమ్మన్నావు? " ఆశ్చర్యంగా అడిగాడు పవన్.

"చెప్తానుకానీ ముందు రిలాక్స్ అవ్వు" అంటూ ఇంటర్‌కమ్‌లో కాఫీ టిఫిన్ పంపమని చెప్పింది.

ఆ తర్వాత ఓ అయిదు నిముషాలపాటు ఎవరి ఆలోచనలో వారు ఉండిపోయారు.

ఎక్కడినుంచి మొదలుపెట్టాలో ఆమెకు అర్థంకాలేదు. తననెందుకంత అర్జెంటుగా పిలిపించిందా అని పవన్ ఆలోచనలో పడ్డాడు. చివరకు ఓ నిర్ణయానికి వచ్చిన దానిలా అంది "పవన్! నాకో చిన్న సహాయం చేయాలి నువ్వు"

"ఈ మాట ఇప్పటికి ఓ పాతికసార్లు అన్నావుగానీ విషయమేంటో చెప్పు"

అతని స్వరంలో ఏమాత్రం విసుగులేదు. కృతజ్ఞతగా చూసింది నీహారిక.

డాక్టర్ జయరామ్ స్టేట్‌మెంట్ పేపర్లో వచ్చిన దగ్గరినుంచీ జరిగినదంతా వివరంగా చెప్పింది నీహారిక. అప్పటిగ్గానీ ఆమె మనసు తేలికపడలేదు.

అంతా విని పవన్ నిర్విణ్ణుడయ్యాడు. ఏం మాట్లాడాలో అతనికి అర్థంకాలేదు. చాలాసేపటి తర్వాత అడిగాడు "ఇప్పుడు నేనేం చేయాలి? "

తాను చెప్పిందంతా విన్నాక అతనేమీ ప్రశ్నించకపోవడం ఆమెకు సంతృప్తినిచ్చింది.

"డాక్టర్ జయరాం ఇంటి అడ్రస్ కావాలి. ఎలాగో అలా నువ్వుసంపాదించి ఇస్తే చాలు" మనసులో మాట చెప్పిందామె.

"ఓకే డన్... నీకు కావాల్సిన అడ్రస్ ఓ గంటా లేదా గంటన్నర్లో తెచ్చిస్తాను" సోఫాలోంచి లేస్తూ అన్నాడు పవన్.

"నిజమా? " విభ్రమంగా అడిగింది నీహారిక.

"అవును" అంటూ కదిలాడు పవన్.

అయితే అతననుకున్నంత తేలికగా జయరామ్ అడ్రస్ దొరకలేదు. దాదాపు మూడు గంటలు కష్టపడాల్సి వచ్చింది.

పనైతే చెప్పిందిగానీ జయరామ్ అడ్రస్ దొరుకుతుందన్న నమ్మకం కలగలేదు ఆమెకు. దానికితోడు ఎంతకీ పవన్ రాకపోవడం ఆమెకు చాలా ఆందోళన కలిగిం




చింది. అక్కడికీ సెల్ ఫోన్ ట్రై చేసింది. కాని ఎన్నిసార్లు చేసినా అదే సమాధానం స్విచ్ ఆఫ్ చేశారు. లేదా అవుటాఫ్ ది కాలింగ్ ఏరియా అని.

చివరకు రాత్రి పదిదాటుతుండగా వచ్చా డతను. ఆ ముఖంలో అలసట ఉన్నా అదో రకమైన సంతృప్తి, సంతోషం కనిపించాయి.

"ఏంటి పవన్! ఇంతసేపు ఎక్కడు న్నావ్? ఏం చేస్తున్నావ్? నేనెంత ఖంగారు పడ్తున్నానో తెలుసా? "

"రిలాక్స్ నీహా! నాకేం కాలేదు. నేను బాగానే వున్నాను. అయినా నువ్వు చెప్పిన పనేమైనా సామాన్యమైనదా? ఇలా వెళ్లి అలా వచ్చేయడానికి? "

"సర్లే... ముందు మంచినీళ్లు తాగు" అంటూ గ్లాస్ అందించింది.

పవన్‌ని చూశాక అతను క్షేమంగా ఉన్నా డని అర్థమయ్యాక ఆమె మనసు కుదుటప డింది.

"ఇప్పుడు చెప్పు వెళ్లినపని ఏమైందో? " కుతూహలంగా అడిగింది నీహారిక.

ఓ కాగితం ఆమె చేతిలో పెట్టి "ఇదిగో నువ్వు అడిగిన అడ్రస్" అన్నాడు పవన్.

గబగబ కాగితం మడతలు విప్పి చదువు తుంటే ఆమె కళ్లు ఆశ్చర్యంతోను, ఆనందం తోను పెద్దవయ్యాయి. ఎన్నో రోజులుగా తనకు సాధ్యంకానిది, ఇంత తక్కువ సమ యంలో పవన్ ఎలా సంపాదించగలి గాడు?

అదే ప్రశ్న అడిగింది అతన్ని.

"నీహా! అన్ని పనులు న్యాయబద్ధంగానే చేయాలంటే కుదరదు. ఇదీ అంతే" క్లుప్తంగా చెప్పాడు పవన్.

"థాంక్స్ పవన్! నువ్వు చేసింది మామూలు సహాయంకాదు. నీకెన్ని సార్లు కృతజ్ఞతలు చెప్పినా అది తక్కువే అవు తుంది. కానీ కుతూహలంకొద్దీ అడుగుతు న్నాను చెప్పు. జయరామ్ అడ్రస్ నీకెలా దొరికింది" ఎన్నత ప్రయత్నించినా ఆ గొంతులో ఒకరకమైన ఉద్వేగం మాత్రం వ్యక్తమవుతూనే వుంది.

"చెప్తాను! కాని నీహా! ఈ అడ్రస్ సేకరిం చమని చెప్పింది నువ్వని తెలిస్తే మాత్రం చాలా ప్రమాదంలో పడతావు. ఎందుకో తెలీదు జయరామ్ అడ్రస్ కాదుకదా కనీసం అతని పేరు ఎత్తడానికి కూడా అమృతాలో ఎవ్వరూ నోరెత్తడంలేదు. వాళ్లని ఎంత ప్రాధేయపడ్డా అక్కడ ఫలితం లేకపో యింది. దాంతో పోలీస్ స్టేషన్‌కు వెళ్లి ప్రయత్నించాను. ప్రయోజనం లేకపో యింది. ఇక చివరగా చిన్న నాటక మాడక తప్పలేదు"

"నాటకమా? " విస్తుపోయింది నీహారిక.

"నీకు తెలుసుగా నేను, నా ఫ్రెండ్స్ మంచి నటులమని. ఈ ఊర్లో ఓ మిత్రుడు ఉన్నాడు. వాడితో పోలీసు వేషం వేయిం చాను. జయరామ్‌కు యాక్సిడెంట్ జరిగిన ప్పుడు చేర్చిన ఆస్పత్రికి తీస్కెళ్లాను. వాడ సలే కోతి. పావులాకు అర్థరూపాయి యాక్షన్ చేసేరకం. వాళ్లనెలా అదరగొ ట్టాడో తెలీదుకాని వాళ్ల దగ్గర అడ్రస్ సంపాదించి తీసుకువచ్చాడు"

నీహారిక అలా స్థబ్దుగా కూర్చుండిపో యింది. పవన్ చెప్పినట్టు అన్నివేళలా న్యాయబద్ధంగానో, చట్టబద్ధంగానో ప్రవర్తిస్తే పనులు జరగవేమో? అదికూడా కాదు ఆమె ఆలోచిస్తున్నది. భవిష్యత్తులో తను ఇలాంటి పనులు ఇంకెన్ని చేయాల్సి వస్తుందో అని అనుకుంటోంది.

★ ★ ★

కొన్ని సంఘటనలు లేదా మనుషులు ఒక్కోసారి ఎలాంటి వ్యక్తినయినా పూర్తిగా మార్చేయగలవనడానికి ఉదాహరణ డాక్టర్ తన్మయి.

సురక్షలో జాయిన్ అయినప్పటినుంచి ఆమె జీవితం పూర్తిగా మారిపోయింది. అమృతలోలాగా ఖచ్చితంగా టైముకు రావాలి. ఏ రోజు ఏం చేశారో రిపోర్ట్

చేయాలి లాంటివన్నీ ఇక్కడలేవు. నిజానికి వేలకు వేలు జీతాలు ఇస్తున్నప్పుడు ఆ మాత్రం అడగడంలో తప్పులేదు. కానీ పరిశోధకులు కూడా కళాకారుల్లాంటివారే. వారినలా స్కూలు పిల్లల్లాగానో, జైల్లో ఖైదీల్లాగానో ట్రీట్ చేస్తే వారి పనితీరు దెబ్బతింటుంది. ఆ మాట మణికి చెప్పాలని తన్మయి చాలాసార్లు అనుకుంది. కానీ ఆయన ఎదురుగా మాట్లాడే ధైర్యం లేదు. ఆ రోజంటే ఒకరకమైన తెగింపుతో అలా మాట్లాడిందే తప్ప నిజానికి తన్మయి గొంతెత్తి బిగ్గరగా ఎప్పుడూ అరవదు.

ఒక్కోసారి తెల్లారి నాలుగు, అయిదింటి దాకా ల్యాబ్‌లోనే ఉండేది. అయినా సరే ఉదయం పది గంటలకల్లా డ్యూటీకి హాజరవ్వాల్సిందే అనేవాడు మణి. అలా చేయకపోతే వార్నింగ్‌లు, మెమోలు.. పోనీ డ్యూటీకి వెడితే కళ్లు నిద్రమత్తుతో కూరుకుపోయేవి.

అందుకే అక్కడుండగా తనను ఓ పంజరంలో పెట్టి బంధించినట్టుగా విలవిల్లాడిన తన్మయికి ఇక్కడ స్వేచ్ఛా విహంగమైనట్టుగా అన్పించేది. మిగతా స్టాఫ్ అంతా ఎంతో స్నేహంగా మసులు కోవడం కూడా ఆమెకు నచ్చింది. ఇక డాక్టర్ కృష్ణ ప్రసాద్... పని విషయంలో ఎంత ఖచ్చితంగా ఉంటాడో మిగతా సమయాల్లో అంతటి వాత్సల్యం చూపుతాడు.

అంతా బానే ఉంది కాని అసలు సమస్య పవన్‌నుంచి ఎదురయ్యింది ఆమెకు. మొదటి చూపులోనే ఆమె అతన్ని ఆకర్షించింది. అప్పటినుంచి ఏమాత్రం ఖాళీ దొరికినా కవిత్వం పేరుతో ఆమెని విసిగిస్తుంటాడు.

"చిరుసిగ్గునేనైతే
ఆ గులాబీ చెక్కిళ్లలో పూసివుందు
కస్తూరి తిలకం నేనైతే
నీ నుదుటనే, కొలువుందు...
నీ కంటి కాటుకరేఖ నేనైతే
కన్నులను అంటిపెట్టుకుని వుందు"
అంటాడు.

ఇదివరకు వర్క్ మూలంగా బామ్మతో సరిగా మాట్లాడటం, ఆవిడను ఎక్కడికైనా తీసుకువెళ్లడం కానీ కుదిరేదికాదు తన్మయికి. ఆవిడను ఎక్కడికైనా తీసుకెళ్తే బాగుండునన్పించేది. టైము ఉండేదికాదు. అయితే పవన్ ఆమె స్థానాన్ని భర్తీ చేశాడు.

బామ్మగారు కూడా ఆపరేషన్ తర్వాత తొందరగానే కోలుకున్నారు. మొదట్లో అప్పుడప్పుడు వచ్చి చూసేవాడు. కానీ నోరారా 'అమ్మమ్మగారూ' అని పిలవడం మొదలెట్టాక ఇద్దరిమధ్యా అనుబంధం బలీయమైంది. పైగా అతను తమ కుటుంబానికి చేసిన సాయం గురించి తెలుసుకున్నాక ఆ వాత్సల్యం రెట్టింపయ్యింది.

తన్మయి దేవిశ్రీ కేసును టేకప్ చేయడానికి అంగీకరించాక ఆ విషయాన్ని ఆవిడకు తెలియజేసి ఏ రోజు ఆస్పత్రికి రావాలో కూడా చెప్పాడు పవన్.

అంతకన్నా ముందే తన్మయి దేవిశ్రీకి ఇవ్వాల్సిన ట్రీట్‌మెంట్ గురించి కూలంకషంగా అధ్యయనం చేసింది.

దేవిశ్రీ వచ్చాక రిసెప్షనిస్ట్ ఫోన్ చేసి తన్మయికి విషయం చెప్పింది.

తన్మయిని చూస్తుంటే కృష్ణప్రసాద్‌కు ఎంతో ముచ్చటేస్తుంది. ఆ వయసువారు సినిమాలు, నగలు, చీరలు లేదా అబ్బాయిల గురించి మాట్లాడటం ఆయనకు తెలుసు. అలాంటిది వృత్తిపట్ల అంతటి అంకితభావం చూపడం చూస్తుంటే ఆయన ఎంతో అపురూపంగా అన్పిస్తుంటుంది. ఈమెను కోల్పోయి అమృతా క్లినిక్ చాలా నష్టపోయిందనే భావనకూడా అప్పుడప్పుడూ కలుగుతుంటుంది.

దేవిశ్రీ ఈసారి భర్తతో కలిసి వచ్చింది.

అప్పటిదాకా ఏదో కాలక్షేపంగా మాట్లాడుకుంటున్నవారు తన్మయిని చూడగానే





మాటలు ఆపేశారు.

"రామ్మా! నీకోసమే ఎదురు చూస్తున్నాం" అన్నారు కృష్ణప్రసాద్.

తన్మయి కూర్చున్నాక "ఈవిడే దేవిశ్రీ గారు!" అని ఆవిడవైపు తిరిగి "మీ డాక్టర్... తన్మయి" అని ఒకరికొకరిని పరి చయం చేశారు.

"ఇంత చిన్నపిల్లా... తన ప్రాబ్లమ్ సాల్వ్ చేయబోతున్నది" అన్నట్టు తన్మయి వంక ఆశ్చర్యంగా చూసింది దేవిశ్రీ.

తన్మయి ఏం చెప్తుందా అని అందరూ ఆత్రుతగా చూస్తున్నారు.

"దేవిశ్రీగారూ! మీ గురించి డాక్టర్ పవన్ అంతా వివరంగా చెప్పారు. మీ సహకారం ఉంటే మీ సమస్యను పరిష్కరించటం పెద్ద కష్టమేం కాదు. అసలీ ప్రక్రియ గురించి వివరించేముందు మీకు కొన్ని విషయాలు చెప్పాలి. అందులో ముఖ్యమైనదేంటంటే ఇలాంటి ప్రయోగాలకు సిద్ధమయ్యేవారికి చాలా ధైర్యం కావాలి. ఎందుకంటే దీనిగు రించి రేపు బయట ఎవర్నికైనా తెలిస్తే వారి విమర్శలు, వెక్కిరింతలు ఎదుర్కోవాలంటే మీకు ధైర్యం చాలా అవసరం. పోతే ఇన్ విట్రో అనగానే ఒక ఇంజెక్షన్ చేయించుకో వడమేకదా! అని అనుకుంటారు చాలా మంది. అది తప్పు. ఇందులో ఎన్నో సాధ కబాధకాలు ఉంటాయి. ముఖ్యంగా ఇక్కడ మనం చేయబోయే ప్రయోగం కేవలం ఒక్కసారితోనే విజయవంతం అవుతుందని చెప్పలేం. ఒకవేళ అయితే అందరం అదృ ష్టవంతులమే. కాకపోతే మీరు పదేపదే ఆసుపత్రికి రావాల్సి ఉంటుంది. ఇందుకు ఎంతో ఓర్పు, మీ భర్తనుంచి సహకారం కావాలి. అలాగే మీరు చేయబోయేది మీకు పూర్తిగా సమ్మతమేనా? కృత్రిమ గర్భధా రణ అనే భయం, చింత, తేలికభావం ఇలాంటివేమైనా ఉన్నాయా? ఆలోచించు కోండి. అలాంటివేమైనా ఉంటే దీనిని గురించి మరిచిపోండి"

అంతవరకు తన్మయి మాటలు జాగ్రత్తగా వింటున్న దేవిశ్రీ చివరి మాటకు ఉలిక్కిపడింది. తన కంగారు, ఉలికిపాటు దాచుకో వడానికి ప్రయత్నిస్తూ అంది "లేదు డాక్టర్! మీరీ విషయంలో ఎలాంటి అనుమానాలు పెట్టుకోవద్దు. నేను అన్నింటికి సిద్ధపడే వచ్చాను. ఇందులో నాకెలాంటి భయాలు లేవు. ఈ ప్రయోగానికి కావలసిన సహాయ సహకారాలు నేను, నా భర్త మీకందించ డంలో ఎలాంటి లోపమూ ఉండదు. ఈ ప్రయోగం ఫలించి నేను తల్లిని కాగలిగితే నా జీవితం ఫలించినట్టే" రెండు చేతులు జోడించి చెప్తున్న ఆమెని చూస్తుంటే మిగి లినవారికి బాధ కలిగింది.

"ఓకే మేడమ్! మీరు మా మీద సంపూ ర్ణంగా విశ్వాసం ఉంచారు. అంతకన్నా ఓ డాక్టరుకు కావాల్సిందేముంది? సరే! ఇప్పుడు అసలు విషయానికి వద్దాం. మేము చేయబోయే ఈ ప్రయోగం ద్వారా మీకు కలిగే బిడ్డకు ఇద్దరు తల్లులు ఉంటారు"

తన్మయి మాటలకు దేవిశ్రీ ఆందోళనగా చూసింది. కాని తన్మయి దాన్ని పట్టించుకో కుండా చెప్పుకుపోసాగింది. "ఇన్‌విట్రో ఫెర్టి లైజేషన్ ద్వారా సృష్టించే ఈ శిశువుకు ఇద్దరు తల్లులు ఉంటారు. అంటే ఈ విధా నంవల్ల ఒక బిడ్డకు జన్యుపరంగా ఇద్దరు తల్లులుంటారన్నమాట. ఈ పద్ధతిద్వారా తల్లికావడానికి ఇకనుంచి వయసుతో నిమి త్తంలేదు. ముఖ్యంగా నలభై సంవత్సరాలు పైబడిన స్త్రీలకు ఇది ఒక వరం అని చెప్పచ్చు. అసలీ ప్రయోగం ఎలా జరుగు తుందో మొదట చెప్తాను. ఈ విధానంలో మొదట యవ్వనంలో ఉన్న స్త్రీ నుండి అండాలను సేకరిస్తారు. ఈ సేకరించిన అండకణం నుంచి పోషక పదార్థాలతో కూడిన సైటోప్లాజమ్‌ను తీసుకుంటారు. ఆ తర్వాత సంతానం కావాలనుకుంటున్న స్త్రీనుంచి కూడా అండాన్ని తీసుకుని యవ్వ



నవతి అండంలోంచి తీసిన సైటోప్లాజమ్‌ను ఈ అండంలోకి ఇంజెక్ట్ చేస్తారు. అంటే యుక్తవయసులో ఉన్న స్త్రీ నుంచి సంతానవతి కావాలనుకుంటున్న స్త్రీనుంచి కూడా అండాలను తీసుకుని మరో అండాన్ని సృష్టిస్తారన్నమాట. ఇలా చేయడంవల్ల గర్భాశయంలో పిండాభివృద్ధికి ఎలాంటి ఆటంకాలు, ఇబ్బందులు కలగవు. ఇలా ఇద్దరు స్త్రీల అండాలు మిళితం చేసి సృష్టించిన అండాన్ని సంతానం కావాలనుకుంటున్న స్త్రీయొక్క భర్త తాలూకు వీర్యకణాలతో ఫలదీకరణ చెందిస్తారు. అనంతరం స్త్రీ శరీరంలో ప్రవేశ పెడతారు. దీనివల్ల జన్యుపరంగా ఇద్దరు తల్లుల పోలికలతో శిశువు పుట్టే అవకాశం ఉంది. అయితే యవ్వనవతికి చెందిన అండంలోని సైటోప్లాజమ్ ద్వారా శిశువుకు అదనంగా జన్యుపరమైన పదార్థం లభిస్తుంది. అంటే సంతానం కావాలనుకుంటున్న స్త్రీ మీరు, మీ భర్త స్పెర్మ్ డొనేట్ చేస్తారు. పోతే మరో స్త్రీ అది కూడా యవ్వనవతి అయిన స్త్రీ లభిస్తే మనం ప్రయోగం ఆరంభించచ్చు"

తాను చెప్పాల్సింది పూర్తి చేసి రిలాక్స్‌గా ఫీలయ్యింది తన్మయి.

తన్మయి వంక అభినందన పూర్వకంగా చూశారు డాక్టర్ కృష్ణప్రసాద్. ఇక పవన్ కళ్లల్లో అయితే ఆరాధన కన్పించింది. ఈ నూతన ప్రక్రియ గురించి వారిద్దరూ కూడా చదివే వున్నారుకాని ఇన్ని వివరాలు వారికీ తెలియవు.

దాదాపు అయిదు నిముషాల మౌనం తర్వాత "నాకు కొన్ని సందేహాలున్నాయి" అంది దేవిశ్రీ.

"అడగండమ్మా... మీకు మనసులో ఎలాంటి సందేహాలు, అనుమానాలు ఉండకూడదనే ఇంత వివరంగా చర్చిస్తున్నాం. ఏం సంకోచపడకండి" ధైర్యం చెప్పారు కృష్ణప్రసాద్.





"మీరు చెప్పిన ప్రకారం తన అండాన్ని డొనేట్ చేయడానికి ఏ అమ్మాయి మాత్రం ఒప్పుకుంటుంది? మన సంస్కృతి, సంప్రదాయాల మీద గౌరవం వున్న వారెవ్వరూ దీనికి అంగీకరించరుకదా!" ఆ గొంతులో అసంతృప్తితో కూడిన బాధ ధ్వనించింది.

నిజమేనన్నట్లు తలవూపింది తన్మయి.

"మీ బాధ అర్థం చేసుకోతగినదే" అనునయంగా చెప్పింది. "పాశ్చాత్య దేశాలలోలాగా దీనిని మనవారు సైన్స్‌గానో, టెక్నాలజీగానో భావించలేరు. మీరన్నట్టు మన సంస్కృతి, సంప్రదాయాలు మననలా ఆలోచించనీయవు. అయితే మీరంటే అభిమానం ఉన్నవారెవరైనా ఈ పనికి అంగీకరిస్తారని నా అభిప్రాయం. కాకపోతే ప్రయత్నం చేయాలంతే" అని మళ్లీ.

"ఇక్కడ మరో విషయం కూడా ఉంది. నా ఉద్దేశ్యమేమంటే బయట వ్యక్తులుకన్నా దగ్గరి సంబంధీకులలో ఎవరైనా అయితే బాగుంటుందేమో? ఆలోచించండి. మీ బంధువులలో మీరంటే అభిమానం ఉన్నవారిని పిలిచి వివరంగా మాట్లాడండి. ఫలితం ఉంటుందనే అనుకుంటున్నాను. ఒకవేళ ఎవ్వరూ ముందుకు రాకపోతే ప్రత్యామ్నాయం ఆలోచిద్దాం" నచ్చచెప్పే ధోరణిలో ఉంది కృష్ణప్రసాద్ స్వరం.

ఈమాట విన్నాక దేవిశ్రీ ముఖంలో ఓ వింతకాంతి తళుక్కుమంది.

"అయితే మా అక్క కూతురు ఉంది" ఉద్వేగంతో మాట తడబడింది. ఒక్కక్షణంలో సర్దుకుని తర్వాత కొనసాగించింది. "మా అక్క కూతురికి నేనంటే చాలా అభిమానం. వయసు కూడా తక్కువే. ఇరవై రెండేళ్లు అంతే. వారి ప్రేమ వివాహానికి పెద్దవాళ్లు అభ్యంతరం చెప్పేసరికి నేనే పూనుకుని ఇరువైపులా నచ్చజెప్పి వారిద్దరిని ఒకటి చేశానన్న అభిమానం, కృతజ్ఞత ఆ అబ్బాయికీ ఉంది. మీ రుణం తీర్చుకోలేమండీ! అని ఇద్దరూ అంటుంటారు. నేను అడిగితే తను కాదనదు. ఆ అమ్మాయి

అయితే ఏమైనా అభ్యంతరమా? "

దేవిశ్రీ ప్రశ్నకు అక్కడెవరూ సమాధానం చెప్పలేదు. దాంతో తన్మయే అంది.. "ఆమె మీ అక్క కూతురు కావడమే అభ్యంతరం"

"అంటే? "

తన్మయి చెప్పిందేమిటో అర్థం కానట్టుగా ఉందా ప్రశ్న. ఆ అడగడంలో అసహనం, చికాకు వ్యక్తమయ్యాయి.

దేవిశ్రీ భావాలు అర్థం చేసుకున్నట్టు తలాడించి అభిమానం వుట్టిపడుతున్న స్వరంతో అంది తన్మయి. "దేవిశ్రీగారూ! మన భారతీయుల సెంటిమెంట్స్ గురించి మీకు తెలియనిదేముంది? ఒక్కనిముషం లాజికల్‌గా ఆలోచించండి. మనం చేయ బోయే ఈ ప్రయోగం ప్రకారం పుట్టబోయే బిడ్డకు ఇద్దరు తల్లులుంటారు. వ్యవహారి కంగా కాకపోయినా జన్యుపరంగా దీనిని మనం కాదనలేం. మీ అక్క కూతురికి మీరు పిన్ని అవుతారు. అంటే తల్లితో సమానమన్నమాట. ఆ లెక్కన మీవారు తండ్రి సమానులు అవుతారు మరి" అంటూ ఆగిపోయింది.

అర్థమయినట్టుగా తలూపింది దేవిశ్రీ.

ఆమెకాదు అక్కడ మిగతా వారెవ్వరూ కూడా ఆ కోణంలోంచి ఆలోచించలేదు.

అంతవరకు మౌనంగా వారి సంభాషణ వింటున్న పవన్ "మీకు ఆ వయసు చెల్లెళ్లు ఎవ్వరూ లేరా? " అని అడిగాడు.

ఏం చేయాలో అర్థంకాక విచారంగా కూర్చున్న దేవిశ్రీ ఆ ప్రశ్న వినబడగానే సంబరంతో తలెత్తింది. మళ్లీ ఆమెలో ఆశలు చిగురించాయి. "మా చివరి చెల్లెలు ఉంది. పేరు సృజన. నేను అడిగితే కాద నదు" అంది.

అప్పటిదాకా అందరినీ వేధించిన సమస్య మబ్బుతెరలు వీడిపోవడంతో అందరి ముఖాలలో రిలీఫ్‌తో కూడిన ప్రశాంతత, సంతోషం కన్పించాయి.

"మరింకేం.. ? అడిగిచూడండి" అంది తన్మయి.

★ ★ ★

రాజమండ్రిలో రైలుదిగి కొవ్వూరు వెళ్లే బస్ ఎక్కింది నీహారిక.

డాక్టర్ జయరామ్ చనిపోయాక అతని కుటుంబం స్వగ్రామం వెళ్ళిపోయారు. ఇప్పుడు నీహారిక వెళ్ళేది అక్కడికే.

జయరామ్ మరణం గురించి లేదా పేప ర్‌లో అతనిచ్చిన స్టేట్‌మెంట్ గురించి వాళ్ళేమైనా చెప్తారేమోనన్న చిన్న ఆశ ఆమెతో ఈ రిస్క్ చేయిస్తోంది. నిజానికి ఈ ప్రయాణంవల్ల పెద్దగా ప్రయోజనం ఉండదని ఆమెకు తెలుసు. అయినా ఏదో అద్భుతం జరగకపోదులెమ్మని మనసును బుజ్జగిస్తోంది.

కొవ్వూరులో బస్ దిగేసరికి ఆకాశం మేఘావృతమైంది. ఈ క్షణానో, మరుక్ష ణానో వర్షం వచ్చే సూచనలు కన్పించాయి. ధైర్యంచేసి వూరయితే వచ్చింది. కానీ ఎటు వెళ్ళాలో ఆమెకేమీ తెలీలేదు.

తనతోపాటు బస్ దిగిన కుర్రాడిని పిలిచి, "బాబూ! ఈ అడ్రస్ కొంచెం చెప్తావా? " అని అడిగింది.

కాగితం తీసుకున్న ఆ అబ్బాయి ముఖంలో రంగులు మారిపోయాయి. మని షెందుకో ఖంగారు పడసాగాడు.

"చెప్పమ్మా! నీకు వీళ్ళు తెలుసా? " గబ గబ అడిగేసింది నీహారిక.

ఒక్కసారి ఆమె ముఖంలోకి సూటిగా చూస్తూ, భృకుటి ముడిచి అన్నాడు. "వీళ్ళతో మీకేం పని? వాళ్ళకు మీరేమవు తారు? మీరొస్తున్నట్టు వాళ్ళకు తెలుసా? "

ఆ ప్రశ్నల వెనుక కుతూహలం ఉంది. అనుమానం ఉంది. నిలదీస్తున్న ధోరణీ ఉంది.

ఆ కుర్రాడివైపు పరిశీలనగా చూసింది నీహారిక.

అతనికి మహా అయితే ఏ పద్నాలుగో, పదిహేనేళ్లో ఉంటాయి. అయితే ఆ



వయసు కుర్రాళ్లలో సాధారణంగా కన్పిం చని విషాదం లీలగా ఆ కళ్లల్లో కన్పి స్తోంది. ముఖ్యంగా ఆ కనుముక్కుతీరు చూస్తుంటే అతన్నెక్కడో చూసినట్టు అన్పిం చసాగింది. ఏవో జ్ఞాపకాలు మనసు అట్ట డుగుపొరల్లో కదులుతున్నాయి.

నీహారిక తనను పరీక్షగా చూస్తుండేసరికి ఆ అబ్బాయి ఠక్కున తలవంచుకున్నాడు. బిడియంతోనో లేక తనను ఆమె గుర్తుపడు తుందన్న భయమో!

"ఆc గుర్తొచ్చింది... నువ్వు నువ్వు జయ రామ్ తమ్ముడవు అయివుంటావుకదూ! జయరామ్ బ్రదర్‌వేగా! గుర్తొచ్చింది. మీ ఇద్దరికీ చాలా పోలిక ఉంది. అసలు ఇద్దర్నీ పక్కపక్కన నిలబెడితే కవలల్లా ఉంటారు. ఆరోజు మీ అన్నయ్య యాక్సి డెంట్ అయి రోడ్డుమీద పడివుంటే నేనే ఆస్పత్రిలో చేర్పించాను. అప్పుడు చూశాను. నీవి అవే పోలికలు... చెప్పు మీ ఇల్లెక్కడో చెప్పు..." ఒకరకమైన ఎక్సైట్‌మెంట్‌తో అడిగింది నీహారిక.

అప్పటిదాకా అతని ముఖంలో కన్పించిన అనుమానం, విసుగు కోపం స్థానాన కృత జ్ఞత, గౌరవం చోటుచేసుకున్నాయి.

"థాంక్సండీ! మా అన్నయ్య రోడ్డుమీద దిక్కులేని చావు చావకుండా మానవ త్వంతో ఆస్పత్రిలో చేర్చారు" అతని స్వరం గద్గదమైంది. కన్నీరు బుగ్గలమీంచి జారిపో తుంటే తుడుచుకునే ప్రయత్నమేమీ చేయ కుండా చేతులు జోడించాడు.

'హమ్మయ్య! తాను సాధించింది' అని ఆనందపడింది. తాను సాధించాల్సిన దానితో పోలిస్తే ఇది చాలా చిన్న విజయం. అయితే మాత్రమేం ఇదే భవి ష్యత్ విజయాలకు పునాది అవుతుంది. అయితే ఆ చిన్నకుర్రాడు పడే వేదన చూస్తుంటే ఆమెకు చాలా బాధగా ఉంది.

"చూడు బాబూ! పోయిన మీ అన్నయ్యను ఎవ్వరూ తెచ్చివ్వలేరు. అది మీకు జీవి తాంతం లోటేకానీ ప్రయత్నిస్తే మరికొంత మంది అమాయకులు ఆ దుర్మార్గుల చేతిలో ప్రాణాలు పోగొట్టుకోకుండా మనం వారిని కాపాడచ్చు"

ఒక్కసారిగా అతని ముఖంలోకి వెలుగు వచ్చింది.

"మేడమ్... అంటే... మీరు... అన్నయ్యా..."

అతని భావం అర్థమైనట్టుగా తలూపింది నీహారిక.

ఒక్కసారి అటు ఇటు చూసి, "మేడమ్! మీరెవరో తెలీక పొరబడ్డాను. మనం ఇక్కడ మాట్లాడుకుంటే చాలామందికి అను మానం వస్తుంది. నేను ముందు నడుస్తుం టాను. మీరు నా వెనకేరండి. ఎవరైనా అడిగితే మలేరియా డిపార్ట్‌మెంట్‌నుంచి వస్తున్నామని చెప్పండి. వాళ్ళు అప్పుడ ప్పుడు ఇలా వస్తుంటారు కాబట్టి ఎవ్వరికీ అనుమానం రాదు..." గబగబ చెప్పి అడు గులు వేయసాగాడు అతను.

నీహారిక అతని వేగాన్ని అందుకోవడం కష్టంగానే వున్నా తప్పలేదు. అందులోనూ వున్నట్టుండి సన్నగా తుంపర మొదలవ డంతో వర్షం పెరగకముందే ఇంటికి వెళ్ళి పోవాలనే ఆత్రుతవల్ల అతని నడక వేగం మరింత పెరిగింది.

దాదాపు పావుగంట తర్వాత ఓ పెంకు టింట్లోకి దారి తీశాడతను. నీహారిక కూడా అతన్ని అనుసరించింది.

లోపలికి వెళ్ళాలో, లేదో అర్థంకాక అలాగే వరండాలో నిలబడిపోయింది.

అంతలో అతను హడావుడిగా బయటకు వచ్చి, "ఇక్కడే నిలబడ్డారేంటి? లోపలికి రండి..." అన్నాడు.

అప్పటికే ఈ వార్త అందరికీ చెప్పినట్లు న్నాడు. వాళ్ళంతా హాల్లో నిలబడ్డారు.

"మేడమ్! వీరే మా అమ్మగారు! ఈమె మా వదిన. మా నాన్నగారు బయటకు వెళ్ళారు. ఈ అమ్మాయి మా అక్క. వచ్చే




నెలలో పెళ్లి జరగాల్సివుంది. కాని ఇప్పుడు..." దుఃఖంతో మాట పూడుకుపోయింది.

ఆ అమ్మాయి కూడా నోటికి పైటచెంగు అడ్డుపెట్టుకుని బాధను ఆపుకునేందుకు ప్రయత్నిస్తూ లోపలికి పరిగెత్తింది.

"అమ్మా! అన్నయ్యను ఆస్పత్రిలో చేర్చింది ఆవిడే ఈవిడ..." పేరు తెలీక ఆగిపోయి నీహారిక వంక చూశాడు.

"నీహారిక..." అంది నమస్కారం చేస్తూ.

"వెయ్యేళ్ళు చల్లగా ఉండమ్మా..." అంటూ భోరుమంది ఆవిడ.

"నువ్వలా బాధపడకమ్మా. అన్నయ్య చావుకు కారణమైన వారిని ఊరికే వదలను. వాళ్ళమీద తప్పకుండా పగతీర్చుకుంటాను" అతని ముఖం కోపంతో అరుణిమను దాల్చింది. దవడ కండరం బిగుసుకుంది.

"నోర్మూసుకుని లోపలికి అఘోరించు. వేలెడంతలేదు. పగతీర్చుకుంటాడట పగ... ఇదిగో ఈ వాగుడు వాగబట్టే ఓసారి వాళ్ళెవరి చేతిలోనో తన్నులు తిన్నావు. ఎప్పుడు ఏం ఉపద్రవం తెస్తావోనని భయపడుతూ ఎక్కడో ఈ మూల బతకాల్సివస్తోంది" ఆ అబ్బాయి తల్లి మాటలు నీహారికలో అనుమానం కల్గించాయి.

"చూడు బాబూ... ఇంతకీ నీ పేరేంటో చెప్పనేలేదు" అడిగింది నీహారిక.

"అభిరామ్..." చెప్పాడతను. తల్లి మాటలకు ఆ ముఖం చిన్నపోయింది.

"అభిరామ్! నువ్వు చాలా చిన్నవాడివి. దయచేసి ఇలాంటి వ్యవహారాల్లో తలదూర్చకు. నీమీద కూడా హత్యాప్రయత్నం జరిగిందంటే...! వాళ్ళెంతటి దుర్మార్గులో అర్థం అవుతోందికదా. నిజానికి 'అమృత పాలీక్లినిక్'లో పనిచేసే ఉద్యోగులందరికీ మీ అన్నయ్యది సహజమరణం కాదని తెలుసు. కాని ఒక్కరైనా మాట్లాడగలిగారా? పిరికితనం అవనీ, భయం అవనీ ఏదైనా కారణం కావచ్చు నిజానికి ప్రాణం తీసేంత తప్పు మీ అన్నయ్య ఏమీ చేయలేదు. కాని ఎవరైనా అనవసర విషయాలలో కల్పించుకుంటే వారికీ జయరామ్‌కు పట్టిన గతే పడుతుందని చెప్పడానికి అలా చేశారు. అసలు మీ అడ్రస్ కనుక్కోవడం ఎంత కష్టమైందో తెలుసా? అందుకని మీ అమ్మగారు చెప్పినట్టు విను. అసలే పుత్రశోకంతో బాధపడుతున్న ఆవిడను మరింత బాధపెట్టకు. కొన్నాళ్లపాటు ఏమీ జరగనట్టు ఉంటే క్రమంగా మీమీద నిఘా తగ్గిపోతుంది. అప్పుడు కూడా ఈ విషయాలలో తలదూర్చడానికి నీ వయసు, అనుభవం సరిపోవు. దేవుడనేవాడు వుంటే మీ అన్నయ్యను చంపించిన దుర్మార్గులకు తప్పక శిక్షపడుతుంది. ఆయన ఏ లోకంలో ఉన్నా మీ బాగు గురించే ఆరాటపడుతుంటారు కాబట్టి బాగా చదువుకో. చెదిరిపోయిన మనసుతో ఉన్న వీళ్ళకు నువ్వే అండగా నిలబడు" ఉద్వేగంతో చెప్పింది నీహారిక. ఒక్కపక్క నచ్చచెప్పుతున్నట్లుగాను, మరోపక్క మందలిస్తున్నట్టుగానూ ఉన్నాయామె మాటలు.

అభిరామ్‌కు అన్నయ్య గుర్తుకొచ్చాడు. అతను కూడా ఏదైనా చెప్పాల్సివస్తే కేకలేసినట్టుగాకాక బుజ్జగిస్తున్నట్టుగా చెప్పేవాడు.

"సారీ! అభి! ఎక్కువ చనువు తీసుకుంటే క్షమించు..."

"లేదు మేడమ్! మీరు చెప్పినట్టుగా ఇంకెప్పుడూ ఈ విషయాలలో కల్పించుకోను. కాకపోతే మీరెవరో తెలీదు. అయినా ఎన్నో వ్యయప్రయాసలకోర్చి మమ్మల్ని పలకరించడానికి వచ్చారు. మిమ్మల్ని చూస్తుంటే నాకెంతో ధైర్యం కలుగుతోంది. నాకు మరీ బాధగా అన్పిస్తే ఎప్పుడైనా వచ్చి మిమ్మల్ని కలవచ్చా? " ఆశగా అడిగాడు అభిరామ్.

"తప్పకుండా కలవచ్చు" పర్స్‌లోంచి తన ఐడెంటిటీకార్డ్ తీసిచ్చింది నీహారిక.

ఒక్కనిమిషం ఆ అడ్రస్‌వంక పరీక్షగా



చూసి తర్వాత ఆ కార్డ్ చింపేశాడు.

"అదేంటి? " విస్తుబోతూ అడిగింది నీహారిక.

"మామీద చాలా నిఘావుందని చెప్పానుగా మేడమ్! మీ కార్డ్ పొరపాటున ఎవరికంటనైనా పడితే చాలా ప్రమాదం. 'నువ్వు ఏకసంధా గ్రాహివిరా అబీ! నాకన్నా పెద్ద డాక్టరవుతావు' అనేవాడు అన్నయ్య. ఏదైనా ఒకసారి చూస్తే చాలు... అడ్రసైనా, ఫోన్ నెంబరయినా ఆఖరికి నాక్లాసు పాఠాలైనా అన్నీ నాకు అలా గుర్తుండిపోతాయి" నవ్వుతూ చెప్పినా ఆ నవ్వులో ఎంతటి వేదన దాగిఉందో నీహారికకు అర్థమైంది.

అంతలో గేటు తీసిన చప్పుడవడంతో అటు చూసి ఉలిక్కిపడ్డాడు అభిరామ్. "మేడమ్! మీ చెప్పులు, బ్యాగ్ తీసుకుని ముందు లోపలికి వెళ్ళండి. వదినా! నువ్వు కూడా" ఖంగారుపెట్టేశాడు వాళ్ళని.

ఎందుకో అర్థం కాకపోయినా వాళ్ళు లోపలికి వెళ్ళారు. అంతలో అక్కడి వాతావరణం మారిపోయింది. టేప్‌రికార్డ్ పెద్దగా పెట్టి డాన్స్ చేయసాగాడు అభిరామ్. లోపల గదిలోంచి చూస్తున్న నీహారికకు ఇదేమీ అర్థం కాలేదు.

ఆ వ్యక్తి లోపలికి వచ్చినా చూడనట్టే ఉండిపోయాడు అభిరామ్. ఆ వచ్చినతను చనువుగా వెళ్ళి టేప్ ఆఫ్ చేయడంతో పూనకం తగ్గినవాడిలా స్థిమితంగా నిలబడేందుకు ప్రయత్నించాడు అభిరామ్.

"హల్లో మిస్టర్ అబీ! ఎలా వున్నావ్? నీ చదువెలా సాగుతోంది? " ఎంతో పరిచయం ఉన్నవాడిలా ఆప్యాయంగా ప్రశ్నించాడా వ్యక్తి.

"హలో! మీరా రమేష్‌గారూ! సారీ చూడలేదు. ఎంతసేపైంది వచ్చి? ఆంటీ, పిల్లలు అంతా బాగున్నారా? " వినయవిధేయతలకు మారుపేరు అన్నట్టుగా ప్రవర్తిస్తున్నాడతను.

"బానేవున్నారు" అని ఇల్లంతా పరీక్షగా చూశాడు. "అవునూ ఎవరో వచ్చినట్టున్నారు" కూర్చున్న చోటునుంచి హఠాత్తుగా లేచి వంటింట్లోకి తొంగిచూశాడు

"ఎవ్వరూ రాలేదండీ! అయినా వస్తే మీకు చెప్పకుండా వుంటానా? " ఎలాంటి తొట్రుపాటు లేకుండా చెప్పాడు అభిరామ్.

"నిజమేనంటావా? " అపనమ్మకంగా అడిగాడు రమేష్. "అదీ ఎందుకంతగా అడుగుతున్నానంటే మీ అన్నయ్య నా ప్రాణస్నేహితుడు. అతని కుటుంబానికి ఎలాంటి కష్టం కలగకుండా చూడాల్సిన బాధ్యత నామీద ఉంది. అందుకే ఇలా అడుగుతున్నాను. మరోలా అనుకోకు" వంటింటి గుమ్మంవైపు చూస్తూనే మాట్లాడసాగాడు.

'ప్రాణమిత్రుడు!' కసిగా అనుకున్నాడు మనసులో. అలా అన్నందుకే తాను అతన్ని గుడ్డిగా నమ్మేసి అన్నయ్యది సహజమరణం కాదని, ఎవరో కావాలని ఏక్సిడెంట్ చేయించారని అనుమానంగా చెప్తే మరుసటిరోజు గుర్తుతెలీని వ్యక్తులు తనని కొట్టడం వారిలో ఒకడు 'ఇకచాలురా! అతన్ని చంపద్దని రమేష్‌బాబు చెప్పాడు. వీడికేదైనా అయితే తనమాట విననందుకు మన ప్రాణం తీస్తాడు' అనడం, స్పృహ తప్పుతున్న తనకు ఆ మాటలు వినిపించడం, రోడ్డుమీద ఎవరో కొడితే రమేష్ ఆస్పత్రిలో చేర్పాడని తల్లి చెప్పడం అన్నీ గుర్తుకువచ్చాయి. తల్లీ తండ్రీ మరీ బెదిరిపోతారనే ఎంత అడిగినా కొట్టినవాళ్ళ పేరు తను చెప్పలేదు. అప్పటినుంచీ ఏమి అడిగినా ఇంట్లో అందరినీ తెలీదని చెప్పమన్నాడు. అభిరామ్‌ని కొట్టించింది తనే అన్న సంగతి అభిరామ్‌కు తెలుసని రమేష్‌కు తెలీకపోవడంతో అతని ముందు ఇంకా గోముఖవ్యాఘ్రంలా నటిస్తూనేవున్నాడు.

"సరే మరి నేవస్తాను. అమ్మగారేదో దైవధ్యానంలో ఉన్నట్టున్నారు. ఏం ఇబ్బంది లేదుగా" వెళ్ళడానికి ఉద్యుక్తుడవుతూ





అన్నాడు రమేష్.

"అమ్మగారూ! మరి నేవెళ్ళిరానా? అంట్లవీ తోమి బోర్లించేశాను. రేపొద్దున పెందలకడనే వస్తాన్లెండి" లోపలినుంచి పనిమనిషి రమేష్‌ను చూస్తూ వెళ్ళిపోయింది.

"ఈమెను చూసి ఎవరో వచ్చారని అనుకున్నారేమో? " నవ్వాడు అభిరామ్. "అయినా మీరు మాపట్ల అంతటి ఆత్మీయత చూపుతున్నారు. ఎవరైనా వస్తే మీకు చెప్పకుండా ఎలా వుంటాం? అయినా మీకంత అనుమానంగా ఉంటే లోపల గదులన్నీ చూసుకోండి"

ఆ మాటకు లోపలున్న నీహారిక ఉలిక్కిపడింది.

"అబ్బే! అదేంలేదు. మీ జాగ్రత్తకోసమే నా తాపత్రయమంతా! మరి నేవస్తాను" అంటూ బయటకు నడిచాడు రమేష్. అతన్ని పంపించి వస్తానంటూ కూడా వెళ్ళాడు అభిరామ్.

అతను ఇంటికి వచ్చాక రమేష్ గురించి చెప్పాడు. తాను వచ్చి వీళ్ళకు సమస్యలు తెచ్చిపెట్టానుకదా అని నీహారిక బాధపడింది.

బయట వర్షం ఉధృతమైంది. ఇక ఆరోజుకు అక్కడ ఉండక తప్పలేదామెకు.

కుటుంబసభ్యులను ఎన్ని రకాలుగా ప్రశ్నించినా ఆశించిన సమాచారం ఆమెకు దొరకలేదు. ఏదో సాటిమనిషికి నాలుగు సానుభూతి మాటలు చెప్పగలిగానన్న తృప్తి ఒక్కటే మిగిలింది.

మిగతావారంతా ఎవరి పనుల్లో వారుండగా జయరామ్ కూతురు నీహారిక దగ్గరకు వచ్చింది.

"ఆంటీ! మీకు పడవలు చేయడం వచ్చా? " వచ్చీరానీ మాటలతో ముద్దుముద్దుగా అడిగింది.

"వచ్చమ్మా..."

"అయితే చేసిస్తావా? " బాగా నీళ్లల్లో నానిపోయిన పుస్తకం ఒకటి నీహారికకు ఇచ్చింది.

తండ్రి చనిపోవడం గురించి ఆ పాపకు తెలీదు. తెలిసినా చావంటే ఏమిటో అర్థం చేసుకునే వయసు కాదది.

పుస్తకం చేతిలోకి తీసుకుంది నీహారిక.

"ఈ కాగితాలతో పడవ చేయడం రాదమ్మా! వేరేవి తీసుకురా..."

అంతే ఆ పాప ఛెంగుమని పరిగెత్తింది.

యధాలాపంగా ఆ పుస్తకం తిరగేస్తున్న నీహారిక ఉలిక్కిపడింది.

"అమృతలో ఇంపొటెన్సీ కేసులు ఎక్కువ అవుతున్నాయి. కేవలం ఇక్కడేనా? లేక అన్ని హాస్పిటల్స్ తీరూ ఒకేలా ఉందా? అదే మా హెడ్‌ను అడిగాను. సమాధానం చెప్పలేదు. 'నీకు అనవసరమైన విషయాల్లో తలదూర్చకు' అన్నాడు. "పుస్తకం తడవడం వల్ల కాగితాలు అతుక్కుపోయి అక్కడక్కడా రాత అల్లుకుపోయినట్టుగా ఉన్నా మొత్తంమీద భావం మాత్రం అదే.

అది డైరీ కాదు. తాను ఎవరికీ చెప్పుకోలేని విషయాలను జయరామ్ ఓ నోటుపుస్తకంలో రాసుకున్నాడు. అయితే ఎప్పుడేది జరిగిందో తేదీలులాంటివి కూడా అతను వేయలేదు. ఎవ్వరూ చూడకూడదన్న ఖంగారులో గబగబ గీకేసినట్టుగా ఉందా రాత...

ఎవరో వస్తున్నట్టు అలికిడి అయ్యేసరికి పరుపు మడతల్లో పుస్తకం దాచేసింది.

అంతలో లోపలినుంచి కొన్ని కాగితాలు తీసుకువచ్చింది ఆ పాప. ఆ పాపను దగ్గరకు లాక్కుని, ముద్దుపెట్టుకుని, పర్స్‌లోంచి చాక్లెట్లు తీసిచ్చింది. అంతకన్నా తన కృతజ్ఞతలు ఎలా చెప్పాలో ఆమెకు అర్థంకాలేదు.

ఆ పుస్తకాన్ని భద్రంగా పర్సులో పెట్టుకుంది. కొన్ని పడవలు చేసి ఆ పాపకు ఇచ్చింది.

మిగతావారంతా పెద్దగా మాట్లాడలేదు

కానీ, అభిరామ్ మాత్రం రాత్రంతా మాట్లాడుతూనే వున్నాడు. దాంతో ఆ పుస్తకం చదవడం ఆమెకు కుదరలేదు. మనసంతా ఉద్వేగంతోను, టెన్షన్‌తోనూ నిండిపోయింది.

ఏ రాత్రో ఓ అరగంట నిద్రపోయింది. తెల్లారకుండానే లేచింది. అభిరామ్ చెప్పినట్టు తలకు నూనె బాగా రాసి, మధ్యపాపిడి తీసి, నడినెత్తిన కొప్పు పెట్టింది. నుదుట అర్ధరూపాయంత బొట్టు. ముతకచీరతో పల్లెటూరుదానిలా ఉంది. అందరికీ చెప్తే ఆలస్యమవుతుందని ఎవ్వరూ లేవకుండానే బస్టాండ్‌కు వచ్చింది. అభిరామ్ తోడు వస్తానన్నా రానివ్వలేదు. పుస్తకం విషయం చెప్దామా అని ఒక్కనిమిషం అన్పించినా అతన్ని మరీ బాధ పెట్టినట్టు అవుతుందని ఆ ప్రయత్నాన్ని విరమించుకుంది. హైదరాబాద్ వస్తే తప్పకుండా ఇంటికి రమ్మని మరీ మరీ చెప్పింది.

అంత పొద్దున్నే వెడుతోంది ఎవరా? అని ఒకరిద్దరికి అనుమానం వచ్చినా నీహారిక పల్లెటూరు వేషధారణతో ఉండటంవల్ల ఎవ్వరూ పెద్దగా పట్టించుకోలేదు. వచ్చేప్పుడు తన సెల్‌ఫోన్ అభిరామ్‌కు ఇచ్చి, ఎవరికీ చెప్పవద్దని అప్పుడప్పుడూ ఫోన్‌చేసి మాట్లాడుతుండమని చెప్పింది నీహారిక.

అభిరామ్ ఇంటికి ఎవరో వచ్చారని సందేహపడిన రమేష్ వర్షంవల్ల ఇంటి దగ్గర కాపలా పెట్టలేకపోయాడు. అక్కడికే పొద్దున్నే వచ్చి 'అభీ! అభీ!' అని తలుపు కొట్టి పిలిచాడు. అప్పటికే నీహారిక వెళ్ళిపోవడంతో అభిరామ్ లేచి తలుపు తీయలేదు. జయరామ్ తల్లి తలుపు తీసినా ఆమె నడిగే ధైర్యం చేయలేక వెళ్ళిపోయాడతను. ఆ తర్వాత గంటకోసారి ఆ ఇంటికి వెడుతూనే ఉన్నా అతనికి అక్కడెవరూ కన్పించలేదు.



దేవిశ్రీ చెప్పింది విని ఇంట్లోవాళ్ళు నిర్ఘాంతపోయారు. ఆ విషయం వాళ్ళకెవరికీ మింగుడు పడలేదు.

ఆమె సంపాదిస్తుంటే హాయిగా అంతవరకూ కాలక్షేపం చేస్తున్నవారు ఆమె హఠాత్తుగా పెళ్ళి చేసుకోవడంతో బెంబేలుపడిపోయారు. 'ఈ వయసులో దీనికప్పుడు పెళ్ళి కావాల్సివచ్చిందా?' అంటూ మనసులో తిట్టుకున్నా పైకి మాత్రం ఎంతో ఆనందం వ్యక్తం చేశారు.

అదివరకులా డబ్బుమీద అజమాయిషీ పోవడంతో జల్సాకు అలవాటు పడ్డ జీవితాలు ఒడ్డునపడ్డ చేపల్లా గిలగిల్లాడసాగాయి. వాళ్ళు అడిగినంత ఇవ్వకపోగా, ఇక ఎవరిదారి వాళ్ళని చూసుకోమని చూచాయగా చెప్పింది దేవిశ్రీ.

నోరెత్తితే ఇంట్లోంచి పొమ్మంటుందేమోనని ఆమె అన్నా, వదినలు దేవిశ్రీ మాటలకు తాళంవేస్తూ ఎంతో విధేయతగా ఉండసాగారు. ఆమెకు పిల్లలు పుట్టకపోవడం వాళ్ళపాలిట వరమైంది. దాంతో లేని ప్రేమలు, ఆప్యాయతలు ఒలకబోస్తూ, ఎవరికి వారు తమ పిల్లల్లో ఎవరో ఒకరిని దత్తత తీసుకోమని అడగడం మొదలెట్టారు.

దేవిశ్రీ ఎప్పుడైతే తన్మయి చెప్పింది ఇంట్లో వాళ్ళకు చెప్పిందో వాళ్ళ ఆశలన్నీ అడియాశలైపోయాయి. ఇలాంటివి మన ఇంటా వంటా లేవు. అని తల్లి దగ్గరినుంచీ అందరూ మందలించారు. చివరకు ఆమెకు పిచ్చెక్కిందన్న నిర్ణయానికి వచ్చేశారు.

తన బాధతోకాని, ఆనందంతోకాని తన వాళ్ళకు సంబంధంలేదనీ వాళ్లకి కావాల్సింది తన డబ్బు మాత్రమేనన్న నిజం ఆమెకు ఎప్పుడో అర్థమైంది. ఇప్పుడది రూఢీ అయ్యిందంతే.

దేవిశ్రీ ఎవరేం చెప్పినా విన్పించుకోలేదు. చెల్లెలి దగ్గరకు వెళ్ళడానికే సిద్ధమైంది. ఆమెకి తన చిన్న చెల్లి తన మాట వింటుందని, తన ఆశ అడియాశ కాదని అన్పించసాగింది.





ఆ అమ్మాయి పేరు సృజన. ఇండియాలో ఎం.సి.ఏ. చేసింది. ఇక్కడ కంపెనీవారే స్టేట్స్ పంపారు. అలా అమెరికాలో ఉద్యోగం వచ్చింది. నిజానికి ఆ అమ్మాయికి ఉద్యోగం చేయాల్సిన అవసరం లేదు. ఆ మాట దేవిశ్రీ ఎన్నోసార్లు చెప్పింది. అయితే స్వశక్తితో సంపాదించుకుంటే ఎంత ఆనందం ఉంటుందో అక్కను చూసి తెలుసుకున్న సృజన అదేమాట చెప్పి అక్కను ఒప్పించింది.

అక్క అంటే చెల్లెలికి చాలా ఇష్టం. ఒక్క ఇష్టమే కాదు. అభిమానం, ప్రేమ, గౌరవం, కృతజ్ఞత అన్నీను. తమ కుటుంబం కోసం అక్క ఎంత కష్టపడిందో, ఎన్ని ఆనందాలకు దూరమయ్యిందో సృజనకు తెలుసు.

దేవిశ్రీ ప్రయాణం గురించి ఆమెకి తల్లి, అక్కయ్యలు, వదినలు అందరూ ఫోన్‌చేసి చెప్పారు. ససేమిరా అక్క చెప్పినదానికి అంగీకరించొద్దన్నారు. అవుననీ కాదనీ వాళ్ళకేం సమాధానమివ్వలేదు. కాని అప్పటికే ఆమె ఓ నిర్ణయానికి వచ్చింది.

సృజనకు విషయం ఎలా చెప్పాలా అని సందేహిస్తుంటే ఆమె చొరవ తీసుకుని తనకన్ని విషయాలు తెలుసునంటూ తన నిర్ణయం తెలియజేసింది. తన కళ్ళముందు పుట్టి, మానవత్వం రూపుదిద్దుకున్నట్టుగా అంతగా ఎదిగిపోయిన చెల్లెల్ని ఎలా అభినందించాలో దేవిశ్రీకి అర్థంకాలేదు.

అక్కచెల్లెళ్ళు ఇద్దరూ ఇండియాకు బయలుదేరారు.

★ ★ ★

అప్పటివరకూ ఎలాగో అలా ఆత్రుతను అణుచుకుంది. కాని ఇంటికి చేరాక మాత్రం ఒక్కక్షణం కూడా ఆగలేకపోయింది నీహారిక.

కూతురి వేషధారణ చూసి తల్లి అవాక్కయింది. ఏదో అడిగినా ఆ మాట విననట్టే తన గదిలోకి నడిచింది. తలుపు వేసేసుకుని బ్యాగ్‌లోంచి పుస్తకం తీసింది. అక్షరాల వెంట ఆమె చూపులు పరిగెత్తాయి.

"నేను చెప్పింది విని హెడ్ కేకలేసినా నాలో కుతూహలం తగ్గలేదు. ఓసారి ఐ.వి.ఎఫ్. ఇన్‌ఛార్జ్‌ని కలిస్తే? అంతే వెంటనే వెళ్ళాను. ఆయన చాలా పెద్దవాడు. పేరు శాస్త్రి. వయసు యాభైపైనే ఉంటుంది. నా అనుమానాలన్నీ ఆయన ముందుంచాను. 'ఏం జీవితంమీద ఆశ పోయిందా? ఇవన్నీ అడుగుతున్నావు' అన్నారు. అణగదొక్కేకొద్దీ ఆవేశం, కుతూహలం రెండూ అంతకంతకూ పెరుగుతాయంటారు. నా విషయంలోనూ అదే జరిగింది"

మరో పేజీలో ఇలా వుంది.

'నాకీ విషయం గురించి ఎవరు చెప్తారు? ఆస్పత్రిలో ఉన్నా, ఇంట్లో ఉన్నా ఇదే నన్ను వేధించసాగింది. ఆరోజు ఆస్పత్రిలో ఉండగా బయట గలాభా విన్పించింది. ఏంటో చూద్దామని వెళ్లాను. ఎవరో ఒకవ్యక్తి డిప్రెషన్‌లో అరుస్తున్నాడు. అతను మాట్లాడేది ఏదీ నాకు అర్థం కాలేదు. కానీ ఈ ఆస్పత్రిలో ఏదో మోసం జరుగుతోందని మాత్రం రూఢీగా అన్పించింది.

'ఈరోజు ఈశ్వర్ మిత్రా ఆస్పత్రిలో నన్ను కలిశాడు. వాడిలో స్పెర్మ్ కౌంట్ చాలా తక్కువగా ఉందనీ, మందులు, ఇంజెక్షన్లూ వాడమని చెప్పారట. వాడు చెప్పింది విని నిర్ఘాంతపోయాను. ఎలా ఓదార్చాలో నాకు అర్థంకాలేదు'

నీహారికలో చదువుతున్నకొద్దీ ఆత్రుత ఎక్కువ అవసాగింది. కానీ నీళ్లలో పుస్తకం తడవడంవల్ల వేగంగా చదవడం కుదరటం లేదు.

'నేను ఎలాగైనా ఈ పద్మవ్యూహాన్ని ఛేదించాలి. అందుకే శాస్త్రిగారు లేని సమయం చూసి ఐ.వి.ఎఫ్. విభాగానికి వెళ్ళి వివేక్‌ను మాటల్లో పెట్టాను. అతనూ నాలాగే జూనియర్ డాక్టర్. ఉత్సాహంకొద్దీ

ఐ.వి.ఎఫ్.కు వచ్చే కేసుల్లో మగవారిలోనే లోపం ఉంటోందని చెప్పాడు. అంతకు మించి వివరాలు అతనికీ తెలీవుట. అంటే కేసులన్నీ మిత్రా కేసుల్లాంటివేనన్నమాట. ఇది కల్పితమా? కాకతాళీయమా?"

"మరుసటిరోజు మా హెడ్ కారిడార్లో ఎదురైతే ఈ విషయం గురించి మాట్లాడాను. ఆయన నా మాటలు విని విభ్రాంతి చెందాడు. లోపలికి రమ్మని క్యాబిన్‌లోకి తీసుకువెళ్ళాడు. ఇదంతా నీకెలా తెలుసు? అని అడిగాడు. ఎక్కడిదక్కడ మర్చిపోక పోతే ప్రాణాలు పోగొట్టుకోవాల్సివస్తుంది అన్నాడు. నేనేం మాట్లాడలేదు"

"ఈరోజు పేపర్లో వార్త వచ్చింది. మేం కారిడార్లో మాట్లాడుకుంటుండగా ఎవరో విన్నట్టున్నారు. ఆసుపత్రిలో బాగా గొడవైంది"

ఇక అక్కడినుంచీ పేపర్లన్నీ ఖాళీగానే ఉన్నాయి. మధ్యలో ఒకచోట మాత్రం "నన్ను చంపేస్తామని బెదిరిస్తున్నారు. నేను చచ్చిపోతానేమో?" అని రాసుకున్నాడు.

నిజానికి ఆ పుస్తకంలో పెద్ద సమాచారం ఏమి లేదుకానీ అమృత పాలీక్లినిక్ ఐ.వి.ఎఫ్. విభాగంలో ఏదో జరుగుతోందన్నది మాత్రం వాస్తవం. అదేమిటి? దాన్నెలా ఛేదించాలి అనే ఆలోచనలో పడింది నీహారిక. కేవలం కుతూహలంవల్ల జయరామ్ ప్రాణాలు కోల్పోవడం ఆమెకు చాలా బాధనిపించింది.

★ ★ ★

ఇండియా రాగానే సృజనను వెంటపెట్టుకుని దేవిశ్రీ సురక్ష హాస్పిటల్‌కు వెళ్లింది. తానప్పుడే తల్లి అయినట్లుగా సంబరపడిపోతోందామె.

సృజనను మనస్ఫూర్తిగా అభినందించింది తన్మయి.

"చూడమ్మా సృజనా! నీ ఫీలింగ్స్‌ని నేను అర్థం చేసుకోగలను. నీ మనసులో ఇప్పుడే మనుకుంటున్నావో నేను ఊహించగలను. ఈ ప్రయోగానికి సంబంధించిన వివరాలేవీ పత్రికలో రావు. అందుకు నేను పూర్తిగా హామీ ఇస్తున్నాను. ఓ డాక్టరుగా, ఈ ఆస్పత్రి చీఫ్‌గా నా పేషెంట్స్ గౌరవమర్యాదలు కాపాడాల్సిన నైతికబాధ్యత నా మీద ఉంది. ఈ విషయంలో మీరు నిశ్చింతగా ఉండచ్చు. ఈ మొత్తం ప్రయోగం ఎంతో రహస్యంగా జరుపబడుతుంది" ఆత్మీయంగా ధైర్యం చెప్పారు డాక్టర్ కృష్ణప్రసాద్.

ఆయన మాటలకు సృజనకన్నా తన్మయి ఎక్కువగా ఆనందపడింది. ఇదంతా పేపర్లో వస్తే రేపు సృజన భవిష్యత్తు దెబ్బతింటుందని భయపడిందామె. అయితే కృష్ణప్రసాద్ మాటలు ఆమెకు ఊరటనిచ్చాయి.



సృష్టికి ప్రతి సృష్టి జరుపుతున్నట్టుగా కష్టపడసాగింది తన్మయి.

సృజన, దేవిశ్రీలను పేషెంట్లులాక సొంత మనుష్యులుగా ట్రీట్ చేయసాగింది.

ఇద్దరి అండాలను తీసుకుంది.

సృజన అండకణంనుంచి పోషకపదార్థాలతో కూడిన సైటోప్లాజమ్‌ను తీసుకుని దేవిశ్రీనుంచి సేకరించిన అండకణంలోకి ఇంజెక్ట్ చేసింది. తర్వాత దేవిశ్రీ భర్త

తాలూకు వీర్యకణాలతో ఫలదీకరణ జరిపింది.

ఆ పిండాలను ఇంక్యుబేటర్‌లో ఉంచింది.

మూడు రోజుల తర్వాత వాటిలో ఒక పిండాన్ని దేవిశ్రీ గర్భాశయంలో ప్రవేశపెట్టాలి. అక్కడితో రెండో అంకం పూర్తవుతుంది.

అప్పటికి రెండు రోజులు గడిచాయి. మరొక్క రోజు గడిస్తే చాలు అనుకుంటూ పెట్రిడిష్‌లో ఉన్న పిండాల వంక ఆప్యాయంగా చూసి, దానిని ఇంక్యుబేటర్‌లో యధాతథంగా ఉంచిందామె.

అంతవరకు అంతా సవ్యంగానే జరిగినా, ఏదో తెలీని టెన్షన్‌వల్ల ఆ రాత్రి ఆమెకు నిద్రపట్టలేదు.

తెల్లవారగానే టిఫిన్ కూడా చేయకుండా హాస్పిటల్‌కు పరుగుతీసింది. ఆమె అంత పొద్దున్నే రావడం చూసి, ఆస్పత్రి స్టాఫ్ ఆశ్చర్యపోయారు. కాని ఆమె అవేమి పట్టించుకునే స్థితిలో లేదు.

వేగంగా ల్యాబ్‌వైపుకు నడిచింది.

ఇంక్యుబేటర్ తెరుస్తుంటే ఆమె చేతులు సన్నగా కంపించసాగాయి.

నుదురంతా స్వేదం అలముకుంది.

ఆమె గుండె చప్పుడు రెట్టింపు అయ్యింది.

పెట్రిడిష్‌ను చేతిలోకి తీసుకుని, పిండాలను స్లైడ్స్‌మీదకు బదిలీచేసి మైక్రోస్కోప్ కింద గమనించసాగింది.

ఏకకణ విశ్లేషణకు ప్రత్యేకంగా రూపొందించిన స్టీరియో జూమ్ మైక్రోస్కోప్ అది.

ఒక్కో స్లైడ్ గమనిస్తున్న కొద్దీ ఆమెలో నిరాశా మేఘాలు అలముకోసాగాయి. మొత్తం పిండాలు పరిశీలించడం పూర్తయ్యేసరికి ఆమెలో దుఃఖం సుడులు తిరిగింది. పొంగిపొర్లుతున్న కన్నీళ్లను నిగ్రహించుకోడానికి చాలా కష్టపడాల్సి వచ్చింది.

నిస్సహాయంగా, చలనంలేకుండా, కాలాన్ని, పరిసరాలను మర్చిపోయినట్టుగా కూర్చుండిపోయిందామె.

సమయం పదిగంటలవుతుండగా వచ్చాడు డాక్టర్ పవన్.

ఉదయం ఇంటికి ఫోన్ చేస్తే తన్మయి అప్పుడే హాస్పిటల్‌కు వెళ్ళిపోయిందని తెలిసింది. ఆమెనుంచి ఫోన్ ఏదైనా వస్తుందేమోనని ఇప్పటివరకు ఎదురుచూశాడు. కాని ఎంతకీ ఫోన్ రాకపోయేసరికి అనుమానం వచ్చి వెంటనే బయలుదేరివచ్చాడు.

చలనరహితంగా, టేబుల్‌మీద తలవాల్చి కూర్చున్న తన్మయిని చూసేసరికి అతనికి బాధకలిగింది. ఆమెనెలా ఓదార్చాలో అతనికి అర్థంకాలేదు.

"తన్మయీ!" గుమ్మందగ్గర నిలబడి నెమ్మదిగా పిల్చాడు పవన్.

తలెత్తి చూసిందామె. ఆ కన్నుల నిండా నీళ్ళు.

మామూలుగా అయితే ఆ క్షణంలో పవన్‌కు పెద్ద సందేహం కలిగేది. ఆ క్షణంలో ఆ కన్నులను కొలనులో విరిసిన కలువలతో పోల్చాలా లేక విరిసిన కలువలమీద కొలువుదీరిన ముత్యాల బిందువులు ఆ కన్నీళ్ళని అనాలా అని.

కానీ, భావుకతకు అది సమయం కాదని అతనికి తెలుసు.

"తన్మయీ! జరిగిందేమిటో నేను ఊహించగలను. ఒక్కమాట చెప్తాను వింటావా? "

తలూపింది తన్మయి.

"ఈ ప్రయోగం ఆరంభించబోయేముందు జయాపజయాలకు అతీతంగా పనిచేయాలని అనుకున్నాం కదా! ఇదే విషయం దేవిశ్రీగారికి కూడా చెప్పాం. ఒకసారి ఫెయిలయినంత మాత్రాన నష్టమేముంది? మరోసారి ప్రయత్నిద్దాం. ఆవిడకు ధైర్యం చెప్పాల్సిన నువ్వే ఇలా డీలా పడితే ఎలా? అయినా మన ప్రయత్నంలో లోపం లేనప్పుడు జరిగినదానికి మనమెలా బాధ్యులమవుతాం? ఇలాంటప్పుడే 'విధి' అని సరిపెట్టుకుని ముందుకు సాగిపోవాలి"

"కాని దేవిశ్రీగారు"

"నేను ఆవిడకు సర్దిచెప్తాను కానీ, నువ్వేం దిగులుపడకు" చెప్పాడు పవన్.

అతని సమక్షంలో ఆమెకు ఎంతో ప్రశాంతత లభిస్తుంది. ఆ మాటలలో ఆత్మీయత ఆమెని సేదతీర్చింది.

తిరిగి రెండోసారి ప్రయోగానికి పూనుకుంది.

కాని ఫలితం 'శూన్యం'

అయితే ఈసారి విఫలమవడానికి కారణం స్పష్టంగా బోధపడింది. ఇంక్యుబేటర్‌లో ఉండాల్సిన పెట్రిపాత్ర బయట ఉంది. ఆరోజు అక్కడికీ ఇంటికి వెళ్లే ముందు అన్నీ ఒకటికి రెండుసార్లు చెక్ చేసుకుంది కూడా.

అంటే ఈ ఆస్పత్రిలో ఎవరో ఈ ప్రయోగాన్ని భగ్నం చేయాలనుకుంటున్నారన్న మాట. ఆ ఎవరో తెలిసేదాకా ప్రయోగం మొదలుపెట్టదలుచుకోలేదు.

"ఏమ్మా తన్మయీ! ఈసారి కూడా ప్రయోగం ఫలించలేదటగా?" అంటూ వచ్చాడు డాక్టర్ సుబ్రహ్మణ్యం.

ఆయన మంచి మేధావి. అందులో ఎలాంటి సందేహం అవసరంలేదు. అయితే మిగతా వారెందుకూ పనికిరారని అనుకుంటాడు. అదే అతనిలోని పెద్దలోపం. కృష్ణప్రసాద్ తన్మయికి ఇస్తున్న ప్రాముఖ్యం సుబ్రహ్మణ్యానికి మింగుడుపడటంలేదు. పిల్లకాకికి అంతటి గుర్తింపా, విలువా? అని బాధపడుతుంటాడు.

ఆయన్ని చూడగానే కుర్చీ జరిపి. "కూర్చోండి సుబ్రహ్మణ్యంగారూ!" అంది తన్మయి.

ఆమె జరిపిన కుర్చీలో కూర్చుంటూ, "ఏంటమ్మా? నేనడిగిన ప్రశ్నకు జవాబు చెప్పనేలేదు" అడిగాడు ఆయన.

నిజానికి ఆమెకు ఆ సమయంలో ఎవ్వరితోనూ మాట్లాడాలని లేదు. కాని ఆ మాట గట్టిగా చెప్పలేదు.

"అవునండి..." నెమ్మదిగా అందామె.

"నీవిక్కడకు వచ్చినప్పటినుంచీ చూస్తున్నాను. ఎంతసేపూ ఏవో ప్రయోగాలు అంటూ ల్యాబ్‌కే అంకితమయిపోతుంటావు. నీ వయసు పిల్లలు ఎంతో ఆనందంగా జీవితాన్ని ఎంజాయ్ చేస్తుంటే నీవిలా ల్యాబ్‌లో కూర్చుని జీవితాన్ని వృథా చేసుకోవడం నాకేం నచ్చలేదు. ఏదో పెద్దవాడ్ని చెప్తున్నా విను! ఏ వయసుకాము చ్చట అన్నారు. చక్కగా నీకు నచ్చిన కుర్రాడ్ని పెళ్ళి చేసుకో. ఏ అమెరికాకో వెళ్ళిపో. నీలాంటి అమ్మాయి ఉండాల్సింది అమెరికాలోనే. అయినా మహానుభావులు రాత్రింబవళ్ళు నిద్రాహారాలు మాని ల్యాబ్‌లోనే గడపడంవల్ల తాము అనుకున్నది సాధించగలిగారు. మనకలా సాధ్యమా?"

ఆమెతో ఈ ప్రయోగం మాన్పించాలనే డాక్టర్ సుబ్రహ్మణ్యం విశ్వప్రయత్నం.

అయితే ప్రయత్న పూర్వకంగా ఎంత చెడుచేయాలని ప్రయత్నించినా, ఒక్కోసారి మంచే జరుగుతుంది. తన్మయి విషయంలో అలాగే జరిగింది. "మహానుభావులు తాము ఏదైనా ప్రయోగానికి పూనుకుంటే రాత్రింబవళ్ళు ల్యాబ్‌లోనే వుండిపోయేవారు" అన్నమాట తన్మయిమీద బాగా పని చేసింది. అప్పటిదాకా ఆమెలో గూడుకట్టుకున్న నిరాశమేఘాలు వీడిపోయి ఆ స్థానంలో ఉత్సాహం చోటుచేసుకుంది.

"థాంక్స్ సుబ్రహ్మణ్యంగారూ! నిజంగా మీరు నాకు చాలా సహాయం చేశారు. ఈసారి ఈ ప్రయోగం విఫలమవదు"

తన్మయిలో ఏదో కృతనిశ్చయం కనబడుతోంది.

డాక్టర్ సుబ్రహ్మణ్యానికి అదేమిటో అర్థం కాలేదు! కాదు కూడా...

★ ★ ★

"అమ్మా మీతో మాట్లాడాలి" అంటూ వచ్చాడు మొగలయ్య.

వాళ్ళావిడకి పురిటి సమయంలో బాగా





రక్తస్రావం జరిగి రక్తం ఎక్కించాల్సి వచ్చింది. ఆ విషయం తెలిసి తన్మయి తన బ్లడ్‌గ్రూప్ సరిపోతుందని చెప్పి బ్లడ్ ఇచ్చింది. ఆ కృతజ్ఞతతో మొగలయ్య తన్మయి అంటే అభిమానంగా వుంటాడు.

"చెప్పు ఏమిటి విషయం?" అదే చిరునవ్వుతో అడిగింది తన్మయి.

"అమ్మా! చిన్ననోరుకు పెద్దమాట అని అనుకోకండి. నిన్న రాత్రి పని ముగించుకుని వెడుతూ, మీరున్నారా లేదా? అని ల్యాబ్‌వైపుకు వచ్చాను. అక్కడ సుబ్రహ్మణ్యంగారిని చూశాను"

అతను చెప్పినదానికి విస్తుబోయిందామె. "కానీ, నా ల్యాబ్ కీస్ నా దగ్గరే ఉన్నాయిగా"

"తెలీదమ్మా... ఆయన మీద నాకెట్టాంటి ద్వేషం లేదు. సత్తెప్రమాణకంగా చెప్తున్నాను" తలమీద చేయిపెట్టుకుని ఒట్టువేస్తున్నట్టుగా అన్నాడు మొగలయ్య "అంతేకాదమ్మా! ఆయన వెడుతూ ఎవరికో ఫోన్ చేసి ఈసారి కూడా తన్మయి ప్రయోగం ఫలించలేదు అని చెప్పాడు. జాగ్రత్తగా ఉండమ్మా" తను చెప్పాల్సింది చెప్పి అతను వెళ్ళిపోయాడు.

సుబ్రహ్మణ్యం మీద ఆమెకీ అనుమానం ఉంది! కాని ఈ ఒక్క కారణంతో ఆయనను దోషిని చేయలేం. అందుకే మొదట ఈ విషయం పవన్‌కి చెప్పింది. పవన్, తన్మయి కృష్ణప్రసాద్‌తో మాట్లాడారు. నెల రోజుల్లో ఢిల్లీలో జరగనున్న మెడికల్ కాన్ఫరెన్సుకు ఛీఫ్‌తోపాటు సుబ్రహ్మణ్యం కూడా వెళ్ళేందుకు నిర్ణయించారు.

సరిగ్గా ప్రయోగం ఆరంభించడానికి ముందు ఆస్పత్రికి వస్తుండగా దేవిశ్రీ కారుకు యాక్సిడెంట్ అయ్యింది. దెబ్బలైతే పెద్దగా తగల్లేదుకాని ఇదంతా మణి పనేనని తన్మయికి అర్థమైంది. వాళ్ళ దృష్టిని మళ్ళించడానికి ప్రెస్‌ని పిలిపించి యాక్సిడెంట్ మూలంగా ఇద్దరికీ సీరియస్‌గా ఉందని చెప్పింది. బ్యాండేజ్‌లతో సెలైన్, బ్లడ్ బాటిల్స్, ఆక్సిజన్ మాస్క్, ఇంటెన్సివ్‌వార్డ్ ఈ హడావిడంతా చూసి, నిజమే కాబోలుననుకున్నారు.

మూడోసారి జరుపబోయే ప్రయోగానికిగాను ఇద్దరి దగ్గరినుంచి అండాలు తీసుకుని వీర్యకణంతో ఫలదీకరణ చేసింది. ఈసారి ఖచ్చితంగా సక్సెస్ అవుతామని ఆమెకు అన్పించసాగింది.

ఫలదీకరణ జరిపిననాటినుంచి, దేవిశ్రీ గర్భంలోకి పిండాన్ని ప్రవేశపెట్టేదాకా తను ల్యాబ్‌లోనే ఉండదల్చుకుంది తన్మయి. మధ్యమధ్య ఆమెకు తోడుగా పవన్ వచ్చి వెళ్తున్నాడు. రాత్రిపూట తన్మయితోపాటు ల్యాబ్‌లోనే ఉండిపోతున్నాడు.

వృత్తిని దైవంగా భావించే తండ్రి గురించి తెలుసు కాని, దానిని ఓ యజ్ఞంగా భావించే వ్యక్తిని ఇప్పుడే చూస్తున్నాడు. అది కూడా కేవలం తన మాట నిలబెట్టాలని.

తన్మయి అతనికి ఎంతో అపురూపంగా అనిపించసాగింది.

నాజూకుగా, పూలతీగలా ఉండే ఆమెలో ఇంతపట్టుదల, మొండితనం ఉన్నాయంటే అతనికి చాలా ఆశ్చర్యంగా ఉంటుంది. ఈ లక్షణాలు వాళ్ళ తాతగారినుంచి వచ్చాయని తన్మయి బామ్మగారు అంటుంటుంది. ఏదైనా పని చేపడితే అది పూర్తయ్యేదాకా విశ్రమించకపోవడం అనేది చాలా కొద్దిమందిలో మాత్రమే ఉంటుంది.

తెల్లారి అయిదు దాటాక తన్మయి పెట్రిడిష్‌ను ఇంక్యుబేటర్‌లోంచి బయటకు తీసింది. పరీక్ష రాసి రిజల్ట్సుకోసం ఎదురు చూస్తున్న విద్యార్థినిలా ఉందామె పరిస్థితి.

ఫలదీకరణం చెందిన పిండాలను ఒక్కొక్కటి స్లైడ్స్‌మీదకు బదిలీచేసి, మైక్రోస్కోప్ కింద గమనించసాగింది.

ఆమె కళ్ళు విభ్రాంతితో విశాలమవుతున్నాయి.

మనసులో ఆనందం ముఖంలో కూడా

ద్యోతకమవుతోంది.

కనురెప్ప వాల్చడం కూడా మర్చిపోయి, ఆమె మళ్ళీమళ్ళీ వాటిని పరిశీలించసాగింది.

విషయమేమిటో పవన్‌కు అర్థమైంది.

"తన్మయీ..." పిల్చాడు అతను.

"సక్సెస్..." గట్టిగా అరిచింది ఆమె... ఆ నాలుగు గోడలమధ్య ఆ ఆనందం ప్రతిధ్వనించింది.

నవ్వుతూ చూశాడు పవన్.

"ఎస్...మనం... మనం సక్సీడయ్యాం" అతని రెండు చేతులూ పట్టుకుని చెప్పింది తన్మయి.

ఆ కళ్ళల్లో ఆనందంతోపాటు లీలగా గర్వంకూడా కదలాడింది.

తన్మయి ఇంత సంతోషంగా ఉండటాన్ని పవన్ మొదటిసారి చూస్తున్నాడు.

"కంగ్రాట్స్" నెమ్మదిగా అన్నాడు పవన్.

ఇద్దరికీ ఎంతో మాట్లాడాలని ఉంది. కాని ఆనందం అంబరమైంది. మాట మౌనమైంది.

అంతేకాదు మాటకు పది అర్థాలయితే... మౌనానికి పదివేల అర్థాలు కదా!

రెప్పవాల్చకుండా తనవంకే చూస్తున్న పవన్‌కళ్ళల్లో ప్రేమలాంటి భావన కన్పించేసరికి చటుక్కున తలవంచుకుంది.

ఈమధ్య ఆమె మనసు కూడా ప్రేమ పాఠాలు చెప్తోంది.

మొత్తానికి సుబ్రహ్మణ్యం వచ్చేసరికి దేవిశ్రీ గర్భంలోకి పిండాన్ని ప్రవేశపెట్టడంతోపాటు సృజనను అమెరికా పంపేయడం కూడా జరిగిపోయింది.

అక్కడేమీ జరగలేదన్న భ్రమలో ఉన్నారు మణి, సుబ్రహ్మణ్యం... వాళ్ళు అలా ఉండడమే మంచిదనుకున్నారంతా.

ఆ తర్వాత డాక్టర్ సుబ్రహ్మణ్యాన్ని ఉద్యోగంలోంచి తొలగించారు కృష్ణప్రసాద్... అంతా చాలా కామ్‌గా జరిగిపోయింది.





ఇక్కడ ఉద్యోగం పోతే మణి తన క్లినిక్‌లో ఉద్యోగం ఇస్తాడని సుబ్రహ్మణ్యం అనుకున్నాడు. కానీ 'నీలాంటి ద్రోహికి ఉద్యోగం ఇవ్వలేను' అన్నాడు మణి. అందుకే ఓ చిన్న ఆసుపత్రిలో సాధారణ డాక్టర్‌గా వెళ్ళి చేరాడు సుబ్రహ్మణ్యం. ఒక్కోసారి చేసేది చిన్న తప్పే అయినా పెద్ద మూల్యమే చెల్లించాల్సి వస్తుంది. ఇక సుబ్రహ్మణ్యం గురించి మాట్లాడుకోడానికి ఏమీలేదు.

★ ★ ★

"ప్రియనేస్తమా!

నీవు వస్తూ వసంతాన్ని తెస్తావో, లేక నీవే వసంతంలో వస్తావో తెలీదుగానీ నీరాక మాత్రం వసంతాగమనమే.

నీ ముంగిట అడుగుపెడితే చాలు... కుహుకుహురాగాలతో, చిగురుటాకు సయ్యాటలతో, పిల్లగాలి తెమ్మెరలతో ప్రకృతి అంతా స్వాగతవచనం పలుకుతుంది.

అక్కడినుంచి కదిలితే ఏమిటి నీ నేస్తం గొప్పతనమని అడుగుతారంతా?

ముఖస్తుతి లేక తప్పొప్పులు విమర్శిస్తూ, ఆంతరంగిక రహస్యాలు దాచుకుంటూ, వెన్నెల, అమావాస్య లేవైనా నీవెంట నేనున్నానంటూ ముందుకు నడిపిస్తావు.

ధైర్యం నా మనోచిత్తరువులోంచి నడిచిపోతే నీవు చిత్రకారిణివై నా మనసును కాన్వాస్‌గా చేసుకుంటావు.

నీ స్నేహం, స్పందన, అనురాగం, ఆరాధన, అభినందన, ప్రోత్సాహం, ప్రేమలను ఏడురంగుల ఇంద్రధనుస్సుగా చేసుకుని నీవు గీసే ఆ చిత్రం నా విజయాలకు ఆలంబన అవుతుంది"

ఫోన్‌లో తన్మయి చెప్తున్న దానిని మైమరిచి వింటున్న డాక్టర్ నీహారిక బయట ఏదో గలాభా వినిపించేసరికి ఈ లోకంలోకి వచ్చింది. "తన్మయీ! నేను తర్వాత మాట్లాడతాను. ప్లీజ్ ఏమనుకోకు" అంటూ ఫోన్ పెట్టేసింది నీహారిక.

సెల్ ఆఫ్‌చేసి తన రూమ్‌లోంచి బయ

టకు వచ్చి కారిడార్‌లోకి నడిచింది.

"డాక్టర్ ప్లీజ్! నా రిపోర్ట్స్ ఒకసారి నన్ను చూడనివ్వండి. ఇక్కడకు రాక ముందు నేను టెస్ట్‌చేయించుకున్నాను. నా పరంగా ఎలాంటి లోపం లేదని చెప్పారు. కానీ ఇక్కడ స్పెర్మ్ కౌంట్ తక్కువగా ఉందని, మామూలుగా పిల్లలు పుట్టే అవ కాశం లేదని ఐ.వి.ఎఫ్ తప్పదని చెప్తు న్నారు. ఈ క్లినిక్‌కి వచ్చిన వారందరి విష యంలోను ఇలాగే జరుగుతోందంటే బహు శా మీరే కావాలని ఈ సమస్యను సృష్టిస్తు న్నారనిపిస్తోంది. ట్రీట్‌మెంట్ పేరుతో మమ్మల్ని దోచేస్తున్నారు. మా ఉసురు మీకు తప్పక తగులుతుంది. మిమ్మల్ని ఊరికే వదిలిపెట్టను. నేను ఖచ్చితంగా పోలీసులకు కంప్లెయింట్ చేస్తాను. మిమ్మల్ని కోర్టుకీడుస్తాను"

ఆ వ్యక్తి ఏడుస్తూ పెద్దగా కేకలుపెడుతు న్నాడు.

వార్డ్‌బాయిస్ అతన్ని చెరోవైపు పట్టుకుని అక్కడ్నుంచి లాక్కెళ్ళారు.

అతను వెళ్ళినా అతని అరుపులు అక్కడ ప్రతిధ్వనిస్తూనే ఉన్నాయి.

నీహారికకు ఆమె అన్నా, వదినెలు కళ్ళ ముందు మెదిలారు.

ఉత్సాహానికి, చిలిపిదనానికి, ప్రేమానురా గాలకు ప్రతిరూపంగా తను ఉన్నచోట నవ్వుల జల్లులు కురిపించే అన్నయ్య. భర్త, అత్తమావలు, ఆడపడుచును అభిమానించే వదిన గుర్తొచ్చారు. అదంతా ఒకప్పుడు. ఇప్పుడేముందీ ఆనందానికి నిలయంగా వుండే ఆ ఇల్లు నిశ్శబ్దానికి నిర్వచనమైపో యింది. 'శబ్దం' ఆ ఇంటికి అతిథి అయ్యింది.

టేబుల్‌మీద తలవాల్చి నిస్సత్తువగా కూర్చుండిపోయింది నీహారిక.

★ ★ ★

కోరుకున్న బిడ్డ ప్రయోగంలో విజయం సాధించిన **అమృతా పాలీ క్లినిక్ అండ్** రీసె ర్చ్‌సెంటర్.

పి.జి.డి. ప్రయోగంలో అమృత సక్సెస్.

అతిచిన్న వయసులో అత్యుత్తమ విజయం సాధించిన డాక్టర్ నీహారిక.

ఇలాంటి హెడ్డింగ్స్‌తో పేపర్లన్నీ ఆరోజు పెద్ద సంచలనం సృష్టించాయి.

ఉదయం పేపర్లు చూసిన ఎన్నోవేల మంది ఆ వార్తను ఆశ్చర్యంగా, ఆనందంగా ఆమూలాగ్రం చదివారు. హైద్రాబాద్ పరిస రప్రాంతాల్లో ఉన్నవారు చాలామంది అప్ప టికే అమృతకు ఫోన్లు చేయసాగారు.

యథాలాపంగా పేపర్ చూసిన డాక్టర్ తన్మయి, డాక్టర్ పవన్‌లు ఆ వార్త చూసి ఉలిక్కిపడ్డారు.

నీహారిక గురించి, ఆమె జరిపిన ప్రయోగం గురించి వివరించడమేకాదు, ఆమె ఇంటర్వ్యూని కూడా ప్రకటించాయి. ఓ స్త్రీ తాను మగబిడ్డకోసం ఎంతో తపించా నని, ఎన్నో ఆస్పత్రులు తిరిగానని చివరకు అమృత క్లినిక్ తన కలలను సాకారం చేసిం దని చెప్పింది. నీహారిక కూడా పి.జి.డి. గురించి వివరించడంతోపాటు ఆ ప్రయోగం కోసం తాను ఎన్నినిద్రలేని రాత్రులు గడి పిందో చెప్పింది.

డాక్టర్ మణికి వెర్రి ఆనందంగా ఉంది. సంతోషంతో తబ్బిబ్బులయిపోతున్నాడు. ఇందుకు కారణమైన నీహారికను ఎన్నో సార్లు అభినందించాడు.

జీవితంలో ఇప్పటివరకూ తన్మయికి అంతటి ఆగ్రహం ఎన్నడూ కలగలేదు.

చదువుతున్న పేపర్ విసురుగా గిరాటే సింది. అంతకన్నా తన కోపాన్ని ఎలా ప్రద ర్శించాలో ఆమెకు తెలీలేదు.

నీహారికను పట్టుకుని నాలుగుదులిపేస్తే కాని మనసుకు శాంతి కలిగేలా అనిపించ లేదు. కాని ఎన్నిసార్లు ప్రయత్నించినా ఫోన్ ఎంగేజ్ వస్తోంది. సెల్‌ఫోన్ కూడా ఎంగేజ్‌లోనే ఉంది.

అసలు నీహారిక ఈ పనికి ఎందుకు

అంగీకరించినట్టు? తనను ఆ ఉపద్రవం నుంచి కాపాడిన తనే దానికి బలైపో యిందా? మణి బలవంతంమీద ఒప్పు కుందా లేక తనే ఇష్టపూర్వకంగానే సిద్ధ మైందా? అయితే డబ్బు లేదా పేరు ఈ రెంటికోసమే ఎవరైనా ఇలాంటివాటికి సరే నంటారు. నీహారికకు డబ్బు పిచ్చి లేదు. మరి పేరుకోసమే ఇదంతా చేస్తోందా?

ఆలోచనలతో తన్మయి మెదడు వేడెక్కి పోయింది.

ఆ సాయంత్రం డ్యూటీలో ఉండగా నీహా రిక ఫోన్ చేసింది.

"నీహా! ఏమిటి నువ్వు చేసిన పనికర్థం?" డైరెక్టుగా అసలు విషయం అడిగేసింది.

"తన్మయీ! ప్లీజ్... దయచేసి నన్ను అపార్థం చేసుకోవద్దు. నేను ఒకటి రెండు రోజులలో నిన్ను కలిసి విషయమంతా చెప్తాను" అని ఫోన్ కట్ చేసింది.

నీహారికను ఎన్నో అడగాలనుకున్న తన్మయి ఏమీ అడగలేకపోయింది. స్నేహి తురాలు ఏదో పెద్ద ప్రమాదంలో పడబో తోందని అనిపించసాగింది.

ఇది జరిగిన పదిరోజులకు టి.వి.లో నీహారిక ఇంటర్వ్యూ ప్రసారమైంది.

పి.జి.డి. ప్రయోగం గూర్చి మధ్యమధ్య ఫోటోలు చూపిస్తూ వివరించసాగింది. ఆమె వివరణ సాంకేతిక పదాలతో కొనసా గింది. అది సామాన్యులకు ఎంతవరకు అర్థం అవుతుందో చెప్పటం కష్టం. అయితే వారికి కావాల్సింది సాంకేతిక పదాలు, వివ రణకాదు. కేవలం ఫలితం. తాము కోరు కున్న బిడ్డను అమృతక్లినిక్‌లో పొందే సౌకర్యం ఉన్నదని తప్పితే మిగతా విష యాలేమి వారికి అవసరంలేదు.

ఇంటర్వ్యూ చూస్తున్న తన్మయి ఏదో తెలీని దిగులు, ఆందోళనకు లోనైంది. థియరిటికల్‌గా అదంతా సాధ్యమే. కాని ప్రాక్టికల్‌గా!?

అధునాతన సాంకేతిక ప్రక్రియలను డౌన్‌సిండ్రోమ్, క్రోమోజోమ్ సంబంధిత అపశ్రుతులు పసిగట్టి నివారించడానికి ఉప యోగించాల్సింది పోయి గర్భస్త ఆడ శిశు వుల హత్యకు వినియోగించాల్సి రావడం నిజంగా చాలా చాలా బాధాకరం. అది అర్థ మయ్యే తను ఈ ప్రయోగంలో సక్సెస్ అయి కూడా కాలేదని చెప్తూవచ్చింది. తన వల్ల కాదంటే ఈ విషయాన్ని ఇంతటితో వదిలేస్తారనుకుంది. కాని నీహారికే ఈ పనికి సిద్ధపడటమే ఆశ్చర్యంగా ఉంది. దాని వెనుకగల కారణం మాత్రం ఎంత ఆలోచించినా ఆమెకు అర్థంకావడంలేదు.

★ ★ ★

"మే ఐ కమిన్ మేడమ్" గుమ్మందగ్గరే నిలబడి పిలిచింది నీహారిక.

ఆ పిలుపు వినవచ్చిన వైపు చూసి "రండి నీహారిక" అంది తన్మయి.

ఆ మాటలోనే తన్మయి తనపట్ల ఎంతకో పంగా ఉన్నదీ ఆమెకు అర్థమయ్యింది.

నీహారిక లోపలికి వచ్చి సోఫాలో కూర్చుంటూ అడిగింది. "బామ్మగారు ఎలా ఉన్నారు?"

"బానే వున్నారు?" నిర్లిప్తంగా చెప్పింది తన్మయి.

అయిదు నిముషాల మౌనం తర్వాత "తన్మయీ నేనెందుకు ఈ పని చేశానో చెప్పేముందు నీకు నా అన్నా, వదినలగు రించి కూడా చెప్పాలి"

నీహారికవైపు కన్నార్పకుండా చూస్తూ, "నీకు అన్నయ్య ఉన్నాడా? మరి ఆ విషయం నాకెప్పుడూ చెప్పలేదే?" ఆశ్చ ర్యంగా అడిగింది తన్మయి.

"ఉన్నాడు కాదు... ఉండేవాడు" ఎంతగా కంట్రోలు చేసుకోడానికి ప్రయత్నించినా నీహారిక కంఠం దుఃఖంతో రుద్ధమైంది.

"అంటే...?"

"అవును! అన్నయ్య ఉండేవాడు. ఇప్పుడు లేడు. ఆత్మహత్య చేసుకున్నాడు" ఎన్నాళ్ళ

నుంచో నొక్కి పట్టిన వేదన, దుఃఖం ఒక్కసారిగా కట్టలు తెంచుకుంది.

"నీహా..." అని మాత్రం అనగలిగింది తన్మయి. అంతకుమించి ఏం మాట్లాడాలో ఆమెకు అర్థంకాలేదు. నీహారికను దగ్గరకు తీసుకుని ఓదార్చాలని అనిపించినా కూర్చున్న చోటునుంచి లేవలేకపోయింది. ఎప్పుడూ నవ్వుతూ, నవ్విస్తూ ఉండే స్నేహితురాలి మనసులో ఇంతటి విషాదం గూడు కట్టుకుని ఉందన్న నిజం ఆమెకు జీర్ణం కాలేదు.

ఒక క్షణం తర్వాత తననుతాను సర్దుకుని కర్చీఫ్‌తో కళ్ళు తుడుచుకుని తన్మయివైపు చూసి మందహాసం చేసింది. "అవును తన్మయీ! నమ్మలేకపోతున్నావు కదూ! కాని ఇది పూర్తిగా వాస్తవం. మనసులో ఎంత బాధ ఉన్నా ఎదుటివారిని నవ్వుతూ, నవ్విస్తూ బతికేయాలని, మన ఆనందం తప్ప బాధను ఇతరులతో పంచుకోకూడదని అన్నయ్యనేర్పించాడు... అందుకే ఇలా? "

"ఐయామ్ సారీ నీహా!"

"ఫర్లేదు తన్మయీ! అన్నయ్య పోయాడనే బాధపడ్తుంటే ఆ విషాదం తట్టుకోలేక వదిన పిచ్చిదైపోయింది. ప్రస్తుతం వదిన మెంటల్ ఆసుపత్రిలో ట్రీట్‌మెంట్ తీసుకుంటోంది"

ఓ శీతలవీచిక తనను స్పృశించి వెళ్ళినట్టుగా వణికింది తన్మయి. ఎట్టకేలకు గొంతు పెగల్చుకుని, "ఇదంతా ఎప్పుడు జరిగింది? " అని అడిగింది.

"దాదాపు సంవత్సరం కావస్తుంది" అంది నీహారిక. "తన్మయీ! అన్నయ్య చనిపోవడానికి కారణం ఎవరో తెలుసా? వాడే... ఆ మణి"

మణి పేరు తల్చుకోగానే ఆమె ముఖం కోపంతో ఎర్రబడింది. కళ్లు అగ్నిగోళాలయ్యాయి. ఆమె ఆవేశం చూస్తుంటే అలాగే వెళ్ళి మణిని చంపేసినా ఆశ్చర్యపోనక్కర్లేదనిపించింది తన్మయికి.

"అన్నా, వదినలది ప్రేమ వివాహం. ఒకరంటే మరొకరికి ప్రాణం. అన్నయ్యకు కొంచెం వళ్ళు వెచ్చబడితే వదిన వేదనతో గిలగిల్లాడిపోయేది. వదిన కంటి కన్నీరొలికితే అన్నయ్య తల్లడిల్లిపోయేవాడు. వారిద్దరిని చూసినప్పుడల్లా వీరిది జన్మజన్మల అనుబంధమని మాకు అన్పించేది. మా వదినకు పిల్లలంటే ప్రాణం. ఇంట్లో ఒక్కత్తేనేమో తోబుట్టువులు, అన్న, తమ్ముళ్ళు లేక ఒంటరిగా పెరిగింది. అందుకే గంపెడు పిల్లల్ని కనాలని ఆశపడింది. కాని ఎందువల్లనో పెళ్ళై సంవత్సరం దాటినా వదిన నెలతప్పలేదు. అమ్మ ఎంత నచ్చజెప్పినా వదినకు దిగులు ఎక్కువైపోయింది. దాంతో అన్నా, వదినలు డాక్టర్ దగ్గరకు వెళ్ళారు. ఆయన ఇద్దరినీ పరీక్ష చేసి, వాళ్ళిద్దరిలోనూ ఎలాంటి లోపం లేదని చెప్పాడు. మెడికల్ రిపోర్ట్స్ కూడా అవే చెప్పాయి. అయినా వదినకు సంతృప్తి కలగలేదు. ఆ సమయంలో అన్నయ్య ఫ్రెండ్ విశాల్ ఇంటికి వచ్చాడు. అతను అమృతలో పనిచేస్తున్నాడు"

నీహారిక మాటకు అడ్డొస్తూ "డాక్టరా? " అడిగింది తన్మయి.

"కాదు... అడ్మినిస్ట్రేషన్ విభాగం. అన్నయ్య స్నేహితుడికి జరిగినదంతా చెప్పాడు. అమృతకు రోజూ ఇలాంటి కేసులెన్నో వస్తాయని, డాక్టర్ మణి మంచి డాక్టరని విశాల్ చెప్పాడు..."

"అంటే విశాల్ కూడా..." అనుమానంగా అంది తన్మయి.

"విశాల్‌ను మనం ఎంతమాత్రం అనుమానించక్కర్లేదు. తను అన్నయ్యకు ప్రాణస్నేహితుడు. కేవలం అన్నయ్యకు సాయం చేయాలని తప్పితే అంతకన్నా మరో ఉద్దేశ్యం అతనికిలేదు. నిజానికి అప్పట్లో అతనికి కూడా మణి నిజస్వరూపం తెలీదు"

తన్మయి సందేహం క్లియరయ్యింది. "తర్వాత ఏం జరిగింది? " ఆత్రుతగా అడి

గింది తన్మయి.

"అన్నావదినల రిపోర్ట్ పరిశీలించాడు. అవి తమకు అవసరమవుతాయని అన్నయ్య అడిగినప్పుడు ఇస్తానని చెప్పాడు. ఇద్దరినీ టెస్ట్‌చేసి వదినలో ఎలాంటి లోపం లేదని, అన్నయ్య కొద్దిరోజులు మందులు వాడితే సరిపోతుందని చెప్పాడు"

"అక్కడికీ అన్నయ్య ఇంతకుముందు డాక్టర్ ఇచ్చిన రిపోర్ట్ గురించి మణిదగ్గర ప్రస్తావించాడు. మణి తన మాటలతో అన్నయ్యను బోల్తా కొట్టించాడు. ఆ డాక్టర్ మిమ్మల్ని సరిగ్గా పరీక్ష చేయలేదని, ఇక్కడున్నంత అడ్వాన్స్‌డ్ టెక్నాలజీ అక్కడ లేదు కనుక రిజల్ట్ ఖచ్చితంగా రాలేదని చెప్పాడు. అన్నయ్య మణి మాటలు పూర్తిగా నమ్మేశాడు. నమ్మకుండా ఉండేందుకు ఛాన్స్ లేదు. ట్రీట్‌మెంట్ మొదలైంది. మొదట్లో చాలా చిన్న లోపమని, కొద్దిరోజులు మందులు వాడితే సరిపోతుందని చెప్పిన మణి మందులని, ఇంజెక్షన్లనీ వేలకువేలు డబ్బులు గుంజటం మొదలుపెట్టేవాడు. చాలా ఖరీదైన ఇంజెక్షన్స్ వాడేవాడు. వాటికి ప్రిస్క్రిప్షనదీ ఉండేదికాదు. అన్నీ అమృత క్లినిక్‌లో ఉన్న మెడికల్ షాప్‌లోనే లభ్యం అయ్యేవి. అసలతను చేస్తున్న వైద్యమేమిటో, వాడే మందులేమిటో ఎవరినైనా కనుక్కుందామంటే కుదిరేదికాదు"

"అదేంటి? రిపోర్ట్స్ చూపిస్తే తెలుస్తుందిగా? "

"అదే అసలు విషాదం" బాధతో కూడిన నవ్వు విరిసింది నీహారిక ముఖంలో. "మణి తన క్లినిక్‌లోని ఐ.వి.ఎఫ్.కు వచ్చేవారి రిపోర్ట్స్ చాలా రహస్యంగా ఉంచుతాడుట. ఈ విషయం నాకూ ఈమధ్యనే తెలిసింది"

నీహారిక చెప్పే ప్రతిమాట తన్మయిలో ఆశ్చర్యం కలగచేస్తోంది. దాదాపు సంవత్సరంపాటు అక్కడ పనిచేసినా తనకా విషయం తెలీదంటే మణి ఎంత జాగ్రత్త పడుతున్నాడో అర్థం చేసుకోవచ్చు

"డాక్టర్ మణి ట్రీట్‌మెంట్‌తో విసిగిపోయిన అన్నయ్య ఓరోజు గట్టిగా అడిగాడట. దాంతో అన్నయ్య రిపోర్ట్స్‌లో స్పెర్మ్‌కౌంట్ చాలా తక్కువగా ఉన్నట్టు సూచిస్తున్నాయని, ఐ.వి.ఎఫ్. తప్పదని చెప్పాడట"

"ఇంత దారుణమా? " దిగ్భ్రాంతిగా అంది తన్మయి.

"ఆరోజు నాకు బాగా గుర్తుంది. ఎన్నడూ లేనిది చాలా డిస్టర్బ్‌డ్‌గా కన్పించాడు. మేం మాట్లాడించబోతే మామీద విసుక్కున్నాడు. రూమ్‌లోకి వెళ్ళి తలుపేసుకుని ఒక్కడే ఉండిపోయాడు. ఎవరెంత పిలిచినా తలుపు తీయలేదు. బయటకు రాలేదు. సాయంత్రానికి వాడి మూడ్ మారినట్టుంది. మమ్మల్ని సినిమాకు తీసుకువెళ్ళాడు. తిరిగి అన్నయ్య మామూలు మనిషి అయినందుకు మేమంతా సంతోషించాం. భగవంతుడి అనుగ్రహం ఎలా ఉంటే అలా జరుగుతుంది. ఇక మనం ఏ డాక్టర్ దగ్గరకు వెళ్ళొద్దు అని వదిన చెప్పింది. అన్నయ్య కూడా దానికి అంగీకరించాడు. ఆ రాత్రి సినిమా చూసి వచ్చాక కూడా చాలాసేపు కబుర్లు చెప్పుకున్నాం. ఏ అర్థరాత్రో పడుకోవడంతో తెల్లారేదాకా మెలకువరాలేదు. మా అందరికన్నా ముందు లేచి వ్యాయామం చేసే అన్నయ్య ఆరోజు లేవలేదు. ఆలస్యంగా పడుకున్నాడుకదాని మేమూ వాడిని లేపలేదు. కానీ పదకొండు దాటినా మనిషి అటుఇటు కదలకపోయేసరికి మాకు అనుమానం వచ్చింది. వెళ్ళి చూస్తే..."

ఆపైన వాక్యం పూర్తిచేయలేక దోసిట్లో ముఖం దాచుకుంది నీహారిక.

ఎప్పట్నుంచి వాళ్ళ సంభాషణ వింటున్నారో తన్మయి బామ్మగారు నీహారికను దగ్గరకు తీసుకుని ఓదార్చసాగారు. "ఊరుకోమ్మా! మా తల్లివిగా! పోయినవాళ్ళంతా మంచివాళ్ళూ, అదృష్టవంతులూనమ్మా.

మనమే ఈ దారుణాలన్నీ చూడాలన్న రాత ఉండబట్టి ఇలా బతుకుతున్నాం. మనుషుల్ని కాపాడాల్సిన డాక్టర్లే పేషెంట్స్ ప్రాణాలు తీయడానికి సిద్ధపడితే ఇక కాపాడండి అని ఎవరిదగ్గరకు వెడతాం. మనందరి ఉసురు తగిలి వాడు సర్వనాశనమైపోతాడు. నీలాంటి మంచిదాన్ని ఏడ్పించిన వాడి పాపం ఊరికే పోదమ్మా" అనునయంగా అందావిడ.

నీహారిక చెప్పిందంతా విన్నాక తన్మయి మతి భ్రమించినదానిలా కూర్చుండిపోయింది. అసలా సంఘటన పట్ల ఎలా రియాక్ట్ కావాలో కూడా ఆమెకు అర్థంకావడంలేదు. కేవలం డబ్బుకోసం మనుష్యులు ఎంతటి నీచానికైనా పాల్పడతారన్న వాస్తవం ఆమెకిప్పుడిప్పుడే అర్థమవసాగింది.

అందరినీ నవ్విస్తూ తాను నవ్వుతూ పసిపాపలా స్వచ్ఛంగా కన్పించే నీహారిక నవ్వు వెనుక ఇంతటి విషాదం ఉందని ఆమె అనుకోలేదు. ప్రతిచిన్న సమస్యను భూతద్దంలోంచి చూస్తూ అందరిదగ్గరా తమబాధలు చెప్పుకుని సానుభూతి పొందాలనుకునే వారినెందరినో చూసింది ఆమె. కానీ నీహారిక తన బాధను కనీసం స్నేహితులతో కూడా పంచుకోలేదు.

ఒక్కసారిగా నీహారికమీద తన్మయికి గౌరవం పెరిగింది.

"నీహా! ప్లీజ్... ప్లీజ్ కంట్రోల్ యువర్ సెల్ఫ్" నీహారిక చేతిని తన చేతుల్లోకి తీసుకుని ఆత్మీయత ఉట్టిపడుతున్న స్వరంతో అంది తన్మయి.

ఆ స్వరంలో ఇంతక్రితం వ్యక్తమైన ఆగ్రహం, ఆవేశం ఇప్పుడు మచ్చుకైనా లేవు.

ఈలోగా బామ్మగారు ఇద్దరికీ కాఫీ తీసుకొచ్చి ఇచ్చింది.

కాఫీ తాగటం పూర్తయ్యేదాకా ఎవరి ఆలోచనలలో వాళ్ళుండిపోయారు. అంతలో ఏదో గుర్తుకువచ్చినదానిలా "అంటే నువ్వు పవన్ ఆఫర్ తిరస్కరించి అమృతలో జాయిన్ అవడానికి కారణం ఇదన్నమాట" అడిగింది తన్మయి.

"అవును. నేను అక్కడ జాయిన్ అయినప్పటినుంచి అవకాశంకోసం ఎదురుచూస్తున్నాను. ఆ అవకాశం పదిరోజులక్రితం వచ్చింది"

"ఏం జరిగింది? " అడిగింది తన్మయి.

"పదిరోజులక్రితం నువ్వు ఫోన్ చేశావు గుర్తుందా? "

గుర్తుందన్నట్టు తలాడించింది డాక్టర్ తన్మయి.

"నేను చేసిన ప్రయోగం సక్సెస్ అయ్యిందని చెప్దామని చేశాను. డైరక్ట్‌గా కాకుండా ఓ కవిత రూపంలో చెప్పి నిన్ను ఆనందపరచాలనుకున్నాను. నిజానికి నీవు చేసిన సాయంవల్లనే నేనది సాధించగలిగాను. అందుకు నీకేవిధంగా కృతజ్ఞతలు తెల్పుకోవాలో నాకు అర్థం కావడంలేదు. నేను చెప్పేలోపునే నువ్వు అక్కడేదో గలాభా జరుగుతోందని, తర్వాత ఫోన్ చేస్తానని చెప్పి పెట్టేశావు. తర్వాత ఎప్పుడో చేశావనుకో. ఏం జరిగింది ఆరోజు" ఆనాటి సంఘటన జ్ఞప్తికి తెచ్చుకుంటూ అడిగింది తన్మయి.

"ఆరోజు ఓ వ్యక్తి బాగా అరుస్తూ మణిని తిట్టడం ఆరంభించాడు. ఏం జరిగిందో నాకు అర్థంకాలేదు. అందుకే ఫోన్ పెట్టేసి నేనూ కారిడార్లోకి నడిచాను. అతనిది కూడా అన్నయ్యకేసే..."

"యూ మీన్ ఇండ్యూస్డ్ ఇన్‌ఫెర్టిలిటీ? "

"అవును. అతనిమాటలను బట్టి నాకర్థం అయ్యిందేంటంటే అమృతకు వచ్చే వారెవ్వరూ మొదటే ఇక్కడకు రావడంలేదు. బహుశా ఫీజుకు భయపడి అనుకుంటాను. అతను కూడా అంతే. అతను కూడా వేరే డాక్టర్ దగ్గర టెస్ట్ చేయించుకుని ఆ రిపోర్ట్సు తీసుకుని వచ్చాడు. వీళ్ళు దంపతు

లను ఇద్దర్నీ టెస్ట్ చేస్తున్నారో లేదో తెలీదు కానీ మగవాళ్ళకు మాత్రం ట్రీట్‌మెంట్ మొదలెడుతున్నారు. ఫలితంగా ఇన్‌ఫెర్టి లిటీ వస్తోంది. పేషెంట్లకు అనుమానం రాకుండా జాగ్రత్తలు తీసుకుంటున్నా కొంత మంది జరిగిన మోసం గ్రహించి తమ రిపోర్ట్స్, వాడిన మందుల తాలూకు ప్రిస్కి ప్షన్స్ ఇవ్వమని అడుగుతున్నారు. అలా అడిగినవారి నోరు నొక్కేయడానికి బెదిరిం పులు మొదలు పెడుతున్నారు. కానీ అతను వాళ్ళమాట విన్నట్టులేదు. చాలా వైల్డ్‌గా రియాక్టయ్యాడు. మణిమీద కేసు పెడ్తానని, కోర్టుకీడుస్తానని బెదిరించాడు. మీరు చేసే ట్రీట్‌మెంట్‌లో లోపం లేకపోతే రిపోర్ట్స్ ఎందుకివ్వరంటూ నిలదీశాడు. ఇంత గొడవ జరుగుతున్నా మణి బయ టకు రాలేదుకానీ వార్డ్‌బోయ్‌లు వచ్చి అతన్ని అక్కడ్నించి బలవంతంగా తీసుకువె ళ్ళారు. తీసుకువెళ్ళారనడంకన్నా ఈడ్చుకుని వెళ్ళారనడం సమంజసం. ఆ తర్వాత అతన్నేం చేశారో తెలీదుకానీ ఆ రాత్రి అతను మరణించాడు. అది కూడా అతిదా రుణంగా..."

ఆ సంఘటన గుర్తుకు వచ్చి నీహారిక ఒళ్ళు జలదరించింది.

"నిజమా?" నమ్మలేనట్టు చూస్తూ అడి గింది తన్మయి.

"అవును! టెర్రస్‌మీంచి కిందపడి చనిపో యాడు" నిట్టూర్పు విడుస్తూ అంది నీహా రిక.

అతి విచిత్రమైన నిశ్శబ్దం ఏర్పడింద క్కడ.

"నీహా! నాకెందుకో అతనిది సహజమ రణం కాదనిపిస్తోంది" తన్మయి స్వరంలో వేదన గూడుకట్టుకుని ఉంది.

ప్రాణం బిగపట్టుకున్నదాన్లా అంది నీహా రిక "అవును! నీ ఊహ నిజమే. అతను హత్య చేయబడ్డాడు"

తన్మయి ముఖం రక్తంలేక పాలిపోయిన ట్టుగా అయిపోయింది.

ఏం మాట్లాడాలో ఆమెకు అర్థం కాలేదు. మనుష్యుల్లో మృగాలుంటాయని తెలుసు కానీ నరమాంస భక్షకులు ఉంటారని తెలీదు. అలాంటివారిని ఆమె ఇంతవరకూ చూడలేదు. వేరే ఎవరైనా అయితే వైద్యం చేయచ్చు కానీ సాక్షాత్తు ఓ డాక్టరే ఇలా నరమాంస భక్షకుడైతే ఎవరుమాత్రం ఏం చేయగలరు.

"అతను చనిపోయాడని తెలియగానే నీలాగే నాకూ అనుమానం వచ్చింది. అత నిది సహజమరణం కాదేమో అన్పించింది. కానీ అతనికి నిద్రలో నడిచే అలవాటు ఉండడంవల్ల ఈ ప్రమాదం జరిగిందని మణి చెప్పాడు"

తన్మయి గొంతు ఆవేశంగా పలికింది. "అది నిజమేననుకుందాం. పేషెంట్ మాన సిక పరిస్థితి బాగుండలేదని తెలుసు. అత నికి నిద్రలో నడిచే అలవాటుందని తెలుసు. తెలిసి అతన్ని ఒక్కడ్నే ఎలా వదిలారు? అతనలా నడిచి వెడ్తుంటే డ్యూటీ డాక్టర్, నర్సులు, వార్డ్‌బాయిస్ ఏం చేస్తున్నారు? అంటే వీళ్ళే అతని అలవాటు గమనించి టెర్రస్‌మీదకు తీసుకెళ్ళారంటావా?"

"లేదు తన్మయీ! అతనికి నిద్రలో నడిచే అలవాటులేదు. ఇందాకనే చెప్పానుగా అతను హత్య చేయబడ్డాడని..." స్థిరంగా అంది నీహారిక.

"నీకెలా తెల్సు? అతనికి నిజంగానే ఆ అలవాటు ఉందేమో?"

"లేదు... లేదు" అంది నీహారిక మొండిగా. "అతని మరణవార్త విని నేను చాలా షాకయ్యాను. కానీ నేను ఏమాత్రం కుతూహలం ప్రదర్శించినా మణికి అను మానం వస్తుంది. అందుకే విషయమేమిటో కనుక్కోమని విశాల్‌కు పురమాయించాను. ఆ పేషెంట్ చనిపోయిన రాత్రి నేను నైట్ డ్యూటీలో ఉన్నాను. దాదాపు ఒంటిగంట వేళ బయట కలకలం విన్పించేసరికి కారిడా

ర్లోకి వచ్చిన నేను కిందకు చూసేసరికి అతను రక్తపుమడుగులో ఉన్నాడు. నీకు తెలుసా తన్మయీ! కళ్ళముందు ఓ రోగి ప్రాణాలు విడుస్తుంటే చూస్తూ నిల్చుండిపోయాను. ఆనవాలు కూడా గుర్తించలేని స్థితిలో అతనిలోని కొనప్రాణం కొట్టుకుంటుంటే ఓ మాంసంముద్ద కదులుతున్నట్టు అన్పించింది. అతన్ని వెంటనే ఆపరేషన్ రూమ్‌లోకి తీసుకువెడదామని బతిమాలాను. అతనలా కొనవూపిరితో కొట్టుకుంటుంటే కాపాడటం డాక్టర్స్‌గా మన ధర్మమని చెప్పాను. ఎవ్వరూ నా గోడు పట్టించుకోలేదు. అతను ఆత్మహత్య చేసుకున్నాడు కాబట్టి పోలీసు కేసు అవుతుందనీ, మణి వస్తేగానీ ఎలాంటి నిర్ణయం తీసుకోలేమనీ అన్నాడు డాక్టర్ సునీల్. మణి వచ్చేలోపే అతని ప్రాణం పోయింది. అతను బతికితే తమ గుట్టు ఎక్కడ బయటపడుతుందోనని భయపడ్డ మణి హాయిగా ఊపిరి పీల్చుకుని పోలీసులకు ఫోన్‌చేశాడు. పిల్లలు పుట్టకపోవడానికి తనలోని లోపమే కారణమని అర్థమైన అతనికి మతి భ్రమించిందని, దానికి నిద్రలో నడిచే అలవాటు కూడా తోడవడంతో టెర్రస్‌మీంచి దూకి ఆత్మహత్య చేసుకున్నాడని డ్యూటీ డాక్టర్ స్టేట్‌మెంట్ ఇచ్చాడు. కేసు క్లోజ్ అయిపోయింది. కానీ నాకెందుకో అందులో నిజం లేదన్పించింది. అతన్ని హత్య చేశారేమో అన్న అనుమానం వచ్చింది. విశాల్ ఆ రోగి తాలూకు అడ్రస్ సంపాదించి ఇచ్చాడు"

ఊపిరి తీసుకోవడానికి క్షణంసేపు ఆగింది నీహారిక.

"విశాల్ ఇచ్చిన అడ్రస్ తీసుకుని వెతుక్కుంటూ అతనింటికి వెళ్ళాను. అతని భార్యను చూస్తే మా వదిన గుర్తుకొచ్చింది. ఈ లోకంతో సంబంధం లేనట్టుగా ఓ గదిలో కూర్చుని ఏడుస్తోంది. ఆ అమ్మాయిని మాట్లాడించడం చాలా కష్టమైంది. అతనికి నిద్రలో నడిచే అలవాటులాంటిదేమీ లేదని, కానీ డాక్టర్ భార్గవ అలా చెప్పమని బెదిరించాడని చెప్పింది. అది కూడా అతను చనిపోవడానికి ముందే"

"అది సరే... అసలు ఆరోజు రాత్రి అతను హాస్పిటల్లో ఎందుకున్నాడు?" సందేహంగా అడిగింది తన్మయి.

"ఆ రాత్రికి ఏదో మైనర్ ఆపరేషన్ చేయాలని అది చేస్తే పిల్లలు పుట్టే ఛాన్స్ మెరుగవుతుందని చెప్పాడట డాక్టర్ భార్గవ్. దానికి తోడు రిపోర్ట్స్ ఇచ్చేస్తామని చెప్పారట. భర్త ఎంతకూ రాకపోయేసరికి ఆమెకు అనుమానం వచ్చింది. ఈలోగా డాక్టర్ భార్గవ్ ఫోన్‌చేసి నీ భర్తకు నిద్రలో నడిచే అలవాటుందని చెప్పాలనీ లేదంటే నీ భర్తను చంపేస్తామనీ బెదిరించాడట. ఆమె ఏం చేస్తుంది? తప్పనిసరి పరిస్థితిలో ఒప్పుకుంది. హాస్పిటల్లో సందడి సద్దుమణిగాక అతన్ని వీళ్ళే పైకి తీస్కెళ్ళి కిందకు తోసేశారు. పోలీసులు అతని భార్యను ప్రశ్నించినప్పుడు మిగతా కుటుంబసభ్యుల ప్రాణాలెక్కడ తీస్తారోనన్న భయంతో మా ఆయనకు నిద్రలో నడిచే అలవాటు ఉందని చెప్పడంతో శవాన్ని అప్పగించి వెళ్ళారు"

తన్మయి నిశ్శబ్దంగా ఉండిపోయింది.

నీహారిక కూడా అలసిపోయినట్టుగా సోఫాలో వెనక్కివాలి కళ్ళు మూసుకుంది. అతను కారిడార్లో అరవటం, వార్డ్‌బోయ్‌లు వచ్చి ఈడ్చుకెళ్ళటం ఆ తర్వాత కొన్ని గంటలలో అతను పైనుంచి పడిపోయి రక్తపుముద్దగా మారడం, తను ఎంత బతిమాలినా డాక్టర్ సునీల్ లక్ష్యపెట్టకపోవడం అన్నీ గుర్తొచ్చాయి. ఆ సంఘటన ఆమెకు పదే పదే గుర్తుకు వచ్చి నిద్రను దూరం చేస్తోంది.

"అంటే నువ్వు మణి చెప్పినదానికి అంగీకరించడానికి కారణమిదేనా?" అడిగింది తన్మయి.

"ఇదొక్క కారణమేకాదు. డాక్టర్ జయ

రామ్ అని బెంగుళూరులోని అమృత క్లినిక్‌లో పనిచేస్తాడు. అతనీమధ్య యాక్సిడెంట్‌లో చనిపోయాడు. దానికి కారణం కూడా డాక్టర్ మణే..."

"నువ్వు చెప్పేది...." విచిత్రంగా అడిగింది తన్మయి.

"అవును. అమృత క్లినిక్ ఆరంభించి పది సంవత్సరాలు అయిన సందర్భంగా వేడుకలు జరిగాయి గుర్తుందిగా..."

గుర్తుందన్నట్టు తలూపింది తన్మయి.

"ఆ మరుసటిరోజు పేపర్లో జయరామ్ స్టేట్‌మెంట్ వచ్చింది. ఇంపొటెన్సీ కేసులు ఎక్కువవుతున్నాయని, అలా అయితే రాబోయే కాలంలో అన్నీ కృత్రిమ గర్భధారణలు తప్ప సహజగర్భధారణలు ఉండవని అన్నాడని ఓ పత్రిక ప్రచురించింది. అది చదవగానే బెంగుళూరుకు ఫోన్‌చేశాను. జయరామ్‌తో మాట్లాడనివ్వలేదు" అంటూ తర్వాత జరిగిందంతా చెప్పింది నీహారిక.

"తన్మయీ! జయరామ్ పుస్తకంలో రాసుకున్నదీ, అన్నయ్య మరణం విషయంలో నాకున్న అనుమానాలు, మొన్న ఆసుపత్రిలో జరిగిన సంఘటన అన్నీకలిసి నేనీ నిర్ణయాలు తీసుకోవడానికి కారణమయ్యాయి. అయితే నాకీ సలహా ఇచ్చింది మాత్రం అన్నయ్య ఫ్రెండ్ విశాలే"

విశాల్ వచ్చి తనను కన్విన్స్ చేసిన సంఘటన గుర్తుకొచ్చింది ఆమెకు.

ఆరోజు అతన్ని బలవంతంగా వార్డ్ బోయ్స్ ఈడ్చుకువెళ్ళిన కాసేపటికి విశాలే వచ్చాడు.

"మేడమ్, మిమ్మల్ని డిస్టర్బ్ చేయడంలేదు కదా? "

"లేదు... రండి" అంది నీహారిక.

విశాల్ అమృతలో అడ్మినిస్ట్రేషన్ విభాగంలో పనిచేస్తున్నాడు.

"నీహారికా! ఇలా అడిగి మీ మనసు నొప్పిస్తున్నానేమో నాకు తెలీదు. కానీ అడగకుండా ఉండలేకపోతున్నాను. అరవింద్ మరణానికి కారణాలేమైనా తెలిశాయా? "

విశాల్ ప్రశ్నకు నీహారిక వెంటనే జవాబివ్వలేకపోయింది. తర్వాత నెమ్మదిగా అంది, "లేదండీ! ఆత్మహత్య కేసుగా దానినెప్పుడో క్లోజ్ చేశారుకదా"

అరవింద్‌ని తల్చుకోగానే అతని ముఖంలో విషాదం ఆవరించింది. "నీహా! నాకెందుకో అరవింద్‌ది సహజమరణం కాదనిపిస్తోంది. ఇంతకుముందు నేనిక్కడకు వస్తుంటే ఒక వ్యక్తి పెద్దగా అరుస్తున్న మాటలు విన్నాను. అవి విన్నాక ఇతనికి, అరవింద్ కేసుకు చాలా దగ్గర సంబంధం వుందనిపించింది. మీ అన్నయ్యలాంటి వారెంతోమంది ఇక్కడి ట్రీట్‌మెంట్‌కు బలవుతున్నారు. ఆ రహస్యాన్ని ఛేదించడం కేవలం నీవల్లే అవుతుంది. నీవాపని చేయగలిగితే ఎందరో అమాయకుల ప్రాణాలు కాపాడడంతోపాటు మీ అన్నయ్య ఆత్మకు శాంతి కలిగించినదానివి అవుతావు" విశాల్ స్వరంలో ఆవేశంతో పాటు మిత్రుడి మరణంపట్ల బాధ, ఆవేదన కూడా వ్యక్తమైంది.

"నేనా? " ఒకింత విస్తుపోతూనే అడిగింది నీహారిక.

"అవును. మీరే ఈ పనికి సమర్థులు" ధృడనిశ్చయంతో అన్నాడు విశాల్. "నిజానికి పేషెంట్స్ రిపోర్ట్స్ పరిశీలిస్తే విషయమంతా అర్థం అవుతుంది. కానీ ఇక్కడ రోగులకు వారి రిపోర్ట్స్ ఇవ్వడంలేదు"

"నిజమా? " నీహారిక ప్రశ్నకు ఆశ్చర్యపోవడం ఈసారి విశాల్ వంతయ్యింది.

"అదేంటి... ఓ డాక్టరు అయి వుండి మీకీ విషయం తెలీదంటే నాకు చాలా ఆశ్చర్యంగా ఉంది" అన్నాడు విశాల్.

"ఇందులో ఆశ్చర్యపోవడానికేముంది? ప్రతి రోగి తాలూకు వివరాలు అన్నీ ఫైల్ చేయబడతాయి కాబట్టి అవసరమైతే ఫైల్ ఓపెన్ చేసుకుంటాం. కంప్యూటర్‌లో ఫీడ్ చేశాక ఇక రిపోర్ట్‌లతో పనేముంది? ఒకవేళ అవసరమైతే ఫోన్‌చేస్తే వాటిని మా




దగ్గరకు పంపుతారు. నాకింతవరకే తెలుసు. రిపోర్ట్స్ ఏ రోగికీ ఇవ్వరని తెలీదు" అంది నీహారిక.

"మరి ఈ రహస్యాన్ని ఛేదించాలని మీకు అన్పించడంలేదా? " సూటిగా ప్రశ్నించాడు విశాల్.

"చెప్పండి నీహారికా! మీరు బెంగుళూరు కూడా వెళ్ళి జయరామ్‌ని కలుద్దామని ప్రయత్నించారే. ఎందుకు? మీ అన్నయ్య మరణానికి కారణమైనవారిమీద పగ తీర్చుకోవాలనేగా! మరిప్పుడు అవకాశం వస్తే సందేహిస్తారేం"

"అదేంకాదండీ. మీరు చెప్పేదాన్నిబట్టి చూస్తుంటే ఇక్కడి భద్రతాఏర్పాట్లు చాలా పటిష్టంగా ఉన్నాయని నాకు అన్పిస్తోంది. మరి నేనుమాత్రం ఏం చేయగలను? అదే ఆలోచిస్తున్నాను" తన మనసులోని సందేహాన్ని బయటపెట్టింది ఆమె.

ఆమె చెప్పింది విని తేలికగా ఊపిరి పీల్చుకున్నాడతను.

ఒకసారి అటూఇటూ చూసి ఎవ్వరూ రావడంలేదని నిర్ధారించుకున్నాక తన స్వరం బాగా తగ్గించి రహస్యం చెప్తున్నట్టుగా అన్నాడు, "అందుకు ఓ మార్గం ఉంది"

"ఏమిటది? " ఎక్సైట్‌మెంట్ ధ్వనించింది ఆమె స్వరంలో.

తాను చెప్పదల్చుకున్నదాన్ని రివైజ్ చేసుకుంటున్నట్టుగా ఒకసారి మనసులోనే పునశ్చరణ చేసుకుని అప్పుడు అన్నాడు, "డాక్టర్ తన్మయి నిరాకరించిన ప్రయోగానికి మీరు పూనుకోవడం ఒక్కటే మార్గం" నెమ్మదిగా అయినా స్పష్టంగా చెప్పాడు విశాల్.

"కానీ" సందేహంగా ఆగిపోయింది నీహారిక.

తన్మయి నిరాకరించిన ప్రయోగం తను మాత్రం ఎలా అంగీకరించగలదు? మణి చేస్తున్న అన్యాయాన్ని ప్రతిఘటించడానికి బదులు తనుకూడా వారితో కలిస్తే ఇక తన లక్ష్యం ఎలా నెరవేరుతుంది?

నీహారిక ఆలోచనలో పడటం గమనించి విశాల్ అన్నాడు, "నీహారికగారూ! మనం చేయబోయేది పాపమే కాదనను. కానీ మనం చేస్తున్న ఈ అన్యాయం మన స్వార్థ ప్రయోజనాలు ఆశించికాదు. కేవలం ప్రజాహితాన్ని దృష్టిలో ఉంచుకుని ఈ రిస్క్‌కు పాల్పడుతున్నాం. ఒక్కసారి ఆలోచించండి డాక్టర్ మణి ధనదాహానికి అరవింద్‌లాంటి ఎందరో అమాయకులు బలవుతున్నారు. మనం వారిని ఏవిధంగా కాపాడగలం? పోలీసు కంప్లైయింట్స్‌లాంటివి ఇచ్చినా మరుక్షణమే మణి నిర్దోషిగా బయటపడతాడు. అందుకే మనం అన్ని ఆధారాలు సంపాదించనిదే మణిమీద ఎలాంటి యాక్షన్ తీసుకోకూడదు. మరి మామూలు పరిస్థితిలో అది సాధ్యంకాదు. ఇక్కడ పని చేసే ప్రతి వ్యక్తిమీదా మణి నిఘా ఏర్పాటు చేస్తాడు. నా ఉద్దేశ్యం ప్రకారం మనం ఇక్కడ ఇంతసేపు మాట్లాడుకోవడం కూడా మంచిదికాదు. కానీ ఆలోచించండి. నా మటుకు ఇంతకన్నా ఉపాయం తోచడం లేదు. మనం ఈ రహస్యాన్ని ఛేదించాలంటే మీరు మణి అభిమానం సంపాదించగలగాలి. అలా జరిగిననాడు మీరు మణికి సన్నిహితులవుతారు. అప్పుడిక మీ రాకపోకల పట్ల నిఘాకానీ, అభ్యంతరాలుకానీ ఉండవు. నీహారికగారూ! అరవింద్ మరణానికి నేను కూడా బాధ్యుడినేమోనన్న బాధ నన్ను తొలిచివేస్తుంటుంది. నేను అమృతలో చూపించుకోమని వాడికి చెప్పకుండా వుండుంటే వాడు బతికేవాడేమో! నా స్నేహితుడిని పొట్టన పెట్టుకున్న మణిమీద ప్రతీకారం తీర్చుకునే అవకాశం నాకు లేక నేను మిమ్మల్ని అర్థిస్తున్నాను. ఈ పోరాటంలో నేను మీ వెంటవుండి నా సహాయసహకారాలు అందిస్తాను. మీరు, తన్మయి ఓరోజు ల్యాబ్‌లో మాట్లాడుకోవడం చూశాను. బహుశా మీ స్నేహితు

రాలు కూడా మిమ్మల్ని తప్పుపట్టకపోవచ్చు"

"ఐయామ్ సారీ!" తన్మయి మాటతో ఈ లోకంలోకి వచ్చిందామె.

చిన్నగా నవ్వి అంది, "తన్మయీ! విశాల్ చెప్పాడని నేను వెంటనే ఒప్పేసుకోలేదు. బాగా ఆలోచించాను. ఒక తప్పు సరిచేయ డానికి నేను మరొక తప్పుచేయడం ఎంతవ రకు సమంజసమో నాకు అర్థంకావడం లేదు. కానీ చివరకు ఎలాగైనా ఈ ఘోరాన్ని ఆపాలనే నిర్ణయించుకున్నాను. అందుకే మణిని కలిసి నా సమ్మతిని తెలి యచేశాను. ఇదంతా ముందే చెప్తే మీరు ఒప్పుకోరని తెలిసే చెప్పలేదు. ఇప్పుడు చెప్పు ఇంకా నామీద కోపం వుందా? నేను చేసింది తప్పంటావా? "

"ఎంతమాత్రం లేదు"

హఠాత్తుగా మగగొంతు వినిపించేసరికి ఇద్దరూ వెనక్కి తిరిగారు.

"అవును నీహా! నువ్వు చేసినదానిలో తప్పేంలేదు" మనస్ఫూర్తిగా అన్నాడు పవన్.

"హమ్మయ్య అయితే నీకు మళ్ళీ మొద ట్నుంచీ చెప్పక్కర్లేదన్నమాట" అని తన్మయి వైపుకు తిరిగి, "చెప్పు. నామీద ఇప్పుడు కోపంలేదుగా" అంది నీహారిక.

"నీహా! నువ్వు మొదటిసారి మాకు చెప్ప కుండా ఇలాంటిపని చేసినా క్షమిస్తున్నాం. ఇకమీదట నువ్వు చేసే ప్రతిపనీ మాకు తెలియాలి. ఇది నీకు అంగీకారమేనా? కాకుంటే ఇంకెప్పుడూ నీముఖం మాకు చూపద్దు" స్థిరంగా అంది తన్మయి.

పవన్‌వైపు నీ అభిప్రాయం ఏమిటన్నట్లు చూసింది నిహారిక. "నేను కూడా డిటోనే" అన్నాడు పవన్.

దాంతో ఆమెకు ప్రామిస్ చేయకతప్ప లేదు.

అనుమానాలు, సందేహాలు తొలగిపోవ డంతో ఆ ముగ్గురి మనసులు తేలిక య్యాయి.

అంతలో నీహారిక ఏదో గుర్తుకు వచ్చిన దానిలా పవన్ వంక చూస్తూ, "అదిసరే పవన్! నువ్వేంటి ఈ సమయంలో ఇక్కడు న్నావ్? కొంపతీసి ఆ వాలుకన్నుల చూపుల్లో పడి మునకలేయడం లేదుకదా" కొంటెగా అడిగింది నీహారిక.

స్నేహితుడి విషయం ఎప్పుడో గమనిం చినా అతని నోటితోనే చెప్పించాలన్నది ఆమె ఉద్దేశ్యం.

నీహారికవంక ఇబ్బందిగా చూస్తూ అన్నాడు పవన్ "ఇంకా మునకలేయడమే మిటి? ఎప్పుడో మునిగిపోతేను"

తన్మయి సిగ్గుగా తలవంచుకుంది.

ఆమె కనులలో అనురాగవర్షం కురు స్తుంటే ఆ పగడాలపెదవులమీద నవ్వుల పూలు విరగబూస్తున్నాయి.

వారిద్దరిని అలా చూస్తుంటే నీహారికకు చాలా ఆనందంగా వుంది. 'మేడఫర్ ఈచ్ అదర్'కు నిర్వచనంలా ఉన్నారిద్దరూ.

ఆ తర్వాత చాలాసేపు ముగ్గురూ ఏవో మాట్లాడుకుంటూనే ఉన్నారు.

నీహారిక వెళ్ళడానికి ఉద్యుక్తురాలు అవు తుండగా ఆమె చేతిని తన చేతిలోకి తీసు కుని అంది తన్మయి "నీహా! నువ్వు చేపట్టి నపని సామాన్యమైనది కాదు. ఎంతో క్లిష్ట తరమైనది. ఒకరకంగా వెళ్ళివెళ్ళి పులి నోటిలో తలపెడ్తున్నట్టే లెక్క. ఈ పోరా టంలో నువ్వు ఒంటరిదానివికాదు! మేమి ద్దరం నీకు తోడుగా ఉన్నామని మర్చిపోకు. నీకేసమస్యవచ్చినా మేమున్నామని గుర్తుం చుకో"

నీహారిక వెళ్ళాక కూడా తన్మయిని అవే ఆలోచనలు వేధించాయి. అయితే ఇప్పు డామె మనసు కొంచెం తేలికపడింది.

నిజంగా మనసు పసిపాపలాంటిది.

కాసేపు ఆనందం... మరి కాసేపు విషాదం...

ఒక్కోసారి ఎంతో ఉత్సాహంగా ఉరకలే స్తుంది.





అంతలోనే అకారణంగా ముడుచుకుపో తుంది.

ఇదంతా ఏమిటని ప్రశ్నిస్తే ఎదుటివారి మీద ఉన్న ప్రేమ, ఆప్యాయత అని సమాధానమిస్తుంది.

ఇలాంటి భావనలకు ఎవ్వరూ అతీతులు కారు.



అమృత క్లినిక్ పేరు మార్మోగిపోతోంది.

పుత్రుడు పున్నామ నరకంనుంచి తమను తప్పిస్తాడనే భావన మనలో అధికశాతం మంది నేటికీ విశ్వసిస్తారు. అలాగే వృద్ధాప్యంలో తమ ఆలనాపాలనా చూసేది కూడా మగపిల్లలేనన్న భావన వారి రక్తంలో జీర్ణించుకుపోయింది. ఆ విధంగా పుత్రసంతానం లేని దంపతుల పాలిటి ఈ ప్రయోగం వరమైంది.

పుత్రసంతానం కోసం ఎంత డబ్బైనా ఖర్చుచేయడానికి వెరవని దంపతులంతా డాక్టర్ మణిని సంప్రదించసాగారు. ఆవిధంగా డాక్టర్ నీహారికకు పనివత్తిడి పెరగడం మాత్రమే కాదు మణి అభిమానం కూడా సంపాదించుకోగలిగింది.

ఈ ప్రయోగం గురించి విన్న మహిళా సంఘాల వారు స్త్రీ హత్య మహా పాపమని, హేయమని నిరశనలు ఆరంభించారు. ఓ మహిళా లాయర్ భారతదేశంలో లింగనిర్ధారణ పరీక్షలను నిషేధించారు కాబట్టి ఇది చట్టబద్ధంకాదని కోర్టులో కేసువేసింది. వీటన్నింటిని మణి తనకు అనుకూలంగా మలుచుకున్నాడు. ఈ ఆందోళనలవల్ల జరిగిన మేలు మణికే. ఎందుకంటే ఇవన్నీ అమృత పేరునూ, అక్కడ జరిగిన ప్రయోగాన్ని గురించీ మరింతగా ప్రజలు తెలుసుకునేలా చేశాయి.

పి.జి.డి చట్టబద్ధం కాదన్నదానికి మణి తరుపు లాయర్ చాలా తెలివిగా వాదించాడు. పి.జి.డి. పద్ధతిలో పిండాలను లేబొరేటరీలోనే ఫలదీకరణ చెందించి తర్వాత లింగనిర్ధారణ జరుపుతున్నారేకాని మహిళ గర్భంలో ప్రవేశపెట్టాకకాదు. అంటే సదరు మహిళ గర్భంలో పిండాన్ని ప్రవేశపెట్టిన తర్వాత ఎలాంటి లింగనిర్ధారణ పరీక్షలు జరపటంలేదు కాబట్టి లింగనిర్ధారణ చట్టం పి.జి.డి.కి వర్తించదు అని వాధించాడు.

ఈ విషయం గురించి లోతుగా అధ్యయనం చేయనిదే ఎలాంటి చట్టం చేయలేమని కోర్టు కూడా అభిప్రాయపడింది.

ఇవన్నీ తేలేలోపు మణి తన లక్ష్యం చేరుకోగలుగుతాడు.

దీన్నంతా గమనిస్తున్న రాజాభూపతి విషయం పూర్తిగా తెలుసుకుని పరమానంద భరితుడయ్యారు. డాక్టర్ కృష్ణప్రసాద్‌తో మాట్లాడాక దాదాపుగా ఆయన తన ఆలోచనను విరమించుకున్నారు. కాని ఇప్పుడీ కొత్త ప్రయోగం తిరిగి ఆయనలో ఆశలు రేకెత్తించింది. వెంటనే అమృతకు ఫోన్ చేసి డాక్టర్ మణితో మాట్లాడి అపాయింట్‌మెంట్ తీసుకున్నారు.

ఈ విషయం తెలిసి నాగేంద్ర చాలా అభ్యంతరం తెలియజేశాడు.

నాగేంద్ర రాజాభూపతి భార్యకు స్వయాన అన్న. ఎప్పటినుంచో బావగారి

ఆస్తిమీద కన్నుపడిఉంది. రాజాకుమార వర్మకు తన కూతురినిచ్చి పెళ్ళి చేయాలను కున్నాడు. కాని రాజాభూపతి మాట ఎలా వున్నా మేనకోడలిని ఇంటికోడలిగా చేసుకో వడం నాగేంద్ర చెల్లెలికీ ఇష్టంలేదు. ఆవి ధంగా కోటలో పాగవేసే అవకాశం తప్పిపో యింది. కుమారవర్మకు కూతుళ్ళు తప్ప కొడుకులు కలగకపోవడంతో నాగేంద్ర అమితంగా ఆనందించాడు. తన మనవడిని దత్తత ఇవ్వాలని ప్రయత్నిస్తున్నాడు. ఈ విషయం గురించి ఆల్రెడీ చెల్లెలితో సంప్ర దించి ఆమెను ఒప్పించడం కూడా జరిగిపో యింది. ఎటొచ్చి రాజాభూపతి ఇంకా ఒప్పు కోలేదు.

ఇప్పుడు ఈ ప్రయోగమేదో అతని పాలిటి శాపంలా పరిణమించింది. అందుకే బావగారికి ఎంతో నచ్చచెప్పప్రయత్నిం చాడు. కానీ రాజాభూపతి పట్టుదల ముందు అతను తలవంచక తప్పలేదు. ఒక సారి ప్రయత్నిస్తే తప్పేం వుందని రాజాభూ పతి వాదం.

సరిగ్గా అన్న టైంకు అక్కడికి చేరుకు న్నారు రాజాభూపతి, ఆయన కొడుకు, కోడలు. ఈ వ్యవహారమంతా ఆయన కోడ లికి కూడా పెద్దగా ఇష్టంలేదు. ఇతరత్రా కారణాలేమిలేవు గానీ, ఇందువల్ల ఉప యోగం ఉండదని ఆమె నమ్మకం.

రిసెప్షనిస్ట్ చూపించిన రూమ్‌వైపు కది లారు అంతా.

మణి రూమ్‌లోకి ప్రవేశించాక, నమస్కా రాలవీ అయ్యాక అసలు విషయానికి వచ్చారు రాజాభూపతి. ఎందుకో ఆయనకు డాక్టర్ కృష్ణప్రసాద్‌మీద కలిగిన గౌరవం మణిమీద కలగలేదు. దానికి కారణమేమీ లేదు.

"మేము వార్తాపత్రికలలో మీ ప్రకటన లవీ చూసి వుంటిమి. ఆ విషయం మాట్లా డేందుకే ఇచ్చటకు ఏతెంచితిమి" దర్పంగా, గంభీరంగా ఉంది రాజాభూపతి స్వరం.

ఆ భాషకు ఒక్కసారి ఉలిక్కిపడ్డాడు డాక్టర్ మణి. ఆ తర్వాత అర్థమైంది వచ్చి నవాళ్ళు రాజ వంశానికి చెందినవారని. మనిషిని చూడగానే వీరివల్ల తన క్లినిక్‌కు ఏమాత్రం లాభం ఉంటుందని ఆలోచించే వ్యక్తి అతను.

"చెప్పండి... నేను మీకేం సాయం చేయ గలను?" నమ్రతగా అడిగాడు డాక్టర్ మణి. మనిషి హోదా, డబ్బు చూసి గౌరవం ఇవ్వడం కళైమణి అలవాటు. డబ్బులేనివారు అతని దృష్టిలో పూచికపు ల్లతో సమానం.

అసలు డబ్బు, పరపతి ఉన్నవారిని చూస్తేనే అతని స్వరంలో తెలీకుండానే ఆ నమ్రత వచ్చేస్తుంటుంది. ఎందుకంటే మణి ఆలోచించేది కేవలం డబ్బు గురించే. ఆ డబ్బు వుంటే గౌరవం అదే వస్తుందని నమ్ముతాడు.

"ఈమె మా కోడలు గాయిత్రీదేవి. ఈమెకు ఇద్దరూ పుత్రికలే కలిగారు. ఆడపి ల్లలు అనిన ఎప్పటికైనా ఒక ఇంటికి వెళ్ళ వలసిన వారే కదా! మాకున్నది ఒక్కడే పుత్రుడు. మా పుత్రుని తర్వాత మా వంశం నిర్వీర్యమైపోవునేమోనన్న బాధ మమ్మల్నెంతో ఆవేదనకు గురిచేస్తోంది. మాకిక వారసులు కలగరన్న నమ్మకంతో మా దాయాదులు కుట్రలు ఆరంభించారు. మా ఏలుబడిలో ఉన్న ప్రజలు కూడా ఎంతో చింతాక్రాంతులై ఉన్నారు. ఈ సమ యంలో మీ ప్రకటన మాకు ఊపిరిని చ్చింది. ఊరటనిచ్చింది. మీ ప్రయోగంలో మాకో వంశోద్ధారకుడిని ప్రసాదించగలిగితే మీము జన్మంతా రుణగ్రస్థులమై ఉందుము. ఇందుకు ఎంత ధనము ఖర్చు అయినా మేము సందేహించము" రాజాభూపతి స్వరంలో గంభీరంతోపాటు ఆవేదన కూడా వినవచ్చింది.

రాజాభూపతి చెప్పింది వినగానే మణి తన ఆనందాన్ని కంట్రోల్ చేసుకోవడానికి





చాలా కష్టపడాల్సివచ్చింది.

"భూపతిగారూ..." పిలిచాడు మణి.

"రాజాభూపతి..." సరిచేస్తున్నట్టుగా అన్నారాయన. ఇసుమంత ఆగ్రహం కూడా ఆయన స్వరంలో పలికింది.

"క్షమించాలి రాజాభూపతిగారూ! మీ కోరిక సమంజసమైనదే. అంతే కాదు మీలాంటి ఘనచరిత్ర కలిగిన వంశం నిర్వీర్యం అయిపోవడం మీకే బాధగా ఉంటే మాకు ఎంతటి ఆవేదన కలుగచేస్తుందో నేను అర్థంచేసుకోగలను. మేము కనుగొన్న పద్ధతిద్వారా మీ కోరిక తప్పక నెరవేరుతుంది. అందుకు కావాల్సిన ఏర్పాట్లు, ఇతర విషయాలు మీరు డాక్టర్ నీహారికతో మాట్లాడండి" అని చెప్పి ఫోన్‌లో నీహారికకు విషయమంతా చెప్పాడు.

రాజాభూపతి పరివారం వార్డ్‌బోయ్ వెంటరాగా నీహారిక రూమ్‌వైపుకు దారితీశారు.

ఇప్పుడు ఆయన మనసు కొంచెం ప్రశాంతంగా ఉంది.

రాజాభూపతి వచ్చి వెళ్ళాక డాక్టర్ మణి మనసు ఆనందంతో నిండిపోయింది.

మరోపక్క అమృత క్లినిక్ పేషెంట్లతో కిటకిటలాడిపోసాగింది. మామూలువాళ్ళు ఎంతమంది వచ్చినా ఫీజు కడతారు తప్పితే అంతకన్నా పెద్ద ప్రయోజనమేమీ ఉండదు. కాని రాజాభూపతి వంటి వారివల్ల క్లినిక్ ఇమేజ్ మరింత పెరుగుతుంది. డొనేషనూ లభించే అవకాశం ఉంది.

నీహారిక పనిపట్ల మణికి సంతృప్తిగా ఉంది. నమ్మకస్థురాలన్న గురి కుదిరింది. ఆమెకు కావాల్సింది కూడా అదే.

రాజాభూపతిగారి కుటుంబంతో వివరంగా మాట్లాడి పంపింది నీహారిక. వాళ్ళను అంతగా ఆశపెట్టడం ఆమెకు బాధగానే ఉంది. కానీ తప్పదు. ఒక్కోసారి కొందరు అమాయకులను తెలిసీ కష్టపెట్టాల్సి వస్తుంది. ఇతరుల మేలుకోసం ఇలా కొందరు బలికావడం అనివార్యం.

★ ★ ★

డాక్టర్ మణి ప్రకటనలకు జనం బాగా స్పందిస్తున్నారు.

నీహారిక ఊపిరిసలపని పనులలో కూడా తన లక్ష్యం మరిచిపోలేదు.

ఓరోజు కూర్చుని అనుమానితుల పేర్లు కాగితంమీద రాసుకుంది.

డాక్టర్ మణి.

డాక్టర్ సునీల్.

డాక్టర్ భార్గవ్.

ఇప్పటివరకూ ఈ ముగ్గురే ఆమెకు అనుమానితులుగా కన్పించారు. డాక్టర్ మణి అమృతపాలీ క్లినిక్ చీఫ్. డాక్టర్ సునీల్ ఆయనకు సన్నిహితుడు ఇక డాక్టర్ భార్గవ్. ఐ.వి.ఎఫ్ విభాగానికి హెడ్. మగవాళ్ళ కేసులు హ్యాండిల్ చేసేది అతనే. అంటే తన అనుమానం నిజమైతే ఇండ్యూస్డ్ ఇన్‌ఫెర్టిలిటీకి డాక్టర్ భార్గవే కారకుడు.

సెల్ రింగ్ అవడంతో ఈ లోకంలోకి వచ్చి ఒక బటన్‌ప్రెస్ చేసింది.

"అక్కా! నేను అభిరామ్‌ని..." అన్నాడు అటునుంచి.

"ఆ... చెప్పమ్మా! ఎలావున్నారు అందరూ? " ఆప్యాయంగా అడిగింది నీహారిక.

"మేము బానే వున్నాము. నేనిప్పుడు హైద్రాబాద్ వచ్చివున్నాను. చెప్పాడు అభిరామ్.

"మరి వచ్చి నన్ను కలవలేదే? "

"లేదక్కా! ప్రస్తుతానికి ఇంటి దగ్గర కాపలాతీసేశారు. అన్నయ్య కేసు క్లోజ్ అయిపోయిందని అంతా నమ్మారనే భ్రమలో ఉన్నారు. కాబట్టి మనం వాళ్ళకు అనుమానం రాకుండానే నడుచుకోవాలి. అందుకే రాలేదు" చెప్పాడు అభిరామ్.

"అది సరే... ఇంతకీ నువ్వెందుకొచ్చినట్టు? " అనుమానంగా అంది ఆమె.

"ఈమధ్య అన్నయ్యకు రావాల్సిన డబ్బు

తీసుకోవడానికి బెంగుళూరు వెళ్ళినప్పుడు డాక్టర్ వివేక్‌ని కలిశాను. అన్నయ్య పోయి నందుకు తను చాలా బాధపడ్డారు. తర్వాత ఆయన కొన్ని రిపోర్ట్స్ తాలూకు జిరాక్స్ కాపీలు నాకు ఇచ్చి ఎలాగైనా మీకు అంద జేయమని చెప్పారు. తనమీద కూడా అను మానం రావడంతో ఇక్కడ జాబ్ మానేసి స్టేట్స్ వెళ్ళిపోతున్నారట! వెళ్తూ మనకు చేసిన సహాయమిది. ప్రస్తుతం అవి నా దగ్గరే ఉన్నాయి. నీకెలా అందించాలో చెప్తే నేను వాటిని నీదగ్గరకు పంపిస్తాను" అభిరామ్ స్వరంలో ఏవిధమైన ఎక్సైట్ మెంట్ లేదు. తాను అనుకున్న పని తాను చేసుకుపోయే ధృఢచిత్తం కలవాడిలా మాట్లాడుతున్నాడు.

"అదికాదు అభి! అసలు వివేక్‌కి నా గురించి ఎందుకు చెప్పావ్? "

"డాక్టర్ వివేక్‌కు నేను చెప్పలేదు. ఆరోజు యాక్సిడెంట్ అయినప్పుడు అన్న య్యను చూడటానికి ఆయన కూడా వచ్చారు. వాళ్ళిద్దరూ పర్సనల్‌గా ఏదో మాట్లాడుకున్నారు. బహుశా ఇదంతా దాని ఫలితం కావచ్చు"

నీహారిక సందేహంగా అడిగింది, "అంటే వివేక్‌కు నా గురించి అంతా తెలుసా? "

అభిరామ్ చిన్నగా నవ్వాడు. "లేదక్కా! నీకా అనుమానం అక్కర్లేదు... అతను ఆ రిపోర్ట్స్ నా చేతికిస్తూ ఏమన్నాడో తెలుసా? "

"ఏమన్నాడు? " కుతూహలంగా అడిగిం దామె.

"జయరామ్ పేపర్‌కి స్టేట్‌మెంట్ ఇచ్చా డనగానే పాజిటివ్‌గా స్పందించిన వ్యక్తి నీహారిక ఒక్కత్తే... ఇంకా ఎవరైనా ఉన్నా రేమో మాకు తెలీదు. ఈ విషవలయాన్ని ఛేదించాలని ఆశపడిన మీ అన్నయ్య తిరిగి రాని లోకాలకు వెళ్ళిపోయాడు. నాకంతటి తెగువ, ధైర్యం లేవు. ఎప్పటికైనా దీన్ని ఎదుర్కొనేది ఆమే అనిపిస్తోంది, బహుశా అందుకోసమే మణి దృష్టిలో మంచి పేరు సంపాదించేందుకే ఈ కొత్త ప్రయోగానికి పూనుకొని ఉండచ్చు. ఇవన్నీ నా ఊహలే... ఏది ఏమైనా ఈ రిపోర్ట్స్ ఆవి డకు అందచెయ్యి అన్నారు. సో! ఇప్పుడు నీ సందేహాలు తీరినట్టేగా"

ఆమె తేలిగ్గా ఊపిరిపీల్చుకుంటూ అంది "ఓకే అభి! నిజానికి నాకేదో అవుతుందన్న భయంతో నేనిలా మాట్లాడటంలేదు! నా లక్ష్యం సాధించేవరకూ ఏమి కాకూడదనే ఇలా మాట్లాడాను. ఎనీ హౌ థాంక్యూ! పోతే వాటిని తీస్కెళ్ళి నే చెప్పిన చోట ఇచ్చెయ్యి. నేను తర్వాత తీసుకుంటాను" చెప్పింది నీహారిక.

"అలాగే అక్కా! వీలైతే వెళ్ళేలోపు కలు స్తాను. లేదంటే జాగ్రత్తగా ఉండు" అని ఫోన్ కట్ చేశాడు అభిరామ్.

నిజానికి అప్పటికప్పుడు వెళ్ళి ఆ రిపోర్ట్స్ ఏమిటో చూడాలని చాలా ఆత్రంగా ఉందా మెకు. కాని డ్యూటీ టైమ్‌లో బయటకు వెడితే అనుమానం వస్తుందన్న ఉద్దేశ్యంతో తన ఆలోచన విరమించుకుంది. తిరిగి తన వర్క్‌మీద ఏకాగ్రత చూపేందుకు ప్రయ త్నించసాగింది.

అనుమానితుల గురించి పూర్తి సమా చారం సేకరించింది. అంటే వాళ్ళ ఇష్టాలు, అనిష్టాలు ఇలాంటివి. మనిషన్నాక బలహీ నతలు సహజంకాబట్టి ఆ ముగ్గురి బలహీ నతలు కూడా కనుక్కుంది. వాటిమీదే దెబ్బ కొట్టదలుచుకుంది ఆమె.

డాక్టర్ మణి బలహీనత 'అమృతపాలీ క్లినిక్' క్లినిక్ ఛీఫ్‌గా వచ్చే పేరు ప్రతిష్టలు, దాంతోపాటు వచ్చే డబ్బు. సో! ఆవిధంగా మణి బలహీనతమీద పి.జి.డి. ద్వారా విజయం సాధించినట్టే.

డాక్టర్ సునీల్. ఆయన బలహీనత 'అంకిత'.

డాక్టర్ భార్గవ్‌కు ఆడగాలి సోకితే చాలు... విపరీతంగా ఆడపిచ్చి ఉందని,

లేడీ పేషెంట్లతో చాలా అతిగా ప్రవర్తిస్తుంటాడని హాస్పిటల్‌లో చెప్పుకుంటూ ఉంటారు.

అంటే తర్వాత తాను చేయాల్సింది అంకితను కలవాలి. అంతకన్నా ముందు వివేక్ పంపించిన రిపోర్ట్స్ చూడాలి అనుకుంటూ క్యాబిన్‌లోంచి బయటకు వచ్చింది.

నీహారిక బయటకు వస్తుండగా సునీల్ లోపలికి ప్రవేశించాడు. పక్కనే ఓ అమ్మాయి ఉంది. పోలికలు చూస్తుంటే ఆ అమ్మాయి సునీల్ కూతురులానే ఉంది. డాక్టర్ సునీల్ ఏకైక బలహీనత కూతురు అంకిత. ఆమెకోసం ఏమైనా చేస్తాడు.

వెంటనే విశాల్‌కు ఫోన్ చేసి ఇది చెప్పింది. అంకిత గురించి అన్ని వివరాలు తెలుసుకోమని చెప్పి తను తన్మయి ఇంటివైపుకు కారు పోనిచ్చింది. తన్మయి ఇంటి గుర్తులు చెప్పి రిపోర్ట్స్ అక్కడ ఇవ్వమని అభిరామ్‌కు చెప్పింది.

ఆ పార్శిల్ తీసుకుని, అక్కడే ఓపెన్ చేసింది. అది ఓపెన్ చేస్తుంటే ఆమె గుండె వేగం రెట్టింపుఅయ్యింది. చేతులు వణికాయి. వాటిని చూస్తుంటే ఆమె ముఖం రక్తం లేనట్టుగా పాలిపోయింది.

ఆ రిపోర్ట్స్ ఇండ్యూస్డ్ ఇన్‌ఫెర్టిలిటీకి సంబంధించినవి.

పేషెంట్లు అమృతకు వచ్చినప్పుడు టెస్ట్ చేయించుకున్న రిపోర్ట్ తర్వాత అమృతలో మందులు వాడిన తర్వాత వచ్చిన మార్పులకు సంబంధించిన వివరాలు ఉన్నాయి. అయితే ఏ మందులు వాడారు? కౌంట్ ఎంత తేడా వచ్చిందిలాంటి వివరాలు లేవు. అయినా సరే ఈ సమాచారం ముందు ముందు బాగా పనికివస్తుంది అంటే ఇక్కడి రిపోర్ట్స్ పరిశీలిస్తే కొంతవరకు సమాచారం దొరకచ్చు

నీహారికకు చాలా ఉత్సాహంగా ఉంది. దాంతోపాటు ఏదైతే అదవుతుంది లెమ్మన్న తెగింపు కూడా మొదలైంది. అందుకే ఇప్పుడు దీని గురించి భయపడటంలేదు.

విశాల్ అంకిత గురించిన వివరాలు అందచేశాడు.

వయసు: 22 సంవత్సరాలు.

చదువు: మెడిసిన్.

మనస్తత్వం: చాలా ఫాస్ట్. అయినా బాగా చదువుతుంది.

థ్రిల్స్, ఛాలెంజ్‌లతో జీవితం సాగిపోవాలనుకునే వ్యక్తి, పట్టుదల చాలా ఎక్కువ. తను అనుకున్న పని జరిగితీరాలనుకునే మనిషి. ఎవ్వర్నీ లెక్కచేయదు.

మిగతాదంతా చదవటం నీహారికకు విసుగనిపించింది. అయితే చిట్టచివరి వాక్యం ఆమెని చాలా ఆకర్షించింది. ప్రస్తుతం ఓ అబ్బాయిని ప్రేమిస్తోంది. అతను అంకితకు సీనియర్. కాకపోతే స్టేటస్ డిఫరెన్స్ వాళ్ళకు ఓ పెద్ద సమస్య అయ్యింది. ముఖ్యంగా అంకిత ఎన్నిసార్లు ప్రయత్నించినా అతని సమాధానం 'నో' అనే వస్తోంది.

మరుసటిరోజు కాలేజీలో అంకితను కలిసింది డాక్టర్ నీహారిక.

"హల్లో అంకితా!" చిరునవ్వుతో పలకరించింది నీహారిక.

తనను పలకరించింది ఎవరో తెలీకపోయినా మర్యాదకోసం ఆగి తలెత్తి చూసి "హల్లో" పొడిగా అంది అంకిత.

"మీతో కొంచెం మాట్లాడాలి"

మరొకరయితే నాతో మీకేం మాటలనేది. కాని నీహారికను చూసి ఆ మాట అనలేకపోయింది ఎందుకనీ అంటే బహుశా ఆమెకు కూడా జవాబు తెలీకపోవచ్చు

"చెప్పండి" తెచ్చిపెట్టుకున్న సౌమ్యతతో అంది అంకిత.

"ఇక్కడ కాదు. పదండి అలా కూర్చుని మాట్లాడుకుందాం" కాలేజీ గ్రౌండ్స్‌లోకి దారితీసింది నీహారిక.

అంకిత ఆమెను అనుసరించింది. మొదట హలో! చెప్పి వెళ్ళిపోదామను

కుంది. కాని ఇదంతా ఆమెకు థ్రిల్‌గాను, ఆసక్తిగాను అనిపించసాగింది.

"ఇప్పుడు చెప్పండి. ఏం మాట్లాడాలను కుంటున్నారు నాతో? "

"చెప్తాను! ఈలోగా మీరు నేను అడిగే ప్రశ్నలకు సమాధానం చెప్పాలి"

నీహారిక మాటలకు అంకిత తలెత్తి సూటిగా చూసింది. ఆ చూపులు చురక త్తుల్లా వున్నాయి. ఎందుకంటే ఎవరైనా ఆఖరకు కన్నతండ్రి అయిన సరే ఆమె చెప్పినప్పుడే ఏదైనా వినాలి తప్ప ఆమెను ప్రశ్నించకూడదు.

"చూడండి అంకితా! నేను మీకు శత్రువు నికాదు. మీరు అలా భావిస్తే మనం ఫ్రీగా మాట్లాడుకోలేం. నన్ను మీ సిస్టర్ అనుకుని ఫ్రీగా ఫీలవ్వండి"

చిరునవ్వుతో చెప్పింది డాక్టర్ నీహారిక.

ఎదుటి వ్యక్తి ముఖకవళికలను ఖచ్చి తంగా చదవగలగడం నీహారికకు వెన్నతో పెట్టిన విద్య. అందుకే అంకితతో అలా అంది.

ఆ మాటలకు అంకితలో థ్రిల్ చచ్చి పోయి విసుగుచోటుచేసుకుంది.

"మీరెవరో నాకు తెలీదు. ఓ అపరిచితు రాలు వచ్చి నాతో మాట్లాడాలి అంటే నిజా నికి ముందే నేను కాదనాలి. కాని ఎందుకో మిమ్మల్ని చూస్తే 'నో' అనాలన్పించలేదు. కాని ఇప్పుడు అసలు విషయం చెప్పకుండా ఫ్రీగా ఉండండి! సిస్టర్‌లా ఫీలవ్వండి! నేను మీకు శత్రువునికాదు! వాట్ ఈజ్ దిస్ నాన్‌సెన్స్" అంకిత ముఖంలో చికాకు, అస హనం తొంగిచూశాయి.

యూ ఆర్ రైట్ అన్నట్టు తలూపింది నీహారిక.

"నువ్వు చెప్పినదంతా నిజమే. కాకపోతే నీ ప్రేమలో సఫలీకృతం కావాలంటే నేను అడిగిన వాటికి జవాబు చెప్పకతప్పదు" అంకిత ముఖంలోకి సూటిగా చూస్తూ, మారుతున్న ఆమె భావాలు గమనిస్తూ మెల్లగా చెప్పింది డాక్టర్ నీహారిక. ఆమెను ఎలా హ్యాండిల్ చేయాలో ముందే ప్రిపేర్ అయివుండటంవల్ల నీహారికకు అంకితతో మాట్లాడటం సరదాగానే వుంది.

అంతవరకు వున్న ధైర్యం కొంచెం సడలి పోయి బెరుకుగా చూసింది అంకిత. అయితే కొద్దోగొప్పో మనోబలం ఉంది కాబట్టి తన భయం బయటపడకుండా జాగ్రత్తపడింది. అసలు నీహారిక 'ప్రేమ' విషయం ప్రస్తావించగానే అంకిత మొదట ఉలికిపడింది. ఆ తర్వాతే భయం మొద లైంది.

నీహారిక చిన్నగా నవ్వుతూ, "సో! మనం ఫ్రీగా మాట్లాడుకుందామా? " అంది.

"మొదట మీరెవరు? నా ప్రేమ విషయం మీకెలా తెలుసో చెప్తే కాని నేను మీ ప్రశ్నలకు సమాధానం చెప్పను" ఈసారి మొండిగా అంది.

"నిజంగా ఆ విషయం తెలుసుకోవటం ముఖ్యమనుకుంటే నీ ప్రేమ గురించి ఎలా తెలిసిందో చెప్తాను. నువ్వు డాక్టర్ సునీల్ కూతురివి. మాకు 'అమృత'లో నువ్వు కన్పించావు. నిన్ను ఫాలో అయి విష యాలు కనుక్కున్నాం. 'ఎందుకిదంతా? ' అని అడగకు. చెప్పానుగా దానికి సమా ధానం చెప్పటం కుదరదని. పోతే నీ ప్రేమ ఫలించాలంటే మాత్రం నువ్వు నాకు సహ కరించక తప్పదు. ఎందుకంటే" అని ఒక్క క్షణం ఆగి పూర్తి చేసింది. "నువ్వు ప్రేమి స్తున్న ప్రవీణ్ నా తమ్ముడు కాబట్టి"

ఆ మాటకు అంకిత ఎంత షాకయ్యిం దంటే ఆమె కోలుకోవడానికి పది నిము షాలు పట్టింది.

దాదాపు పదినిమిషాలపాటు నీహారిక ఏమీ మాట్లాడలేదు.

ఆ వాక్యం అంకితమీద బాగా పనిచే సింది. ఆమెలో చాలా మార్పు వచ్చింది. కాబోయే ఆడపడుచుతో తాను మాట్లాడుతు న్నానన్న భావన ఆమెలో సిగ్గులు పూయిం





చింది. అంతే! ఆ చెక్కిళ్లు కెంపులయ్యాయి. తల కొంచెం వంచుకుని "ఐయామ్ సారీ నండీ! మీరెవరో తెలీక..." ఆ పైన మాట పూర్తిచేయలేకపోయింది అంకిత. మును పటి చిరాకు, అసహనం, కోపం ఇప్పుడు మచ్చుకైనా ఆమెలో లేవు.

ఒక్కోసారి నిజం చెప్పటంకన్నా అబద్ధం చెప్తేనే పని సులువు అవుతుందన్నమాట. నీహారిక పెదవులమీద సన్నని దరహాసం విరిసింది.

విశాల్ ఆమెకు కవర్ ఇస్తూ ఈ అమ్మాయి నీకు బాగా హెల్ప్ చేస్తుంది అన్నాడు. అతనేదో కాజువల్‌గా అన్నాడను కుంది. మొత్తం సమాచారంలో అంకిత ప్రేమలో పడింది అన్న వాక్యం ఒక్కటే నీహారికను ఆకర్షించింది. తర్వాత విశాల్ ఫోన్‌చేసి అసలు విషయం చెప్పాడు. ప్రవీణ్ విశాల్‌కు పెద్దమ్మ కొడుకు. అందుకే తన తమ్ముడు అని నీహారిక ధైర్యంగా చెప్పేసింది. ఒకవేళ ప్రవీణ్‌కు అసలు విషయం తెలిసినా విశాల్ సర్దిచెప్ప గలడన్న నమ్మకం ఆమెకు ఉంది.

నీహారిక ముఖం కొంచెం సీరియస్‌గా పెట్టి, "ఏమమ్మా మరదలా! ఇంకా ఏమైనా డౌట్స్ వున్నాయా? " అని అడిగింది.

అంకిత ఖంగారుపడుతూ... "లే లేదండి. మీరు ఎవరో తెలీక అలా మాట్లాడాను. మీకేం కావాలో అడగండి చెప్తాను" అంది మెల్లగా.

నీహారిక లేని గాంభీర్యం తెచ్చుకుంటూ "చూడమ్మాయ్! మావాడు నీకింతవరకు తన అంగీకారం తెలియజేయలేదటగా? " చీకట్లో బాణం వదిలింది.

"అవునండీ!" అంది అంకిత దిగులుగా.

నిజానికి అంకిత ప్రవీణ్‌ను సిన్సియర్ గానే ప్రేమిస్తోంది. కాని ప్రవీణ్‌నుంచే ఎలాంటి రెస్పాన్స్ లేదు. ఆమె మరీ పట్టు బడితే, 'మనమధ్య స్టేటస్ డిఫరెన్స్ ఉంది. అందుకని అలాంటి ఆశలేం పెట్టుకోకు. మీ ఇంట్లో తెలిస్తే గొడవలవడం, మీ వాళ్లు వచ్చి మమ్మల్ని బెదిరించడం ఇలాంటివన్నీ నా కిష్టంలేదు. నా తల్లిదండ్రులను బాధపె ట్టడానికి, అవమానించడానికి నేను సిద్ధంగా లేను. నామీద ఎలాంటి ప్రేమ పెంచుకో వద్దు అన్నాడు. ప్రవీణ్ అంత ఖచ్చితంగా చెప్తాడని అంకిత ఊహించలేదు.

ప్రవీణ్ సమాధానం విని అంకిత డీలాప డిపోయింది. ప్రేమకోసం సర్వం త్యాగం చేసినవారి కథలు విన్నప్పుడు, చదివిన ప్పుడు ఇదంతా ట్రాష్ అని కొట్టిపడేసేది. అలాంటి సీన్స్ విన్నా, చదివినా, చూసినా ఆమెకు నవ్వొచ్చేది. కాని ఆ బాధ అనుభ వంలోకి వచ్చాక తెలుస్తోంది. అంకితకు తన బాధనంతా ఎవరికైనా చెప్పుకోవాల నుంది. కాని ఎలా? ఒకప్పుడు తన ఫ్రెండ్స్‌ను వేళాకోళం చేసిన ఆమె ఇప్పుడు వారి దగ్గరకు వెళ్ళి తన ప్రేమను గురించి చెప్పలేదుగా. జాగ్రత్తగా గమనిస్తే ఈమధ్య ఆమె మరింత డల్‌గా వుంటోందన్న విషయం ఎవరికైనా అర్థమవుతుంది. కారణం ఆమె తండ్రి పెళ్ళి ప్రయత్నాలు మొదలెట్టటమే. అప్పటినుంచి తన సమస్య ఎవరితోనైనా చర్చించి వారి సలహా అడగా లన్పిస్తుంది. ఆ సమయంలో నీహారిక తాను ప్రవీణ్ అక్కయ్యనని రావడం నిజంగా ఆమె తనకేదో గుప్తనిధి దొరికినం తగా సంబరపడిపోతోంది.

"అంకితా! ప్రవీణ్ నీ విషయమంతా చెప్పాడు. నేను అన్ని విషయాలు దృష్టిలో పెట్టుకుని వాడితో ఓ విషయం చెప్పాను. అదేమంటే మొదట ఆ అమ్మాయిది సిన్సి యర్ ప్రేమ అవునో కాదో టెస్ట్ చేస్తాను అని. మావాడు కూడా అందుకు ఒప్పుకు న్నాడు. సో! నీ ప్రేమ ఫలించాలంటే నేను పెట్టే చిన్న టెస్ట్‌లో నువ్వు పాసవ్వాలి"

"ఏం చేయాలండీ? " అని అడిగి ఒక్క క్షణం ఆగి, "నేను ఈ టెస్ట్‌లో పాసైతే ప్రవీణ్ నా ప్రేమను అంగీకరిస్తాడా? "

అంది అంకిత.

"డెఫినెట్‌గా! అందులో నీకెలాంటి సందే హాలు అవసరం లేదు" వాగ్దానం చేస్తున్న ట్టుగా ఆమె చేతిలో చేయివేసి చెప్పింది నీహారిక.

"అంకితా! మీ నాన్నగారు అమృత క్లిని క్‌లో పనిచేస్తున్నారుకదూ"

"అవును" అంది అంకిత.

"అమృత క్లినిక్‌లో ఉన్న కంప్యూటర్ రూమ్ కీస్ తీసుకుని..."

"ఆ రూమ్‌కు లాక్ సిస్టమ్ వెరైటీగా వుంటుంది. కీస్‌తో తెరుచుకోదు..." నీహా రిక మాటలకు అడ్డుతగులుతూ అంది అంకిత.

"అంటే నీకు తెలుసా?" అనవసరపు ఉత్సాహం ప్రదర్శించకుండా వీలైనంత మామూలుగా అడిగింది నీహారిక.

"నెంబరేదో ఉంటుందని తెలుసు కాని ఆ నెంబర్ తెలీదు..." అంది అంకిత.

నీహారిక అడుగుతున్నది ఏమిటో అర్థం కాకపోయినా, తిరిగి ప్రశ్నిస్తే పరీక్షలో ఫెయిలని తమ్ముడితో చెప్పేస్తుందేమోనన్న భయంతో సమాధానాలు చెప్పసాగింది.

"సో! ఆ కంప్యూటర్ రూంలో ఓ రాత్రంతా గడపడమే నీకు పరీక్ష" అసలు విషయం చెప్పింది డాక్టర్ నీహారిక.

ఆ మాట వినగానే అదిరిపడ్డట్టుగా చూసి, "అమ్మో! చీకటంటే నాకు భయం అయినా ఇదేం పరీక్షండీ?" అంది.

వెంటనే నీహారికకు ఏం సమాధానమి వ్వాలో అర్థం కాలేదు. అప్పటికప్పుడు ఏదో నోటికి వచ్చిన సమాధానం చెప్పేసింది. ఎలాగో చెప్పింది కాబట్టి ఇప్పుడు అబద్ధం మీద మరో అబద్ధం చెప్పాల్సివచ్చింది.

"చూడు అంకితా! మీకు, మాకు మధ్య స్టేటస్ డిఫరెన్స్ వుందని ఒప్పుకుంటావుగా!" అంకిత ముఖంలోకి సూటిగా చూస్తూ అడిగింది నీహారిక.

ఒప్పుకుంటానన్నట్టు తలూపింది అంకిత. అంతకంతకు నీహారిక ఓ పజిల్లా అన్పి స్తోంది ఆమెకు.

"సో! మావాడి ఉద్దేశం ఏంటంటే రేప్పొ ద్దున నీ పేరెంట్స్ ఈ పెళ్ళికి ఒప్పుకోక పోతే, ఎలాంటి పరిస్థితినయినా ఎదుర్కొనే ధైర్యం నీకుందో లేదో టెస్ట్ చేయాలనుకుం టున్నాడు. అందుకే నీకీ పరీక్ష"

నోటికొచ్చినట్టు చెప్పేస్తోంది. తను చెప్పింది తనకే హాస్యాస్పదంగా ఉన్నట్టు అన్పించింది. కాని ఆ మాటలు అంకితమీద బాగా పనిచేశాయి. నీహారిక మాటలలో ఆమెకు సత్యం ఉన్నట్టు అన్పించింది.

"మీరు చెప్పింది నిజమేననుకోండి. కాని భయానికి, ధైర్యానికి చాలా తేడా వుంది. చీకటంటే నాకు భయం. అయినంత మాత్రాన నేను పిరికిదాన్నని కాదుగా"

అంకిత ప్రశ్నకు ఏం జవాబివ్వాలో నీహా రికకు అర్థం కాలేదు. అందుకే తెచ్చిపెట్టు కున్న కోపంతో "చూడమ్మాయ్ నీ ప్రశ్నలకు సమాధానం చెప్పాల్సిన అవసరం నాకు లేదు. ఏదో సాటి ఆడపిల్లవుకదా అని సాయం చేద్దామనుకుంటుంటే అదేంటి? ఇదేంటి? అని ఎదురు ప్రశ్నలేస్తే నాకు కోపం వస్తుంది. నాదేం పోయింది. నీవు ఏం సమాధానం చెప్తే మా వాడికి అదే చెప్తాను. మధ్య నాకేం... మీ సమస్యేదో మీరే సాల్వ్ చేసుకోండి" అంది. జవాబు చెప్పలేక తానీవిధంగా కోపం నటిస్తోందని నీహారికకు తెలుసు. కాని అంతకన్నా మరో మార్గం లేదు.

ఆ మాటలకు అంకిత బెదిరిపోయింది. విషయమింకా సాగదీస్తే ఏ క్షణాన ఏం ఉపద్రవం వస్తుందోనని భయపడింది. "సారీనండి! మిమ్మల్ని బాధపెట్టాలన్నది నా ఉద్దేశం కాదు" అని ఏదో అనబోయి, నీహా రిక సీరియస్‌గా ఉండడంతో ఓ నిర్ణయానికి వచ్చినదానిలా అంది. "సరే మీరు చెప్పిన దానికి నేను ఒప్పుకుంటున్నాను. అయితే మీరు నాకో సహాయం చేయాలి..."





తను చెప్పినదానికి అంత తేలికగా ఒప్పు కుంటుందని నీహారిక అనుకోలేదు. అందుకే తన ఆనందం బయటకు కన్పించ కుండా ఉండేందుకు ప్రయత్నిస్తూ "ఏమిటో చెప్పు..." అని అడిగింది.

"నాతోపాటు మీరు కూడా రాత్రంతా కంప్యూటర్ రూమ్‌లో ఉండాలి. నేనీవి షయం ఎవ్వరికీ చెప్పను! మీరు కూడా ఎవ్వరికీ చెప్పకూడదు"

నీహారిక వెంటనే అవుననలేదు. ఏదో ఆలోచిస్తున్నట్టుగా మౌనంగా వుండిపోయింది.

దాదాపు అయిదు నిముషాల తర్వాత 'సరే'నంది.

ఆ రాత్రికే పథకం నిర్ణయించుకుని ఎన్ని గంటలకు, ఎక్కడ కలవాలో అన్నీ వివరంగా మాట్లాడుకుని ఇద్దరూ విడిపోయారు.

★ ★ ★

ఇంటికి వెళ్ళగానే ఎవ్వరితో మాట్లాడకుండా తన రూమ్‌లోకి వెళ్ళిపోయింది అంకిత. తండ్రి ఫోన్ చేసినా మాట్లాడలేదు. భోజనానికి రమ్మని తల్లి ఎన్నిసార్లు పిలిచినా పలకలేదు. వెంటనే సునీల్‌కు ఫోన్ వెళ్ళింది. హడావిడిగా ఇంటికి వచ్చాడు ఆయన. ఎంతో బతిమాలాకగానీ అంకిత తలుపు తీయలేదు. చివరకు తమ పందెం గురించి చెప్పింది. కాకపోతే నీహారిక బదులు తన స్నేహితురాలు పేరు చెప్పింది.

సునీల్ ఆమెను సమాధానపరిచేందుకు విశ్వప్రయత్నం చేశాడు. కానీ ఆమె పట్టుదల ముందు తలవంచక తప్పలేదు. కూతురు అడిగిన వివరాలు, తీసుకోవాల్సిన జాగ్రత్తలు వివరంగా చెప్పాడు.

అంకిత సంబరపడిపోయింది. కాని సునీల్‌లో దీని వెనుక నీహారిక హస్తం ఉందేమోనని అనుమానం కలిగింది. అందుకే ఓ నిర్ణయానికి వచ్చాడు. అదే కనుక సక్రమంగా అమలు జరిగితే ఈ దెబ్బతో నీహారిక పని అయిపోయినట్టే. ఓ క్రూరమైన నవ్వు అతని ముఖంలో కదలాడింది.

రాత్రి పదకొండుగంటలవుతుండగా అంకిత, నీహారిక కంప్యూటర్ రూమ్ దగ్గరకు వచ్చారు.

నీహారిక డాక్టర్ కాబట్టి అక్కడెవరూ ఆమెను పట్టించుకోలేదు. అదీగాక ఈమధ్య ఆమె తరచూ నైట్‌డ్యూటీలు వేయించుకుంటోంది కాబట్టి ఆమెను ఆ సమయంలో అక్కడ చూసినా ఎవరికీ అనుమానం కలగలేదు. ఇక అంకిత! డాక్టర్ సునీల్ కుమార్తెగా ఆమె వారికి పరిచయమే. ఈ టైంలో ఈమె ఇక్కడకు ఎందుకొచ్చింది? అని ఒకరిద్దరికి అనుమానం వచ్చినా, 'అవన్నీ పెద్దవాళ్ల వ్యవహారాలు... మనకెందుకులే' అని వాళ్ళు పట్టించుకోలేదు.

నిజానికి అంతటి ముఖ్యసమాచారం ఫీడ్ చేయబడిన కంప్యూటర్ రూమ్‌కు పటిష్టమైన సెక్యూరిటీ ఉండాలి. అలా ఉంటే అందరికీ అనుమానం వస్తుందనేమో మణి సీక్రెట్‌లాక్ మాత్రమే ఏర్పాటు చేయించాడు. ఆ కోడ్ ఒకరిద్దరికి తప్పితే మిగతా వారికి తెలీకుండా జాగ్రత్తపడ్డాడు.

రూమ్ దగ్గర లైట్ వెలుగుతుండడంతో స్విచ్ ఆఫ్ చేసి డోర్‌మీద చేయివేసింది అంకిత.

అంతే చెవులు బద్దలయ్యేలా సైరన్ మొదలైంది. దాంతో సెక్యూరిటీ అంతా ఒక్కసారిగా అలెర్ట్ అయింది.

ఊహించని ఈ హఠాత్ పరిణామానికి ఇద్దరూ విస్తుపోయారు. ఏంచేయాలో తోచలేదు. సెక్యూరిటీగార్డ్‌లు వస్తున్నట్లు బూట్ల చప్పుడు దగ్గరవుతుండటంతో ఇద్దరూవిధిలేక మెట్లవైపు పరిగెత్తారు. సరిగ్గా వీళ్ళు చివరి మెట్టుమీద ఉండగా గార్డ్స్ అక్కడికి వచ్చేశారు. నాలుగువైపులా చూశారుకాని అక్కడ వాళ్లెవరూ కన్పించలేదు. పైగా చీకటిగా ఉండడంతో చివరి మెట్టుమీదున్న

నీహారిక, అంకితలను చూసే అవకాశం లేదు. ఆ చీకటిలో ఓ గార్డ్ చేయి తగిలి మళ్ళీ సైరన్ విన్పించింది. అంతా తడుము కుంటున్నట్టు ఉండటంతో ఎవరో చీకటి లోనే వెళ్ళి లైట్ వేశారు.

మెట్లపైనుంచి, ఓ మూలగా దాక్కుని నీహారిక వారిని గమనించసాగింది. అక్కడె వరూ లేకపోయినా సెక్యూరిటీగార్డ్స్ వెంటనే వెళ్ళిపోలేదు. అక్కడే కూర్చుని మాట్లాడుకో సాగారు. వీళ్లని నిశితంగా గమనిస్తున్న నీహారికకు ఓ విషయం అర్థమైంది..

అక్కడంతా సర్దుబాటు అయ్యేదాకా వెళ్ళ కూడదని నిశ్చయించుకుంది నీహారిక.

★ ★ ★

దాదాపు ఓ గంట గడిచాక ఇద్దరూ తిరిగి కంప్యూటర్ రూమ్ దగ్గరకు వచ్చారు.

అంకిత డోర్‌మీద చేయి వేయబోతుంటే నీహారిక వద్దని వారించింది. ఆమె ఎందుకు వద్దంటోందో అంకితకు అర్థం కాక పోయినా అదేమని ప్రశ్నించలేదు. ఆఫ్ చేసిన లైట్ వేశాక ఇప్పుడు డోర్ ఓపెన్ చేయమని సైగచేసింది నీహారిక.

అంకిత ఆమె చెప్పిన ప్రకారం చేసింది.

ఈసారి సైరన్ మోగలేదు.

నీహారికవైపు అభినందన పూర్వకంగా చూసింది అంకిత.

సీక్రెట్ నెంబర్ ముందుగానే తెలిసి ఉండడంవల్ల సులువుగానే డోర్ ఓపెన్ చేసింది అంకిత.

ఇద్దరూ లోపలికి నడిచారు. అక్కడంతా చీకటిగా వుంది. కాని లైట్స్ వేస్తే వీడియో కెమేరాలు ఆన్ అయి అక్కడి దృశ్యాన్నంతా తమ టేప్స్‌లో బంధిస్తాయని అందుకే లైట్స్ వేయవద్దని సునీల్ ఒకటికి రెండు సార్లు కూతురికి చెప్పాడు.

అంకిత ఆ చీకటిలో ఓ మూల కుర్చీలో కూర్చుండిపోయింది. నీహారిక ఇచ్చిన మత్తు పనిచేయనారంభించడంతో ఆమె కనులు మూతబడ్డాయి. నెమ్మదిగా ఆమె నిద్రాదేవత ఒడిలో ఒదిగిపోయింది.

ఆ చీకటిలో నీహారికకు ఎక్కడినుంచి మొదలుపెట్టాలో అర్థం కాలేదు. క్యాండిల్ వెలుగులో పనిచేయడం చాలా కష్టంగా వుంది. చివరకు ధైర్యంచేసి కంప్యూటర్ ఆన్ చేసింది. కాని ఆమె ఎంత ప్రయ త్నించినా ఫైల్ ఓపెన్ కాలేదు.

మామూలుగా ఆమె తన అన్నయ్యా పేరుతో ట్రై చేసింది. ఉపయోగం లేకపో యింది. అరవింద్ ట్రీట్‌మెంట్ మొదలుపె ట్టిన డేట్ గుర్తుకు తెచ్చుకుంది. ఫలితం జీరో. ఈసారి అరవింద్ ఏజ్‌తో ట్రై చేసింది. అయినా లాభంలేదు.

అరవింద్ చనిపోయాడు కాబట్టి సమా చారాన్ని ఎరేజ్ చేసేశారా? అన్న డౌట్ కూడా వచ్చింది. కాని ఆమె మనసు అలా జరగడానికి వీల్లేదని చెప్తాంది.

కొంతసేపు అలా శూన్యంలోకి చూస్తుండి పోయింది. ఇంత కష్టపడి ఈ రూమ్‌లోకి ప్రవేశించడం వృథా అయిపోయిందన్న దిగులు ఆమెను మరీ బాధపెడుతోంది. ఇందుకోసం ఓ అమాయకురాలికి లేనిపోని ఆశలు కల్పించడం, పందెం పేరుతో మోసం చేయడం అంతా వృథాయేనా?

ఆలోచిస్తూనే నీహారిక అరవింద్ డేటాఫ్ బర్త్ ట్రై చేసింది.

ఆశ్చర్యకరంగా ఫైల్ ఓపెన్ అయ్యింది.

ఆ తర్వాత ఆమె వేళ్ళు చకచకా కది లాయి.

స్క్రీన్‌మీద అరవింద్ తాలుకు సమాచా రమంతా క్షణాల్లో ప్రత్యక్షమైంది.

పేరు: అరవింద్

వయసు: 27 సంవత్సరాలు

బ్లడ్‌గ్రూప్: 'ఓ' పాజిటివ్

స్పెర్మ్‌కౌంట్: నార్మల్

స్పెర్మ్‌కౌంట్ 'నార్మల్' అని సూచిస్తున్నా ఇంజెక్షన్స్ వాడినట్టు రిపోర్ట్ చూపిస్తోంది. ఇంజెక్షన్ పేరు చూడగానే విషయం మొత్తం అర్థమయిపోయిందామెకు. ఇంజె




క్షన్స్ వాడిన తర్వాత స్పెర్మ్‌కౌంట్ 'జీరో' సూచిస్తోంది. అంటే ఇండ్యూస్డ్ ఇన్‌ఫెర్టిలిటీకి కారణం ఆ ఇంజెక్షన్స్ అన్నమాట.

దాదాపు పదినిమిషాలపాటు ఆమె దీర్ఘాలోచనలో మునిగిపోయింది. ఆ తర్వాత ఒకటొకటిగా సంఘటనలు పేర్చితే ఆమెకు మొత్తం విషయం అవగతమైంది.

అమృత పాలీక్లినిక్‌కు పిల్లలు పుట్టడం లేదన్న సమస్యతో వచ్చేవారిలో మగవారందరికి ఆ ఇంజెక్షన్స్ వాడుతుండాలి. ఆ ఇంజెక్షన్ ఖరీదు ఒక్కొక్కటి మూడువేలు అనుకుంటే ఒక్కో పేషెంట్‌కు కనీసం ఐదు నుంచి ఆరు ఇంజెక్షన్స్ అంటే పదిహేను నుంచి పద్దెనిమిదివేలు వసూలు చేస్తుండాలి. అరవింద్ రిపోర్ట్ అదే చూపిస్తోంది. మిగతావారి విషయంలో ఇలాగే జరగాలని రూలేమిలేదు. అదే తను తేల్చుకోవాలి. అయితే అరవింద్ మరణానికి కారణం మాత్రం స్పష్టమైంది. అందుకు ఇంజెక్షన్స్ కారణం. ఈ ఇంజెక్షన్స్ చేయించుకున్నాక మరో డాక్టర్ దగ్గర టెస్ట్ చేయించుకుని వుంటాడు. రిపోర్ట్ ఇన్‌ఫెర్టిలిటీని సూచించింది. తనవలన పిల్లలు పుట్టే అవకాశం లేదన్న నిర్ణయానికి వచ్చి ఆత్మహత్య చేసుకుని వుంటాడు.

ఆమె ఒళ్లు జలదరించింది.

ఈ మందులు, ఇంజెక్షన్లు ఎక్కడో రహస్యంగా తయారుచేస్తుండాలి. బహుశా 'క్యూర్' ఫార్మస్యూటికల్స్‌లో తయారవుతూ ఉంటుండాలి.

మరికొందరి రిపోర్ట్స్ పరిశీలిస్తే కాని నిజం రూఢి అవదు. కాని డేటాఫ్‌బర్త్ దగ్గర సమస్య వస్తోంది.

ఏ క్షణానయినా, ఎవరైనా రావచ్చు అందుకే ఆలోచనలతో తన సమయాన్ని వృథా చేసుకోదలుచుకోలేదు. వెంటనే అక్కణ్ణించే విశాల్‌కు ఫోన్‌చేసి విషయం చెప్పింది.

తర్వాత గంటసేపు ఖాళీగా ఉండిపోయిందామె.

దాదాపు రెండుగంటలు అవుతుండగా విశాల్ ఫోన్‌చేసి ఆమెకు కావలసిన సమాచారాన్ని అందించాడు. ఇక ఆమె ఆగలేదు. దాదాపు పదిమంది రోగుల రిపోర్ట్స్ పరిశీలించింది. అన్నీ కాస్త అటు ఇటుగా ఒకేలా ఉన్నాయి. ఆ రిపోర్ట్స్ చూస్తుంటే కేవలం డబ్బుకోసమే క్లినిక్‌వారు ఇన్‌ఫెర్టిలిటీని ఇండ్యూస్ చేస్తున్నారని స్పష్టంగా అర్థమవుతోంది.

రిపోర్ట్స్ అన్నీ ప్రింటవుట్స్ తీసుకుంది.

అక్కడినుంచి త్వరగా బయట పడమని నీహారిక సిక్స్‌సెన్స్ హెచ్చరించసాగింది. దాంతో కంప్యూటర్‌ని యథాప్రకారం సర్దేసి అంకిత దగ్గరకు వచ్చింది. ఒకసారి తట్టిలేపింది. కాని నీహారిక ఇచ్చిన మత్తుప్రభావం ఇంకా వదలకపోవటంతో అంకితకు మెలకువ రాలేదు. ఆమె ఇక్కడ కనిపించినా సునీల్ ఎలాగో మానేజ్ చేసుకోగలుగుతాడు. కాని తాను కన్పిస్తేనే ప్రమాదం కాబట్టి అంకితను అలాగే వదిలేసి తను మాత్రం బయటకు వచ్చింది.

నీహారిక లిఫ్ట్‌లోకి ప్రవేశించి డోర్ క్లోజ్ చేస్తుండగా డాక్టర్ సునీల్ కంప్యూటర్ రూమ్ వైపుకు వెళ్ళటం చూసింది. సరిగ్గా ఆయన లోపలికి ప్రవేశించాక ఆమె తన క్యాబిన్ ఉన్న అంతస్థు బటన్ ప్రెస్ చేసింది. అంకిత గురించి ఆమె టెన్షన్ ఇప్పుడు తగ్గిపోయింది.

మరుసటిరోజు విశాల్‌ని కలిసి ఆ అడ్రస్‌లు ఇచ్చి ఓ వీడియో కెమేరా తీస్కెళ్లి ఏంచేయాలో వివరంగా చెప్పింది. ముందు తనే వెళ్దామనుకుంది. కాని విశాల్ ఒప్పుకోలేదు. రేపొద్దున మణికి అనుమానం వచ్చి ఎంక్వైయిరీ చేస్తే ఓ స్త్రీ వచ్చిందని వారు చెప్తే ఖచ్చితంగా నీహారిక మీదనే సందేహం కలుగుతుంది అని వారించాడు. అందుకే ఆ ఆలోచన విరమించుకుంది.

★ ★ ★

అనుమానితులలో ఇక ఒక్క వ్యక్తే మిగిలాడు.

డాక్టర్ నీహారిక నెక్ట్స్ టార్గెట్ డాక్టర్ భార్గవ్.

అయితే భార్గవ్‌ను మణి వచ్చిన తర్వాతే కలవాలని నిర్ణయించుకుంది. ఈలోగా తన్మయి, పవన్‌కు ఫోన్‌చేసి ఎక్కడ కలవాలో చెప్పింది. నిజానికి నీహారిక ఫోన్ కోసమే తన్మయి, పవన్‌లు ఆత్రుతగా ఎదురుచూస్తున్నారు.

తన్మయి రావడమే చాలా కంగారుగా వచ్చింది. "ఏమిటి నీహా! ఎందుకంత అర్జెంట్‌గా రమ్మన్నావ్? నీవేమీ ప్రమాదంలో పడలేదుకదా!"

లేదన్నట్టు నవ్వుతూ తలూపింది డాక్టర్ నీహారిక. తనను గూర్చి వాళ్లిద్దరూ అంతగా వర్రీ అవడం ఆమెకెంతో ఆనందాన్నిచ్చింది.

"సరే అసలు విషయం చెప్పు! నీ ఫోన్ మూలంగా నేను, మా ఆవిడ ఎంత ఖంగారు పడ్డామో తెలుసా?" సీరియస్‌గా ముఖంపెట్టి అన్నాడు పవన్. నీహారికకు ఏం కాలేదని విన్నాక అతనిలో ఆందోళన, టెన్షన్ తగ్గాయి.

"ఏంటి నువ్వు, మీ ఆవిడనా?" అన్నీ మర్చిపోయి వాదనకు దిగింది డాక్టర్ నీహారిక.

వారిద్దరి పోట్లాటని తన్మయి నవ్వుతూ చూడసాగింది.

"సర్లే ఏదో అన్నాం. దానికి 'మీ ఆవిడా' అని నిలదీయాలా? బ్రాకెట్లో కాబోయే అని పెట్టుకోవచ్చుగా" తనే తగ్గుతూ అన్నాడతను.

"ఎలా కుదురుతుంది? నిన్ను పెళ్లి చేసుకోడానికి తన్మయి ఒప్పుకోవద్దూ" తన టెన్షన్లన్నీ మర్చిపోయి తీరిగ్గా కూర్చుని మరీ అతన్ని ఉడికించసాగింది.

చదువుకునే రోజులలో ఎంతమంది అమ్మాయిలు ప్రేమించామంటూ పవన్‌ని వేధించారో నీహారికకు తెలుసు. అన్నింట్లో ఎంతో ఉత్సాహంగా ఉండీ అతను ఎవరైనా ప్రేమమాట ఎత్తితే దూరంగా పారిపోయేవాడు. ఇక తన్మయి సంగతి అయితే చెప్పనే అక్కర్లేదు. అలాంటి ఇద్దరూ ప్రేమలో పడటం చూస్తుంటే నీహారికకు తన అన్నా, వదినలు గుర్తుకువస్తారు.

"సరే... సరే... మీరు తర్వాత తీరిగ్గా దెబ్బలాడుకుందురులేగానీ మొదట నీవు విషయం చెప్పు..." అంది తన్మయి.

"అవును తల్లీ! అదేదో త్వరగా చెప్పు. నీకు డాక్టర్ పట్టా ఎవరిచ్చారోగానీ పేషెంట్స్ ఆరోగ్యం బాగుచేసినా చేయకపోయినా డాక్టర్స్ ఆరోగ్యం మాత్రం నాశనం చేస్తున్నావు" బాధగా అన్నాడు పవన్.

"ఏమన్నావ్?" అంటూ మళ్ళీ వాదనలోకి దిగబోయి ఏమనుకుందో తన్మయి సీరియస్‌నెస్ చూసి భయపడి వెనక్కి తగ్గింది.

నీహారిక ఒకసారి చుట్టూ చూసి గొంతు తగ్గించి రహస్యంగా చెప్పింది. "నేను ఓ ఎడ్వంచర్ చేశాను"

"ఏమిటి మళ్ళీ ఏదైనా పెళ్లి సంబంధం తప్పించుకున్నావా?" తను అంతకన్నా రహస్యంగా అడిగాడు పవన్.

"కాదు! ప్లీజ్ బీ సీరియస్. నేను మా కంప్యూటర్ రూమ్‌లోకి ప్రవేశించి పేషెంట్స్ తాలూకు రిపోర్ట్స్ పరిశీలించాను"

"అందులో ఎడ్వంచర్ ఏముంది?" అర్థం కానట్టు అడిగాడు పవన్ "మా హాస్పిటల్‌లో ప్రతి డాక్టర్ కంప్యూటర్ రూమ్‌లోకి వెడతాడు"

"అది సురక్ష విషయంలో. కాని 'అమృత' విషయంలో కాదు. అక్కడ కంప్యూటర్ రూమ్‌కు సీక్రెట్ లాక్ ఉంటుంది. ఆ నెంబర్ మణికి, సునీల్‌కు, భార్గవ్‌కు తప్పితే ఎవరికీ తెలీదు"

"అదేంటి?" తన్మయి, పవన్‌లిద్దరూ ఒకేసారి అడిగారు. అన్నిరోజులు అమృతలో వర్క్‌చేసిన తన్మయికి ఈ విషయాలేమీ




తెలీవు. ఎప్పటికప్పుడు నీహారిక అమృత గురించి కొత్త విషయాలు చెప్తుంటే ఆశ్చర్య పోవటం తన్మయి వంతవుతోంది.

"అందుకేగా ఎడ్వంచర్ అన్నాను" గర్వంగా చూస్తూ అంది నీహారిక.

"సరే! ఇంతకీ నువ్వు తెలుసుకున్నదే మిటి?" అడిగాడు పవన్.

"పిల్లలు కలగక వచ్చే దంపతుల విష యంలో మా క్లినిక్‌లో ఏదో ఫ్రాడ్ జరుగు తోందని చెప్పానుగా అదేదో కనిపెట్టగలి గాను. ఈ పరిశోధనలోనే అన్నయ్య మర ణానికి కూడా కారణం తెలిసింది" చివరి మాట అంటుంటే నీహారిక స్వరం హఠా త్తుగా విషాదంగా మారిపోయింది.

తన్మయి వెంటనే ఏమీ మాట్లాడలేకపో యింది.

"నీహా...!" అన్నాడు పవన్.

"అవును పవన్! అన్నయ్య నాకన్న ధైర్య వంతుడు. ఆత్మహత్య చేసుకునేంత పిరికివా డుకాదు. కాని అలాంటి పరిస్థితులు కల్పించి అన్నయ్య ఆత్మహత్య చేసుకునేం దుకు కారణమయ్యాడు ఆ మణి"

తన్మయి, పవన్‌లు ఇద్దరూ మౌనంగా వినసాగారు.

"నా పరిశోధనలో తేలిందేంటంటే అన్నయ్య మరణానికి పీటూ ఎక్స్ ఒన్ ఇంజెక్షన్స్ కారణం. అవి చేయించుకోక మునుపు స్పెర్మ్ కౌంట్ నార్మల్‌గానే వుంది. కాని వాడటం మొదలెట్టాక రిజల్ట్ ఇన్‌ఫెర్టిలిటి అని వస్తోంది. ఆ సమ యంలో బహుశ అన్నయ్య వేరే డాక్టర్ దగ్గర టెస్ట్ చేయించుకుని వుంటాడు. ఆయన ఇచ్చిన రిపోర్ట్ చూసి తానిక తండ్రి కాలేనేమో అని భయపడి ఆత్మహత్య చేసు కున్నాడు. ఆ డాక్టర్‌కుగానీ అన్నయ్యకుగానీ ఇందుకు కారణం ఇండ్యూస్డ్ ఇన్‌ఫెర్టిలిటీ అని తెలిసే అవకాశం లేదు"

"అది సరే! మిగతావాళ్ళ రిపోర్ట్స్ కూడా పరిశీలించాలిగా? అప్పుడు కదా మనం ఓ నిర్ణయానికి రాగలిగేది" అంది తన్మయి.

"పరిశీలించాను తన్మయీ! అందరి కేసులు ఇంచుమించు ఇలాగే వున్నాయి" అంటూ తను ల్యాబ్‌లోకి వెళ్లిన దగ్గరినుంచి జరిగినదంతా చెప్పింది నీహారిక.

అప్పటిదాకా మవునంగా ఉన్న పవన్ "నీహా! పీటూ ఎక్స్ఒన్ అనేది ఓ సెల్ ప్రోటీన్. ఆ పేరే ఇంజెక్షన్స్‌కు పెట్టారు. మగవారిలో ఈ సెల్ ప్రోటీన్‌ను తొలగిం చినా లేక దాని యాక్షన్ బ్లాక్ చేసినా ఇన్ ఫెర్టిలిటీకి దారితీస్తుంది" అన్నాడు.

"వాడ్డూయూ మీన్" దాదాపు అరిచినట్టే అడిగింది నీహారిక.

"అవును! జెనీవాకు చెందిన శాస్త్రవేత్తలు మేల్ కాంట్రాసెప్టివ్‌ను తయారుచేయాలనే ఉద్దేశ్యంతో ఎలుకలమీద ఈ ప్రయోగం జరిపి సక్సెస్ అయ్యారు. టెస్టిస్‌నుంచి సెమన్‌లోకి స్పెర్మ్ రిలీజ్ చేసేది వాస్‌డిఫ రెన్స్. ఈ వాస్‌డిఫరెన్స్ యాక్టివిటీని తగ్గిస్తే స్పెర్మ్ ఉత్పత్తి వుంటుంది కానీ సెమన్‌లోకి రిలీజ్‌కాదు. అంటే p 2 x1 సెల్ ప్రోటీన్‌ను రిమూవ్ చేసినా లేదా దాని పనితీరును అడ్డగించే ఇంజెక్షన్స్ లేదా మందులు వాడినా ఇవి మేల్ కాంట్రాసెప్టి వ్‌లా పనిచేస్తాయి. ఇది ఇంకా పరిశోధన లోనే ఉందని బహుశా వచ్చే అయిదు సంవత్సరాలలో ఇలాంటి మందులు విడు దల కావచ్చని అంటున్నారు. నా ఊహ నిజమైతే డాక్టర్ మణి నిజంగా అద్భుత మేధావి. అతను దీని గురించి తెలుసుకున్న వెంటనే ఈ శాస్త్రపరిజ్ఞానంతో మందులు, ఇంజెక్షన్స్ తయారుచేయటం మొదలుపెట్టి ఉంటాడు. ఇదంతా చాలా రహస్యంగా చేస్తున్నాడు. అందుకే అనుమానం వచ్చిన డాక్టర్ జయరామ్‌ని చంపించేశాడు. మీ క్లిని క్‌లో పెరిగిపోతున్న ఇంపొటెంట్ కేసులకు ఇదే కారణం" నుదుటపట్టిన చెమటను తుడుచుకుంటూ చెప్పాడు డాక్టర్ పవన్.

తన్మయి, నీహారికలిద్దరూ డీప్ షాక్‌కు



గుర్రైనట్టుగా అచేతనంగా కూర్చుండిపోయారు. పవన్ చెప్తున్నది వినేందుకు వారి చెవులు మాత్రమే పనిచేస్తున్నాయి. తన్మయి పరిస్థితి మరీ దారుణంగా వుంది. మానవసౌభాగ్యానికి ఉపయోగించాల్సిన శాస్త్రవిజ్ఞానాన్ని మణిలాంటివారు కేవలం స్వార్ధబుద్ధితో మానవ వినాశనానికి ఉపయోగించడం నిజంగా చాలా బాధాకరం.

ఇంత చిన్నకారణం అన్నయ్య ప్రాణం తీసిందనే వాస్తవం నీహారిక హృదయాన్ని మెలిపెడుతోంది. ఇండ్యూస్డ్ ఇన్‌ఫెర్టిలిటీ అని తెలీక తనవల్ల భార్యకు పిల్లలు పుట్టే అవకాశం లేదన్నబాధతో అన్నయ్య ప్రాణం తీసుకున్నాడన్న బాధతో ఆమె హృదయం భారమైంది. తననుతాను నిగ్రహించుకోవడానికి ఎంతగా ప్రయత్నించినా ఆమెవల్ల కాలేదు. కారణం తెలీకముందుకన్నా తెలిశాక నీహారిక దుఃఖం ఎక్కువైంది.

తన్మయి ఆమెను దగ్గరకు తీసుకుని ఓదార్చేందుకు ప్రయత్నించింది. కాని ఎవ్వరేం చేసినా ఆమె కోల్పోయినదాన్ని తిరిగి తెచ్చివ్వలేరుకదా!

ఆమెకు అన్నావదినలు గుర్తుకు వచ్చారు.

వాళ్ళిద్దరూ కళకళలాడుతూ తిరుగుతుంటే ఆ ఇల్లు నందనవనంలా ఉండేది. ఎక్కడ చూసినా ప్రేమ, ఆప్యాయతలే కనిపించేవి.

ఇల్లంటే ఎలా ఉండాలో అన్నయ్య చెప్పింది గుర్తుకువచ్చింది.

ఆ ఇంట్లో అందం లేకపోవచ్చు
అభిమానం ఉంది.
అలంకారాలు లేకపోవచ్చు
అనురాగం ఉంది.
విశాలమైన గదులు లేకుంటే ఏం
హృదయాలున్నాయి.
ఎత్తైన దర్వాజాలు లేకుంటే ఏం.
నిండైన వ్యక్తిత్వాలున్నాయి.
తనను కాదన్నవారిని సైతం.
ఆహ్వానించే వినమ్రత ఉంది.
క్షమించే సహృదయత ఉంది.
ఆదరించే ఔన్నత్యం ఉంది.

అదీ ఇల్లంటే అలా ఉండాలనేవాడు. అందుకు తగ్గట్టే ఆ ఇంట్లో గొడవలు, చికాకులు, మనస్పర్ధలు ఉండేవే కాదు. ఒకరిమీద ఒకరికి ప్రేమ, ఆప్యాయతలే కన్పించేవి.

కాని ఇప్పుడేముంది?

ఆ ఇంట్లో విశాలమైన గదులు, ఎత్తైన దర్వాజాలు తప్పితే ఏమీలేవు. నిశ్శబ్దం ఇంట్లో తిష్టవేసుకుంటే విషాదం ఇంటి ముందు పహరాకాస్తోంది.

తమను కడతేరుస్తాడని భావించిన కన్నకొడుకు కళ్లముందే కడతేరిపోయేసరికి ఆ తల్లి, తండ్రి తట్టుకోలేకపోతున్నారు. ఈ ప్రపంచంతో సంబంధం లేనట్టుగా ఉంటున్నారు. ఇక వదిన అయితే పూర్తిగా పిచ్చిదైపోయింది. ఆమెకు బాగవుతుందో లేదో డాక్టర్లు చెప్పలేరు.

తమ కుటుంబ సుఖసంతోషాలు నాశనం చేసిన మణిని చంపేయాలన్నంత ఆగ్రహం కలుగుతోంది ఆమెలో. కాని అది పరిష్కారం కాదని ఆమెకు తెలుసు.

నిజానికి మెడిసన్ పూర్తయ్యాక పవన్ 'సురక్ష'లో జాయిన్ అవమని అడిగాడు. కానీ నీహారిక ఒప్పుకోలేదు. అన్నయ్య మరణం గురించి ఆమెకు చాలా అనుమానాలు ఉన్నాయి. తన అన్నయ్య ఆత్మహత్య చేసుకునేంత పిరికివాడు కాదని ఆమెకు తెలుసు. అలా జరిగిందంటే కారణం డాక్టర్ మణి.

ఇలా అతని డబ్బు దాహానికి ఎంతమంది బలైపోతున్నారో? ఏమిటి వీళ్ళు చేసిన పాపం! అమృత క్లినిక్‌కు రావడమేనా?

'వైద్యోనారాయణోహరి' అని నమ్మి, డాక్టర్లను తమ అనారోగ్యం తగ్గించే దేవుళ్ళుగా భావించి వారిచేతిలో జీవితాలు పెడితే ఆ దేహాలు ఏవో ప్రయోగశీలాలైనట్టు, వాటికి




మనసు, స్పందన లేనట్టుగా ఇష్టంవచ్చిన ట్రీట్‌మెంట్లు ఇస్తూ జీవం ఉన్న బొమ్మలతో ఆడుకుంటున్న మణిలాంటి వారిని ఏంచేయాలి? విచిత్రం ఏంటంటే పటిష్టమైన ఆధారాలు ఉంటే తప్ప మణిని ఏ చట్టమూ ఏమీచేయలేదు.

నిజానికి మేల్ కాంట్రాసెప్టివ్ అనేది మంచి ప్రయోగమే.

ఇంతవరకూ స్త్రీలకు తప్పితే పురుషులకు గర్భనిరోధక మాత్రలు వంటివి కనుగొనలేదు. ఆవిధంగా చూస్తే శాస్త్రజ్ఞుల ప్రయోగం మానవాళికి ఉపయుక్తమైనది. కాని మణి దాన్ని తప్పుదోవ పట్టించాడు.

ట్రీట్‌మెంట్ పేరుతో వేలకువేలు డబ్బు గుంజుతున్నాడు. ఏ రోగికయినా అనుమానం వస్తే వారిని చంపేస్తున్నాడు. హత్యలను ఆత్మహత్యలుగా చిత్రిస్తున్నాడు. ఇందులో అతనికి సాయపడుతున్న వారెందరో ఉన్నారు.

ఓ డాక్టర్‌కు పేషెంట్ ప్రాణాలు తీయడం పెద్దకష్టమేం కాదుగా! ఆరోగ్యం కోసం వాడే మందులు డోసు పెంచితే అనారోగ్యానికి దారితీస్తాయి. అందులో మణిలాంటి ప్రతిభావంతుడికి అది మరీ తేలిక కూడా!

"నీహా నాకు తోస్తున్నది చెప్తాను విను. అమృతకు వచ్చే దంపతులిద్దరినీ టెస్ట్ చేయాల్సింది పోయి మొదట మగవారిని టెస్ట్ చేస్తున్నారు. వాళ్ళ స్పెర్మ్ కౌంట్‌తో సంబంధం లేకుండా ఇంజెక్షన్స్ రాసిస్తున్నారు. ఇవి అమృతలో తప్పితే దొరకవు. ఒక్కో ఇంజెక్షన్ ఖరీదు మూడువేలు అని చెప్పావు. కనీసం ఐదునుంచి ఆరు వాడుతున్నారు. అంటే పదిహేనువేలనుంచి ఇరవై వేల రూపాయలన్నమాట. ఆ టైంలో వారు ఎక్కడ టెస్ట్ చేయించినా స్పెర్మ్ కౌంట్ నిల్ అనే వస్తుంది. ఇంపొటెన్సీ అని తేల్చి ఐ.వి.ఎఫ్ ఒక్కటే గతి అని మళ్ళీ డబ్బు వసూలు చేస్తున్నారు. ఐ.వి.ఎఫ్. ఫలించని కేసుల్లో కొందరు ఆత్మహత్య చేసుకుంటున్నారు. కొందరిని వారే చంపేస్తున్నారు. అందుకే ఏ పేషెంట్‌కూ రిపోర్ట్స్ ఇవ్వడం లేదు. కంప్యూటర్ రూమ్‌కు సెక్యూరిటీ ఏర్పాటు చేయకుండా సీక్రెట్ లాక్ వేశారు. దీనిబట్టి చూస్తుంటే ఒక్కో పేషెంట్‌నుంచి కనీసం ఇరవైవేలదాకా వసూలుచేస్తున్నారు. తమమీద అనుమానం రాకుండా ఉండటం కోసం కౌన్సిలింగ్ క్లాసులు, అవీ ఇవీ ఏర్పాటుచేస్తున్నాడు మణి. ఇప్పుడు జనంలో డౌట్ మొదలయ్యేసరికి పి.జి.డి. పేరిట మోసానికి పాల్పడ్డారు ఇది ఎంత దారుణం? వినడానికే మనకింత బాధాకరంగా ఉంటే ఇక అనుభవిస్తున్నవారు ఎంత వేదన చెందుతారు? " బాధగా అంది తన్మయి.

అవునన్నట్టుగా తలాడించాడు పవన్.

పిల్లలు పుట్టలేదని వచ్చిన దంపతులిద్దరినీ మొదట పరీక్షచేయాలి. ఎవరిలో లోపం ఉందో తెలుసుకోవాలి. ముఖ్యంగా మగవారిలో స్పెర్మ్ కౌంట్ ఎంత? సహజ గర్భధారణకు ఆ కౌంట్ సరిపోతుందా? లేదా? మళ్ళీ దానిలో కూడా మందులు వాడితే సరిపోతుందా! ఇలాంటి వెన్నో పరిశీలించాల్సి ఉంటుంది. పిల్లలు పుట్టనివారందరకు కృత్రిమ గర్భధారణే ప్రత్యామ్నాయం కాదు. ఆవిధంగా చూసిన ఇన్‌విట్రోఫెర్టిలైజేషన్‌లో సక్సెస్ అయ్యే శాతం కూడా చాలా తక్కువగా ఉంటుంది. అయితే ఇవన్నీ జనానికి తెలీవు! తెలుసుకునే అవకాశం కూడా ఉండదు.

మేము ఫలానా క్లినిక్‌లో ట్రీట్‌మెంట్ తీసుకుని తల్లులమయ్యాం అని పత్రికలలో ప్రకటన వస్తుంది. అందులో ఎంత నిజం ఉందో తెలుసుకోలేరు.

ప్రజల అమాయకత్వాన్ని కొన్ని సంతాన సాఫల్య కేంద్రాలు సొమ్ముచేసుకుంటుంటాయి. ఉదాహరణకు అమృత క్లినిక్ విషయమే తీసుకుంటే ఇక్కడకు వచ్చిన దంప

తులిద్దరిలో మగవారిలోనే లోపం ఉందని చెప్తూ వారికి ఇండూస్డ్ ఇన్‌ఫెర్టిలిటి ఇంజెక్షన్స్ చేసి వాళ్ళను తాత్కాలికంగా నపుంసకులను చేస్తున్నారు.

మేము రోగుల శ్రేయస్సును ఎంతో ఆలోచిస్తాం అని ప్రొజెక్ట్ చేసుకోవడానికి కౌన్సిలింగ్ క్లాసులు నిర్వహిస్తున్నారు. ఇలాంటి వారంతా అక్కడ చేరి తమ బాధలన్నీ ఒకరితో ఒకరు చెప్పుకుంటారు. పోనీ అప్పుడైనా ఇంతమంది ఒకే సమస్యతో బాధపడ్తున్నామంటే ఇందులో ఆస్పత్రి బాధ్యత ఎంత? అని ఎవ్వరూ ఆలోచించరు. ఒకవేళ ఎవరైనా ఒకరిద్దరికి అలాంటి ఆలోచన వచ్చినా 'మనకెందుకు! పెద్దవాళ్ళతో వ్యవహారం' అని మిగతావారు నోరునొక్కేస్తారు.

స్త్రీల విషయానికి వస్తే కృత్రిమ గర్భధారణకోసం ఫీజు తీసుకుని కొన్ని రకాల హార్మోన్ ఇంజెక్షన్స్ ద్వారా వారు గర్భం దాల్చినట్టు భ్రమింపజేసి ఏ నాలుగోనెలలోనో పిండం సరిగా ఎదగలేదంటూ బలవంతంగా అబార్షన్ చేసేందుకు ప్రయత్నిస్తున్నామంటారు.

వీటన్నింటికి కారణం ఒక్కటే ప్రజల అజ్ఞానం. సమస్య తనదాకా రానంతకాలం తనకెందుకులే అనే మనస్థత్వం.

కృష్ణప్రసాద్ ఎప్పుడు వచ్చారోగాని ఈ సంభాషణంతా విన్నారని ఆయన్ని చూస్తేనే అర్థం అవుతోంది.

"నిజంగా దారుణం! డాక్టర్లు ఇలా..." ఆపైన మాట్లాడలేకపోయారు.

"అందుకే వెంటనే పోలీసు రిపోర్టు ఇవ్వాలి! మెడికల్ కౌన్సిల్‌కు కూడా ఇది తెలియచేయాలి. ప్రభుత్వం అనుమతి తీసుకోకుండా మందులు వాడుతున్నందుకు 'డ్రగ్‌కంట్రోల్ ఆఫ్ ఇండియా'కు ఇది వెంటనే తెలియచేయాలి" ఆవేశంగా అంది తన్మయి.

మిగతావారు ఎలాపోయినా డాక్టర్లు నీతి, నిజాయితీలకు నిర్వచనంగా ఉండాలని ఆమె ఉద్దేశ్యం.

"అవును! తన్మయి చెప్పింది నిజమే. అలాగే చేయాలి" అన్నారు కృష్ణప్రసాద్.

నీహారిక ఖంగారుపడిపోయింది.

"ఏమిటి నీహా! నీ ఆలోచన ఏమిటి? " అడిగాడు పవన్.

"ఏంలేదు పవన్! నేను సేకరించిన సమాచారం సరిపోదు! డాక్టర్ మణికి చాలా పెద్ద పెద్దవారితో పరిచయాలున్నాయి. మనం సరైన ఆధారాలు లేకుండా రిపోర్ట్‌చేస్తే ఈ కేసులోంచి చాలా సులువుగా తప్పించుకుంటాడు. అందుకే కొన్నిరోజులు ఆగుదాం" అంది నీహారిక.

ఆమె ఆలోచనే సరైనదనిపించింది మిగతావారికి.

ఆ తర్వాత చాలాసేపు దీనిగురించి మాట్లాడుకుంటూ ఉండిపోయారు.

డాక్టర్ మణి ఊరునుంచి వచ్చేది ఆరోజే. అందుకే రోజూకన్నా ముందుగా క్లినిక్‌కు బయలుదేరింది నీహారిక. లేదంటే డాక్టర్ సునీల్ మణికి లేనిపోనివి చెప్పి అతని మనసు విరిచేస్తాడని భయపడింది.

కానీ డాక్టర్ మణి, సునీల్‌లు కలిసి రావడం చూసేసరికి ఖంగారుపడినా వెంటనే సర్దుకుంది. అప్పటికప్పుడు ఏంచేయాలో నిర్ణయించుకుంది.

మణి రాగానే నీహారికకు కబురు పంపించాడు.

నీహారిక అతని క్యాబిన్‌లోకి అడుగుపెట్టేసరికి మణి ముఖం చాలా సీరియస్‌గా ఉంది.

"నీహారికా! నేనెంత క్రూరుడినో మీకు తెలీదనుకుంటాను. అందుకే అలాంటి పనులు చేస్తున్నారు"

"సర్... నేను" అంటూ ఏదో చెప్పబోయింది.

"చూడండి... నాకు డొంకతిరుగుడుగా మాట్లాడటం అలవాటులేదు. మీమీద అనుమానాస్పద వార్తలు వస్తున్నాయి. దాన్ని





గురించి మీతో మాట్లాడుదామని పిలిపించాను" అన్నాడు మణి.

"ఎస్ సర్! నేను కూడా అదే మాట్లాడాలనుకుంటున్నాను" అంది ఆమె.

ఆ మాటలకు విస్తుబోయాడతను.

"వాటెస్ట్రేంజ్! అంటే మీరు మీ తప్పును ఒప్పుకుంటున్నారన్నమాట"

"లేదు! మరొకరి పొరపాట్లు మీ దృష్టికి తేవాలనుకుంటున్నాను" ముక్తసరిగా అంది తన్మయి.

ఆమె మాటలకు మణి కన్ఫ్యూజ్ అయ్యాడు. "అంటే మీరు చెప్పేది"

"అవును! మీరిక్కడ లేనప్పుడు జరిగిన నమ్మకద్రోహం గురించి. వెన్నుపోటు గురించి" ఆవేశంగా అంది నీహారిక.

లేశమాత్రమైె అనుమానం రాకుండా చాలా మామూలుగా, అసలేమీ జరగనట్టుగా మాట్లాడసాగింది ఆమె. దాంతో మణి అంతటివాడు కూడా తాను అడగదల్చుకున్నది మర్చిపోయాడు.

"చెప్పండి ఎవరా వ్యక్తి? "

నీహారిక వెంటనే బదులుచెప్పలేదు.

ఈసారి కొంచెం స్వరం పెంచి అడిగాడు. ఆయన మాట పూర్తికాకుండానే అందామె. "డాక్టర్ సునీల్"

ఆయన ముఖం రక్తం లేనట్టుగా పాలిపోయింది.

క్షణం తర్వాత తేరుకుని అడిగాడు, "మీరు చెప్పేదేమిటో మీకు అర్థమవుతోందా? "

అంతకుముందు డాక్టర్ సునీల్ వచ్చి నీహారిక గురించి చెప్పాడు. ఆ సంగతి ఏదో కనుక్కుందామని పిలిస్తే ఇప్పుడామె అతనిమీద సందేహం కలిగే మాటలు చెప్తోంది.

మణి ఆ కన్‌ఫ్యూజన్‌లో ఉండగానే నీహారిక కొనసాగించింది. "సర్! నేను మీ దగ్గర ఓ రహస్యం దాచాను. అది ఇప్పుడు చెప్పేస్తాను" మణి రియాక్షన్ కోసం ఒక్క నిముషం ఆగింది.

మణిలో ఆశ్చర్యం, అనుమానం, చికాకు ఒక దానివెంట ఒకటి కలిగాయి. నీహారికకు కావాల్సింది కూడా అదే!

"సర్! డాక్టర్ సునీల్‌ని మీరు మీ వ్యక్తి అని, విశ్వాస పాత్రుడని అనుకుంటారు. కాని ఆయన నిలువెల్లా స్వార్థమే. తనకు తప్ప మరెవ్వరికీ పేరు రాకూడదని అనుకుంటారు. మీరు ఎంతసేపూ క్లినిక్ గురించి ఆలోచిస్తారు! కానీ ఆయన తను ఎలా ఎదగాలి? మీ సీట్లోకి ఎలా రావాలి అని ఆలోచిస్తుంటాడు"

వింటున్న మణి ఉలిక్కిపడ్డాడు. సునీల్ తన సీటుకు ఎసరుపెట్టే ఆలోచనలో ఉన్నాడన్న సంగతి ఇంతకుమునుపు కూడా ఒకరిద్దరు ఆయనకు చెప్పారు.

"అవును సర్! నేను చెప్పేది పూర్తిగా నిజం. అందుకే తన్మయిని ఎలా ఈ ఆసుపత్రి నుంచి బయటకు పంపాలా అని చూశారు. ఇప్పుడు నన్ను అడ్డు తొలగించుకోవాలని చూస్తున్నారు. పి. జి. డి. ప్రయోగం సక్సెస్ అవడం, నాకు పేరు రావడం ఆయనకు ఇష్టంలేదు. ఆరోజు నేను రాత్రంతా క్లినిక్‌లోనే వున్నాను. పి. జి. డి. కేసులు ఎక్కువ అయిపోతున్నాయి. వాటిని స్టడీచేసి ఓ నిర్ణయానికి రావాలంటే నేను రాత్రింబవళ్లు పనిచేయక తప్పడంలేదు. ఆరోజు డాక్టర్ సునీల్ రాత్రంతా కంప్యూటర్ రూమ్‌లోనే ఉన్నారు. ఆయనతోపాటు వాళ్ళమ్మాయి కూడా ఉంది. మీరు లేనప్పుడు ఆధారాలన్నీ సేకరించి మిమ్మల్ని రిస్క్‌లో పడేయాలన్నది ఆయన అభిమతం. మీకు ఇంకా అనుమానం ఉంటే వాళ్ళమ్మాయికి ఫోన్ చేసి కనుక్కోండి" అంది నీహారిక.

మణిలో ఆమె ఆశించిన మార్పు కన్పించింది.

ఆ మాటలకు డాక్టర్ మణి నిజంగానే షాకయ్యాడు. ఆయన ఆ షాక్‌లో ఉండ

గానే అంకితకు ఫోన్ చేసింది. "హాయ్ అంకితా! నేను నీహారికను. ఆరోజు నువ్వు లాబ్‌లో ఉన్నావుకదూ! ఆ విషయం ఇదిగో ఫోన్‌లో చెప్పు..." అని ఫోన్ మణికి ఇచ్చింది.

"అవును. ఆరోజు నేను లాబ్‌లోనే వున్నాను. నిజం...ప్రవీ..." అంతలోనే మణి ఫోన్ కట్‌చేసేశాడు. ప్రవీణ్ అన్నమాట మణి పూర్తిగా వినివుంటే పర్యవసానం మరోలా వుండేది. నీహారిక మరో అబద్ధం వెతుక్కోవలసి వచ్చేది.

తన దగ్గర ఎంతో నమ్మకంగా వుండే డాక్టర్ సునీల్ ఇలాంటి నమ్మకద్రోహానికి పాల్పడతాడని మణి ఊహించలేదు.

ఆవేశం మనిషిని ఆలోచనాగహితుడ్ని చేస్తుంది. ఇక్కడా అదే జరిగింది. మణికి ఆ ఒక్క సంఘటనతో సునీల్‌మీద వున్న విశ్వాసం తుడిచిపెట్టుకుపోయింది. నీహారికకు కావాల్సింది కూడా అదే.

"అంతేకాదు సర్! మన దగ్గర ఇన్‌ఫెర్టిలిటీకి ట్రీట్‌మెంట్ తీసుకుంటున్న వాళ్ళ అడ్రస్‌లు సేకరించి వాళ్ళ ఇళ్ళకు వెళ్ళి ఎంక్వైరీ చేస్తున్నట్టు తెలిసింది. చెప్పానుగా ఇదంతా మిమ్మల్ని ఆ సీట్‌లోంచి తప్పించి తను ఛీఫ్ అవ్వాలన్న ఉద్దేశ్యంతోనే ఆయన చేస్తున్నాడనిపిస్తోంది"

"నీకెలా తెల్సిందీ విషయం?"

నీహారిక ఒక్కక్షణం చెప్పాలా వద్దా అని తటపటాయించి చివరకు అంది. "ట్రీట్‌మెంట్ తీసుకుంటున్న నా ఫ్రెండ్ భర్త చెప్పాడు. ఇందువల్ల సునీల్‌గారికి ప్రయోజనమేమిటో నాకు తెలీదు. బట్ నామీద మీకు అనుమానం క్రియేట్ చేయాలని చూస్తే నేనూరుకోను. ఎందుకంటే మీలాగే అమ్మ తను నెంబర్‌వన్ క్లినిక్‌గా చేయడమే నా లక్ష్యం కాబట్టి" అంది.

షాక్‌లోంచి తేరుకున్న మణి పూర్వపు ప్రశాంతతను ముఖంలోకి తెచ్చుకుని "సారీ నీహారిక! నేను పొరపడ్డాను. ఇవేమీ మనసులో పెట్టుకోకండి" అన్నాడు.

"పర్లేదుసర్! మనమధ్య వ్యక్తిగత శత్రుత్వం కానీ, ద్వేషంకానీ ఏమీలేదు. క్లినిక్ శ్రేయస్సును దృష్టిలో పెట్టుకుని మీరు చేసే ప్రతి పనికి నా సంపూర్ణ మద్దతు ఉంటుంది" అంటూ కుర్చీలోంచి లేచి చేతులు జోడించింది. "అన్నట్టు సర్! సునీల్‌గారు వెళ్ళి ఎంక్వైరీ చేసిన నా ఫ్రెండ్ అడ్రస్ ఇది. మీకు అనుమానం ఉంటే చెక్ చేసుకోవచ్చు" అంటూ ఓ నెంబర్ వున్న కాగితం మణికి ఇచ్చి బయటకు వచ్చేసింది.

మణి ఆ నెంబర్‌కు ఫోన్ చేసి అడిగితే సునీల్ అనే ఆయన వచ్చారని, ట్రీట్‌మెంట్ గురించి అడిగారని చెప్పారు. మరికొన్ని నెంబర్లు తెప్పించి ఫోన్ చేశాడు. అందరిదీ ఒకే సమాధానం. సునీల్ వచ్చి తమను కొన్ని ప్రశ్నలు అడిగారని.

ఆ క్షణంనుంచి డాక్టర్ సునీల్‌మీద నిఘా మొదలైంది.

మణి తన మాటలు సంపూర్ణంగా విశ్వసించాడని నీహారిక అనుకుంది. కానీ మణి ఎవ్వరినీ నమ్మడు. ఆఖరకు తన నీడను కూడా...



ఎన్నడూ లేనిది డాక్టర్ కృష్ణప్రసాద్ సురక్షలో ప్రెస్‌మీట్ ఏర్పాటుచేశారు.

యవ్వనాన్ని పెంచే జన్యురహస్యాన్ని

తన్మయి ఛేదించగలిగింది. ఈ విషయం ప్రెస్‌కు తెలియచేసేందుకు మీడియాను ఆహ్వానించినట్టు చెప్పారు కృష్ణప్రసాద్.

ఇక ప్రశ్నల పరంపర మొదలైంది.

"మీరీ ప్రయోగం చేయడానికి ఆధారం ఏమిటి? " అడిగాడో విలేకరి.

"మంచి ప్రశ్న" చిరునవ్వు నవ్వింది తన్మయి.

"టిష్యూకణాల్లో ఉండే క్రోమోజోముల యొక్క కొనభాగాలు... కణవిభజన చెంది నప్పుడల్లా పొట్టిగా అవుతుంటాయి. దీనిని 1991లోనే కనుగొన్నారు. అంటే కణవిభజన కొనసాగినంతసేపు ఈ ప్రక్రియ కొనసాగుతూనే ఉంటుందన్నమాట. దీనిని ఆధారంగా చేసుకున్నాను" వివరించింది తన్మయి.

"మేడమ్ మీ ప్రయోగం గురించి కొంచెం వివరంగా చెప్తారా? " ఆసక్తిగా అడిగాడు మరో విలేకరి.

"తప్పకుండా..." తలాడించింది తన్మయి.

పవన్, కృష్ణప్రసాద్ చిరునవ్వుతో చూస్తుండిపోయారు. "మా బామ్మను బైపాస్ చేసి రక్షించండి. జీవితాంతం మీకు రుణపడివుంటాను" అని చిన్నపిల్లలా ఏడ్చేసిన తన్మయేనా ఈ అమ్మాయి... చాలా మామూలుగా చూడగానే పక్కింటి అమ్మాయిలా, ముద్దబంతి పూవులా అన్పించే తన్మయిలో ఇంతటి విజ్ఞానతృష్ణ, పట్టుదల ఉన్నాయా? " అని పవన్ ఆశ్చర్యపోతున్నాడు. ఎప్పటికప్పుడు ఆమె అతనికి చాలా కొత్తగా కన్పిస్తోంది.

"ఇంతకుముందు చెప్పినట్టు టిష్యూకణాల్లోని క్రోమోజోముల కొనభాగాలు కణవిభజన చెందినప్పుడల్లా పొట్టిగా అవుతాయి. కణవిభజన కొనసాగినంతసేపు ఈ ప్రక్రియ కొనసాగుతుంది. కాని ఒకదశలో ఈ విభజన ఆగిపోతుంది. దీనిని 'హేఫ్లిక్ లిమిట్' అంటారు. అదే మనం ఈ క్రోమోజోముల కొనల్ని పొడవుగా చేసే ఎంజైమ్ (టిలోమియర్స్)ను చైతన్యవంతం చేయగలిగితే వృద్ధాప్యం మీద విజయం సాధించినట్లే. ఎందుకంటే వయసు పెరగడానికి కారణం ఈ టిలోమియర్స్ కొనలే..."

"వెరీ ఇంట్రెస్టింగ్..." అన్నాడు ఓ రిపోర్టర్.

అవునన్నట్లు తలాడించింది తన్మయి... "అలా చైతన్యవంతం చేసి కణవిభజనను కనీసం ఇరవైసార్లు మార్పులకు గురయ్యేలా చేయగలిగాను. ఇక గర్భస్థకణాల్లోని టిలోమియర్స్ పునర్నిర్మించాలి. అలా కనుక చేయగలిగితే కేవలం ఒక్క ఇంజెక్షన్‌తో యవ్వనవంతులు కావచ్చు" ఉద్వేగపూరితంగా చెప్పింది తన్మయి.

చప్పట్లు మోగాయి. అభినందనలమధ్య తనకీ అవకాశం ఇచ్చినందుకు డాక్టర్ కృష్ణప్రసాద్‌కు, డాక్టర్ పవన్‌కు కృతజ్ఞతలు తెలియచేసింది తన్మయి.

కృష్ణప్రసాద్ మైక్ అందుకుని చెప్పారు. "తన్మయి ప్రయోగం ఇంతటితో పూర్తికాలేదు. భవిష్యత్ ప్రయోగాల కోసం ఆమె త్వరలో కాలిఫోర్నియా వెళ్ళనుంది. అక్కడ మిన్‌లోపార్క్‌లో ఉన్న జెరాన్‌కార్పోరేషన్‌కు చెందిన ఆండ్రియా బోడ్నార్ బృందం ఈ విషయం మీద విస్తృతంగా పరిశోధనలు జరుపుతున్నారు. డాక్టర్ తన్మయి పరిశోధన గురించి వివరిస్తూ వారికి మెసేజ్ పంపాం. వారినుంచి రిప్లై వచ్చింది. తన్మయి కూడా వారితో జాయిన్ అవడానికి సుముఖంగా ఉన్నారు..."

ప్రెస్‌మీట్ చివర్లో డాక్టర్ పవన్, తన్మయిల వివాహం గురించి కూడా ప్రకటించారు కృష్ణప్రసాద్. వారి వివాహం తర్వాతే తన్మయి కాలిఫోర్నియాకు వెళ్ళనుందని చెప్పారు.

ఇదంతా పేపర్లో చదివి మణి చాలా బాధపడ్డాడు. ఒక చక్కని అవకాశం తన చేజారిపోయింది. దీనికంతటికి కారణం డాక్టర్ సునీల్ అని ఆ కోపమంతా అతని

మీదకు మళ్ళింది.

★ ★ ★

'సువర్చల నిలయం' అని ఉన్న ఇంటి ముందు కారు ఆపింది నీహారిక.

ఆ బిల్డింగ్‌ను బట్టి వాళ్ళెంత ధనవంతులో అంచనా వేయగలిగింది.

కార్ దిగి, లాక్ చేసి గేటువైపుకు నడిచింది.

సెక్యూరిటీవాళ్ళు అడ్డగించారు. లోపలికి ఫోన్‌చేసి నీహారిక పేరు చెప్పగానే పంపమని చెప్పారు.

బయటకన్నా లోపల బిల్డింగ్ మరింత అధునాతనంగా కన్పించిందామెకు. ఇంటీరియర్ డెకరేషన్ కొన్ని లక్షల ఖరీదు చేస్తుంది.

నీహారిక కూర్చున్న కాసేపటికి ఓ స్త్రీ వచ్చింది.

లేచి నిలబడి "ఐయామ్ నీహారిక... డాక్టర్ నీహారిక" చెప్పిందామె.

"కూర్చోండి... నేను సువర్చలను" అని పరిచయం చేసుకుంది. "చెప్పండి ఏంతీసుకుంటారు? కాఫీ, టీ, కూల్ డ్రింక్...? "

"నో థాంక్స్! ప్లీజ్..." మొహమాటంగా నవ్వింది నీహారిక.

"ఓకె... కొంచెం జ్యూస్ తీసుకుందాం" అని, "ఆయా!" పిలిచింది సువర్చల.

ఆవిడ రాగానే "జ్యూస్ తీసుకురా? " అంది.

"ఇప్పుడు చెప్పండి! నేను మీకేం సహాయం చేయగలను? " ముఖంలో అదే ప్రశాంతత.

"చెప్తాను. కానీ ఎక్కడినుంచి చెప్పాలో అర్థం కావడంలేదు. అంతకన్నా ముందు మిమ్మల్నో ప్రశ్న అడగదల్చుకున్నాను..."

అడగమన్నట్టు చూసింది సువర్చల.

"మీరు భార్గవ్‌గారి దగ్గరనుంచి విడిపోయేందుకు నిశ్చయించుకున్నారని, విడాకులకు అప్లయ్ చేశారని కాని ఆయన మాత్రం డైవోర్స్‌కు ఒప్పుకోవడంలేదని తెల్సింది..."

"నిజమే...!" అంది సువర్చల. ఆ స్వరంలో కాని ఆమె ముఖంలోకాని మునుపటి ప్రశాంతతలేదు. భార్గవ్ పేరు ఎత్తగానే కోపం, చికాకు తలెత్తి ఆమె ప్రశాంతతను తుడిచిపెట్టేశాయి.

అప్పుడు తన గురించి మొత్తం చెప్పింది నీహారిక. "సో! సువర్చలగారూ! ఇందులో డాక్టర్ భార్గవ్ హస్తం కూడా ఉందని నా అనుమానం. అదేంటో తెలుసుకోగలిగితే మణి రెండోభుజం కూడా కూలిపోతుంది. అతను ఒంటరివాడైపోతాడు. ఇందుకు మీ సహకారం కావాలి..."

"నీహారికగారూ! మీరు... మీరు చాలా గొప్ప వ్యక్తులు..." చెమ్మగిల్లిన కళ్ళను తుడుచుకుంటూ అంది సువర్చల. "నేను ఒక్కడ్ని... కాదుకాదు ఒక్కడితో పోరాడలేకపోయాను. కానీ మీరు ఇంతమందితో యుద్ధానికి సిద్ధపడ్డారు. రియల్లీ యూ ఆర్ గ్రేట్...! మీకు తెలీదు నీహా! భార్గవ్ నాకు స్వయాన మేనత్తకొడుకు. మా పెళ్ళికి ముందే అతని చెడుతిరుగుళ్ళు ముఖ్యంగా అతనికి ఉన్న అమ్మాయిల పిచ్చి గురించి నాకు తెలుసు. కాని పెళ్ళైతే మారతాడని అత్తయ్య, నాన్నగారు చెప్పడంతో వాళ్ళ మాటలు కాదనలేకపోయాను. పెళ్ళైనా భార్గవ్ ఏమాత్రం మారలేదు. ఆరు నెలలపాటు నరకం అనుభవించాను. నాన్నగారి ఆరోగ్యం బాగుండకపోవడంతో వాడు దాన్ని సాకుగా తీసుకుని ఆయనముందు ఎంతో నటించేవాడు. నేను సుఖంగా కాపురం చేసుకుంటున్నానన్న భ్రమలో డాడీ ఈ లోకం విడిచి వెళ్ళిపోయారు. దాంతో వాడి ఆగడాలకు అడ్డూఅదుపూ లేకుండాపోయింది. ఇక భరించడం నావల్ల కాలేదు. విడాకులకు అప్లై చేశాను. సంతకం చేయనన్నాడు. ఈ ఆస్తి, ఐశ్వర్యం పోగొట్టుకోవడం వాడికి ఇష్టంలేదు. ప్రస్తుతం కేసు కోర్టులో ఉంది. కానీ ఒక్కటి మాత్రం నిజం. ఎంత





ఖర్చయినా ఆఖరికి నా ఆస్తంతా పోయినా సరే విడాకులు సాధించి తీరుతాను. లేదూ వాడ్ని చంపేస్తాను" ఎన్నాళ్ళనుంచో నొక్కి పట్టిన ఆవేశం కట్టలు తెంచుకుంది.

"సువర్చలగారూ! ప్లీజ్... కంట్రోల్ యువర్ సెల్ఫ్..." ఓదార్పుగా అంది నీహారిక. "మీరు ఓ చిన్న సహాయం చేయగలిగితే మనిద్దరి సమస్యా పరిష్కారమవుతుంది"

"ఏమిటది? " ఆత్రుతగా అడిగిందామె.

"జరిగినదంతా మర్చిపోదామని, కేసు విత్‌డ్రా చేసుకుంటానని భార్గవ్‌తో చెప్పండి. కేవలం కొన్నిరోజులు అతనితో కలిసి జీవించండి. మనకు కావాల్సిన ఆధారాలు తప్పక దొరుకుతాయి. ఎందుకంటే ఎలాంటి క్రిమినల్ అయినా ఎక్కడో అక్కడ తప్పుచేసి దొరికిపోక తప్పదు..." అంది నీహారిక.

సువర్చల ఆలోచనలో పడింది.

ఆమె తప్పకుండా తన ప్రపోజల్‌కు ఒప్పుకుంటుంది అని నీహారికకు అనిపించింది

★ ★ ★

టెర్రస్‌మీంచి దూకి ఆత్మహత్య చేసుకున్నాడని క్లోజ్ చేసిన వ్యక్తి కేసును తిరిగి రీఓపెన్ చేశారు. దాంతోపాటు మరికొందరు కూడా 'అమృత పాలీక్లినిక్'లో జరిగే చికిత్సా విధానంలో లోపముందని కంప్లైంట్ ఇచ్చారు. ఎన్నడూ లేనిది ఈ ఉపద్రవమేమిటో అని మణి చాలా ఖంగారు పడ్డాడు.

ఆ సమయంలో డాక్టర్ భార్గవ్‌ను పిలిపించాడు మణి.

మణి తనకు అంతటి ప్రాముఖ్యతనివ్వడంతో భార్గవ్ సంతోషానికి అవధులు లేకుండాపోయాయి.

సరాసరి విషయంలోకి వచ్చాడు మణి.

"ఈమధ్య మన క్లినిక్‌లో ఒక పేషెంట్ టెర్రస్‌మీంచి దూకి ఆత్మహత్య చేసుకోవడం గురించి మీకు తెలుసుననుకుంటాను..."

తెలుసన్నట్టు తల ఆడించాడు భార్గవ్.

"అతనిది ఆత్మహత్య కాదని, అమృతలో జరిగిన ట్రీట్‌మెంట్ లోపం గురించి అతనికి తెలిసిపోవడంవల్ల మనం ఇబ్బందులో పడతామని భావించి మనమే అతనిని టెర్రస్‌మీంచి కిందకు తోసేసి చంపేశామని పోలీసులకు అనుమానం వచ్చింది. ఆత్మహత్య కేసుగా క్లోజ్ చేసిన దాన్ని ఇప్పుడు హత్యగా అనుమానిస్తూ కేసును తిరిగి ఓపెన్ చేశారు..."

మణి చెప్పిందానికి భార్గవ్ చాలా ఖంగారు పడ్డాడు. అలాంటిదేదైనా జరిగితే మొదట కటకటాల పాలయ్యేది తనేనని అతనికి బాగా తెలుసు. క్లినిక్‌లో ఇలాంటి ట్రీట్‌మెంట్ జరుగుతున్నట్టు తనకు తెలీదని చెప్తే పెద్దగా శిక్ష ఉండదు. కాని ఐ.వి.ఎఫ్. ఇన్‌ఛార్జిగా తను మాత్రం తప్పించుకోలేడు.

"అదేం పెద్ద విషయం కాదు సర్, డబ్బు పడేస్తే వాళ్ళే నోరు మూసుకుంటారు" భయాన్ని మనసులోనే దాచుకుంటూ తేలికగా అన్నాడు భార్గవ్.

"లాభంలేదు...! ఇప్పుడు కొత్త కమిషనర్ వచ్చాడు. అతను నిజాయితీకి మారుపేరని, లంచాలకు లొంగడని అంటున్నారు. విషయం అతనిదాకా వెళ్ళింది కాబట్టి మనం ఇప్పుడేమీ చేయలేం. ఏదైనా తొందరపడి చేస్తే ప్రమాదంలో పడతాం" చెప్పాడు మణి.

నెమ్మదిగా తన చుట్టూ ఉచ్చు బిగుసుకుంటున్న ఫీలింగ్ కలిగింది భార్గవ్‌లో.

"మరేం చేద్దాం, సర్...!? " ఖంగారుగా అన్నాడు తను.

"కొన్నాళ్ళు P2x1 ఇంజెక్షన్స్ వాడకాన్ని నిలిపివేయడమే మంచిది"

"అంటే అన్ని చోట్లానా? "

"చూద్దాం! అవసరాన్ని బట్టి ఆలోచిద్దాం. మీరు మాత్రం జాగ్రత్తగా ఉండండి. అసలే

మీమీద డైవర్స్ కేసు నడుస్తోంది. మీ క్యార క్టర్ మంచిది కాదని, విడాకులు కావాలని ఆవిడ కేసు పెట్టారు. ఈ సమయంలో ఈ కేసులు కూడా బయటకు వస్తే మాకన్నా మీరే ప్రమాదంలో పడతారు"

ఆ మాటలకు భార్గవ్ పెదాలమీద సన్నగా నవ్వు విరిసింది. ఇప్పుడు ఆ కేసు లేదు. నా భార్య నా దగ్గరకు వచ్చేసింది. ఈ కేసులో నాదే విజయం అని చెప్దామను కున్నాడు, కాని ఎందువల్లో చెప్పలేకపో యాడు.

ఈ క్లినిక్‌లో ఇక ఇండూస్డ్ ఇంపొటెన్స్ ఇంజెక్షన్లు వాడరన్న సంగతి తెలిసి నీహా రిక నిర్ఘాంతపోయింది. ఇంజెక్షన్ శాంపిల్ కోసం ప్రయత్నిస్తున్న ఆమెకు ఎలా దాన్ని సంపాదించాలో అర్థంకాలేదు.

ఎందుకంటే భార్గవ్ ప్రిస్క్రిప్షన్ రాయడు. ట్రీట్‌మెంట్ గురించి పేషెంట్‌కి చెప్పి వాళ్లు ఒప్పుకుంటే మందులు, ఇంజె క్షన్స్ వాడటం మొదలుపెడతారు. ఇక అమృత మెడికల్ షాపులో కూడా భార్గవ్ మనుషులే ఉంటారు కాబట్టి అక్కడనుంచి కూడా లభ్యం అయ్యే అవకాశం లేదు.

ఈ పరిస్థితుల్లో సువర్చల భార్గవ్‌తో రాజీకొచ్చిందన్న విషయం ఆమెకు ఆనందా న్నిచ్చింది. ఆమె సంపాదించబోయే రుజువు లమీద నీహారిక చాలా ఆశలు పెట్టుకుంది.

★ ★ ★

దేవిశ్రీకి డెలివరీ దగ్గర అవుతున్నకొద్దీ ఆమెలో ఆందోళన పెరిగిపోసాగింది. తనది మామూలు ప్రెగ్నెన్సీ కాదని ఆమెకు తెలుసు. ఇప్పుడేదైనా ప్రమాదం జరిగితే ఇక జీవితంలో తను తల్లి కాలేదన్న భయం... ఆమె ఆందోళనను మరింత పెంచింది. అందుకే డెలివరీ డేట్‌కన్నా ముందే ఆసుపత్రిలో జాయిన్ అయ్యింది.

నిజానికి దేవిశ్రీకన్నా తన్మయికి ఎక్కువ ఖంగారుగా వుంది. అందుకే దేవిశ్రీ హాస్పి టల్‌లో జాయినవుతానని అన్నప్పుడు వెంటనే ఒప్పుకుంది.

దేవిశ్రీ జాయినయిన మూడోరోజు జరి గింది ఆ సంఘటన. అంతవరకు మామూ లుగా మాట్లాడుతున్న దేవిశ్రీ హఠాత్తుగా బాధతో కొంకర్లు తిరిగిపోసాగింది.

ఆమెకి ఊపిరి భారంగా వస్తోంది.

గొంతులోనుండి అస్పష్టంగా వస్తున్న మూలుగు వినబడుతోంది.

ఏదో చెప్పాలని ప్రయత్నిస్తోంది. పెద వులు వణుకుతున్నాయే కానీ మాట రావ డంలేదు.

ఎ.సి. రూమ్‌లో కూడా ఆమె వళ్ళంతా చెమటలు పట్టేయసాగింది.

దేవిశ్రీ భర్త తన్మయి దగ్గరకు పరిగె త్తాడు.

వెంటనే ఏర్పాట్లు చకచక జరిగిపో యాయి. నిజానికది అతిసాధారణ డెలివ రీనే. కాని తన్మయి టెన్షన్ గమనించి డాక్టర్ కృష్ణప్రసాద్, డాక్టర్ పవన్‌లిద్దరూ డెలివరీ రూమ్‌లోకి వెళ్లారు.

అర్ధరాత్రి అయ్యాక ఆమెకు సిజేరియన్ చేశారు.

తన్మయికి ఆ బిడ్డను చూస్తున్నకొద్దీ ఆనందం అంబరమవసాగింది. నిజంగా ఇది సాధ్యమా!? తన ప్రయోగ ఫలితమా ఈ బిడ్డ? దేవిశ్రీకి మెలకువ రాగానే అడి గిన మొదటి ప్రశ్న బిడ్డ గురించే.

తన్మయి నవ్వుతూ బాబుని తీసుకొచ్చి తల్లికి చూపించింది. "బిడ్డ చాలా ఆరో గ్యంగా ఉన్నాడు. పన్నెండు పౌన్లు బరువు న్నాడు" అంది.

బాబును పరీక్షగా చూసి దగ్గరకు తీసుకు పోయింది. కాని నీరసానికి మగత కూడా తోడవటంతో బాబును ఎత్తుకోవడం ఆమెకు సాధ్యంకాలేదు.

"దేవిశ్రీగారూ! మీరు చాలా నీరసంగా ఉన్నారు. మీకింకా పూర్తిగా మెలకువ కూడా రాలేదు. విశ్రాంతి తీసుకోండి" అంటూ బాబుని ఉయ్యాలలో పడుకోబె




ట్టింది.

తాను తల్లిని అయ్యానన్న ఆనందం ఆమెను ఉక్కిరిబిక్కిరి చేస్తుంటే, దేవిశ్రీ కళ్ళు తిరిగి మగతగా మూతపడ్డాయి.

తన్మయి వెంటనే నీహారికకు ఫోన్ చేసింది. "హలో నీహా! నేను తన్మయి..."

నిద్రమత్తులో ఉన్న నీహారికకు ఇంకా పూర్తిగా మెలకువ రాలేదు. అందుకే మళ్ళీ అడిగింది. "ఎవరూమాట్లాడేది? "

"నేను... తన్మయిని" ఈసారి స్వరం పెంచి చెప్పింది.

అప్పటికి పూర్తిగా మెలకువ వచ్చింది. "హల్లో... తన్మయీ! ఏమిటి ఈవేళప్పుడు"

అప్పటికిగానీ తాను అర్ధరాత్రి ఫోన్ చేస్తున్న విషయం ఆమెకు గుర్తురాలేదు. "సారీ నీహా! నిద్రాభంగం కలిగించినట్టు న్నాను. దేవిశ్రీగారికి డెలివరీ అయ్యింది. బాబు పుట్టాడు. తల్లీ, బిడ్డ క్షేమంగా ఉన్నారు..."

దాంతో నీహారిక నిద్రమత్తు వదిలిపో యింది. స్నేహితురాలి విజయంలో తాను కూడా ఆనందం పంచుకుంది. ఆ తర్వాత కొంతసేపు ఏవో మాట్లాడుకున్నారు.

ఈ వార్త ప్రెస్కు ఎలా తెలిసిందోగాని రెండురోజుల తర్వాత దేవిశ్రీకి బాబు పుట్టా డని పేపర్లో వచ్చింది. అయితే సురక్షలో జరిగిన ప్రయోగం గురించి వారేమీ రాయ లేదు.

దేవిశ్రీ వంటి ప్రముఖ నటికి సంబంధిం చిన ముఖ్యవిషయం ఎన్నాళ్లని దాగు తుంది.

ప్రెస్కు తెలీకపోయినా ఈ వార్త చదివి మణి ఖంగుతిన్నాడు. సృజనకు యాక్సి డెంట్ చేయించినా ఫలితం లేకపోయింద న్నమాట' స్వగతంగా అనుకున్నాడు.

మొన్న అది. ఈరోజు ఇది. ఈ రెండిం టితో సురక్ష పేరు మారుమోగిపోతోంది. నిజానికి ఇదంతా తమ క్లినిక్కు చెందాల్సిన గౌరవం. కానీ తనే సునీల్ మాటలు విని ఓ వజ్రాన్ని జారవిడుచుకున్నాడు. సునీల్ మాత్రం చేసిందేముంది? ఆరోజు తన్మ యిని బయటకు పంపించాడు. ఈరోజు నీహారికమీద కక్ష కట్టాడు.

అంతే! అప్పటినుంచి సునీల్ను దూరంగా వుంచనారంభించాడు మణి.

ఇండ్యూస్డ్ ఇంపొటెన్సీకు కారణమైన ఇంజెక్షన్ల వాడకమైతే ప్రస్తుతానికి నిలిపివే శారు. కాని ఉత్పత్తిని మాత్రం ఆపివేయ లేదు.

నిజానికి ప్రతి మందుల కంపెనీ తన మందులమీద లేదా కవర్మీద ఆ మందు కంపోజిషన్ పేర్కొనాలి. అయితే అందులో ఉపయోగించే బేసిక్ డ్రగ్ గురించి వివరణ ఇవ్వనవసరంలేదు. ఈ బేసిక్డ్రగ్ సంబం ధిత మెడిసిన్కు వెన్నెముక కాబట్టి దాన్ని రహస్యంగా పెట్టుకోవచ్చు.

అయితే నీహారిక అనుమానిస్తున్నది నిజ మైతే ఈ ఇంజెక్షన్స్ను క్యూర్ వాళ్ళు తయా రుచేస్తున్నారు. వాళ్ళు కూడా తమ డ్రగ్ను మార్కెట్లోకి రిలీజ్ చేయలేదు. కేవలం అమృతకు మాత్రమే సప్లయ్ చేస్తున్నారు. కారణం కేవలం వ్యాపార దృక్పథమే.

అసలు ప్రతిమందుకు ధర నిర్ణయించే ముందు ఉత్పత్తి ఖర్చును దృష్టిలో పెట్టు కుంటారు. దీనిని ప్రభుత్వం నిర్ణయిస్తుంది. ఇందులో కూడా మళ్లీ కేటగిరీలు ఉంటాయి. ఇందులో కేటగిరి-4కు చెందిన మందుల ధర గురించి ప్రభుత్వం పెద్దగా పట్టించుకోదు. అంటే లావు తగ్గేందుకు, ఎత్తు పెరిగేందుకు లేదా ఇంకా ఇతర బ్యూటీ సంబంధిత మందులు ఈ కోవకు చెందినవిగా చెప్పుకోవచ్చు ఇంకా చెప్పా లంటే డబ్బున్నవాళ్ళకే పై రకాల మందు లతో అవసరం కాబట్టి వాటిని ఎంతకు అమ్ముకున్నా ఫర్వాలేదు. ఈ రకంగా చూస్తే మేల్ కాంట్రాసెప్టివ్లా పనిచేసే ఇంజెక్షన్ మార్కెట్లోకి విడుదల చేస్తే తప్ప నిసరిగా అందరికీ అందుబాటులో ఉన్న

ధరకే అమ్మాలి. పోనీ ఏదైనా రాజకీయాలు చేసి దానిని కేటగిరి-4లో పెట్టినా మామూలు వాళ్లు మూడు, నాలుగు వేలు ఖర్చుపెట్టి ఆ ఇంజెక్షన్స్ చేయించుకోడానికి ముందుకు రారు. పైగా ఆ అవసరం కూడా లేదుకదా! గర్భనిరోధక మాత్రలు తక్కువ ఖరీదుకే లభ్యం అవుతున్నప్పుడు ప్రత్యేకించి దీనికోసం అంత ఖర్చుపెట్టడం ఎందుకు అనుకుంటారు. అంతేకాదు కుటుంబ నియంత్రణ ఆపరేషన్లు స్త్రీలే చేయించుకోవాలని, మగవారు చేయించుకుంటే తమలో పుంసత్వం తగ్గిపోతుందనుకునేవారు నేటికీ మనదేశంలో ఎంతోమంది ఉన్నారు. అలాంటప్పుడు ఈ ఇంజెక్షన్స్‌కు మామూలు ధర కూడా పలుకుతుందన్న నమ్మకంలేదు.

సరిగ్గా ఇక్కడే డిఫరెంట్‌గా ఆలోచించాడు మణి.

అమృతలో వాడే మందులన్నీ క్యూర్ ఫార్మస్యూటికల్స్‌వారివే. ఆవిధంగా ఇద్దరి మధ్యా చక్కటి అవగాహన ఉంది. అందుకే ఇద్దరూ ఓ ఒప్పందానికి వచ్చారు. ఎవ్వరికీ తెలీకుండా చాలా రహస్యంగా బెంగుళూరులో తయారైన ఇంజెక్షన్స్ అమృత క్లినిక్‌లకు చేరుతున్నాయి.

పిల్లలు పుట్టక వచ్చే దంపతులతో మాట్లాడి మగవాళ్ళందరికీ ఈ ఇంజెక్షన్స్ చేస్తున్నారు. ట్రీట్‌మెంట్ తీసుకుంటే పిల్లలు పుడతారన్న నమ్మకంతో వాళ్ళూ సిద్ధపడుతున్నారు. ఒకవ్యక్తిమీద కనీసం ఇరవైవేలదాకా వస్తోంది. ఆ తర్వాత ఐ.వి.ఎఫ్. చేయడమో లేదా చిన్నపాటి లోపాలు సవరించడం ఇలా వ్యక్తినిబట్టి ట్రీట్‌మెంట్ మారుతోంది. ఆవిధంగా కొన్ని కోట్లు లాభం తెచ్చిపెట్టాడు మణి.

మొదట్లో ఇలా చేయడం అన్యాయం, అక్రమం అని సణిగిన డైరక్టర్స్ కూడా లాభాలు కళ్ళపడేసరికి నోరెత్తడం మానేశారు.

ఎప్పటికప్పుడు సెన్సేషన్ సృష్టించాలనుకునే మణికి తన్మయి బంగారుబాతులా కన్పించింది. కాని సునీల్ మూలంగా తాను అనుకున్నది సాధించుకోలేకపోయాడు. ఇప్పుడు పి.జి.డి. ద్వారా జనాన్ని ప్రభావితం చేయగలిగాడు. దాదాపు పదినెలలు వరకు ఢోకా లేకుండా సాగిపోతుందని మణి ఉద్దేశం. ట్రీట్‌మెంట్ తీసుకున్న స్త్రీలకు డెలివరీ అయ్యేదాకా మధ్యలో స్కానింగ్ రిపోర్టులు ఎలాగో మానేజ్ చేస్తాడు కాబట్టి అప్పటిదాకా సమస్య లేదు. ఈలోగా ఎవరికి ఇవ్వాల్సింది వాళ్ళకిచ్చేస్తాడు. దాంతో ఎవ్వరూ అతన్నేం చేయలేరన్న ధీమా కూడా ఉంది.

ఫోన్ మోగడంతో ఆలోచనలు పక్కన పెట్టి లిఫ్ట్ చేసింది. "హల్లో నీహా! నువ్వు వెంటనే బయలుదేరి రా! చాలా అర్జెంట్" అటువైపునుంచి కీర్తన స్వరం చాలా కంగారుగా విన్పించింది.

"ఏమైంది? ఎందుకలా ఖంగారు పడ్తున్నావ్?"

నీహారిక ప్రశ్నకు జవాబు చెప్పకుండా "నువ్వు వెంటనే బయలుదేరి రా. మిగతావన్నీ ఇక్కడకు వచ్చాక మాట్లాడుకుందాం" అని చెప్పి ఫోన్ పెట్టేసింది కీర్తన.

ఏంచేయాలో, వెళ్ళాలో లేదో ఏమీ అర్థంకాలేదు నీహారికకు.

ఒకవైపు శ్రీధర్... ఆమె భర్త తన శత్రువు... మరోపక్క స్నేహితురాలు. ఎన్నడూలేంది ఇలా అర్జెంట్‌గా రమ్మందంటే ఏదైనా ప్రమాదంలో చిక్కుకుందా అనే ఆలోచనలతో సమయం వృధా చేసుకునే కన్నా బెంగుళూరు వెళ్ళడమే మంచిదన్న నిర్ణయానికి వచ్చి మణికి ఫోన్‌చేసి తాను అర్జెంట్‌గా ఊరు వెడ్తున్నానని చెప్పి బయలుదేరింది.

  

రాజాభూపతిగారి కోడలుకు తొమ్మిది నెలలు నిండాయి.




ఆమెను అమృతా క్లినిక్‌లో చేర్పించారు.

ఆ సాయంత్రానికి పెయిన్స్ రావచ్చని, లేదంటే సిజేరియన్ చేయాల్సి వస్తుందని చెప్పాడు మణి.

ఈలోగా రాజాభూపతి బావమరిది నాగేంద్రవచ్చి మణితో ఏదో మాట్లాడి వెళ్లాడు.

ఈ విషయాలేమీ నీహారికకు తెలీదు. ఆమె బెంగుళూరు వెళ్ళేదార్లో ఉంది.

నొప్పులు రాకపోవడంతో గాయత్రీదేవికి సిజేరియన్ చేసి బిడ్డను బయటకు తీశారు.

నాగేంద్ర పెదవులమీద ఓ విచిత్రమైన నవ్వు కదలాడింది.

గాయత్రీదేవికి పుట్టిన బిడ్డను చూసి రాజాభూపతి మురిసిపోయాడు.

ఇన్నాళ్ళ తన ఆశ నెరవేరింది. తన వంశం నిలబెట్టే వారసుడు జన్మించాడన్న ఆనందం ఆయనను ఉక్కిరిబిక్కిరి చేసింది.

ఆసుపత్రిలో రోగులందరికి పళ్ళు, స్వీట్లు, బట్టలు పంచిపెట్టమని చెప్పారాయన.

ఈ అవకాశం వదులుకోలేదు మణి. ఆయనదగ్గరినుంచి క్లినిక్‌కు భారీగానే విరాళం రాబట్టాడు.

పక్కలో బిడ్డను గాయత్రీదేవి సంతృప్తిగా చూసుకుంది. ఇక ఆమె పిల్లలు తమ్ముడ్ని చూసి సంబరపడిపోయాడు.

ఈ విషయం మణి నీహారిక సెల్‌కు ఫోన్‌చేసి గాయత్రిదేవికి మగపిల్లాడు పుట్టాడని చెప్పాడు.

నిజంగానే నీహారిక సంతోషించింది. సఫలీకృతం కాని ప్రయోగం పేరిట వాళ్ళను ఆశలుపెట్టాననే వ్యథ తప్పిపోయింది. కాకపోతే డెలివరీకు ఇంకా టైం ఉండగా అంత ఖంగారుగా ఎందుకు ఆపరేషన్ చేశారో ఆమెకు అర్థంకాలేదు. అది కూడా తను ఊరికి బయలుదేరగానే...

★ ★ ★

నీహారికను చూసి సంబరపడిపోయింది కీర్తన.

"అసలు ఎందుకంత ఖంగారుగా పిలిపించావు? ముందది చెప్పు"

"ఏం లేదు. మొన్న ఇట్టే వచ్చి వెళ్ళిపోయావు. ఈసారైనా రెండు రోజులుంటావని. సరదాగా నీతో గడపాలని రమ్మన్నాను"

"చాల్లే... నీకింకా చిన్నతనం పోలేదు. నీకేమైందోనని నేనెంత ఖంగారుపడ్డానో తెలుసా" విసుక్కుంది నీహారిక.

కీర్తన ముఖం చిన్నబోయింది.

స్నేహితురాలిని అలా చూసేసరికి తెచ్చిపెట్టుకున్న కోపమంతా కరిగిపోయింది. "సర్లే, పద అవునూ ఇంతకీ మీ శ్రీవారు కన్పించరే" అడిగింది నీహారిక.

"స్టేట్స్ వెళ్ళారు" చిన్నగా చెప్పింది కీర్తన.

"ఏంటి? " తను సరిగా వినలేదేమోనని ప్రశ్న రిపీట్ చేసింది.

"నిజమే. నన్ను కూడా రమ్మన్నారు. నేనే రానన్నాను" కార్‌లో కూర్చుంటూ చెప్పింది కీర్తన.

ఎందుకోగానీ భర్త పేరెత్తగానే కీర్తన ముఖం కళ తప్పడం నీహారిక గమనించింది. స్నేహితురాలి భుజం చుట్టూ చెయ్యి వేస్తూ ఆప్యాయంగా అంది, "ఏంటి? మీరిద్దరూ ఏదైనా గొడవపడ్డారా? "

అప్పటిదాకా ఎలాగో బింకంగా ఉందికానీ ఇక కీర్తన వల్లకాలేదు. అంతే స్నేహితురాల్ని కరుచుకుని బావురుమంది.

కీర్తన వీపుమీద నెమ్మదిగా రాస్తూ ఓదార్చేందుకు ప్రయత్నించింది నీహారిక. "ఏమే! ఏమిటిది చిన్నపిల్లలా. చదువుకునే రోజుల్లో ఎంత డేరింగ్‌గా ఉండేదానివో మర్చిపోయావా? అసలు నేను చూస్తున్నది కీర్తన నేనా? లేక కీర్తన రూపంలో ఉన్న మరో అమ్మాయినా"

కీర్తన తననుతాను సర్దుకుంటూ అంది, "ఐ యామ్ సారీ. నా బాధను కంట్రోల్ చేసుకోలేకపోయాను"

# ఏరిన ముత్యాలు

★ సృష్టిలో సహజంగా ఉన్నది అనురాగం. కష్టించి మనం కల్పించుకున్నది ద్వేషం.

–రాధాకృష్ణన్

★ మతాలన్నింటినీ గౌరవించే సహనశక్తి ఉంటే సంఘర్షణలు, అంతఃకలహాలు ఉండవు.

–జయప్రకాష్ నారాయణ

★ మంచి నడవడి లేనివానిని చూసి లోకం భయపడుతుంది.

–ఫుల్లర్

★ జీవితంలో సుఖాంత నాటకాలన్నీ వివాహఘట్టంతో అంతమయ్యేవే.

–బైరన్

★ సర్దుబాటు చేసుకునే మనస్సు ఎన్నటికీ పరిశుద్ధమైన మనస్సు కాదు.

–జిడ్డు కృష్ణమూర్తి

★ త్యాగం లేకుండా ఘనకార్యాలు చేసి ఘనుడనిపించుకోలేవు.

–వివేకానంద

★ జారినమాట, ఎగిరిపోయిన పక్షి, గతించినకాలం, పోగొట్టుకున్న అవకాశం తిరిగి లభించడం దుర్లభం.

–భర్తృహరి

★ వృద్ధాప్యం సమీపిస్తున్నకొద్దీ సౌందర్యం లోలోపల దాక్కుంటుంది.

–లాంగ్‌ఫెలో

★ అజ్ఞాని మనస్సు అతని నాలుకలో ఉంటుంది. జ్ఞాని నాలుక అతని హృదయంలో ఉంటుంది.

–ఫ్రాంక్లిన్

★ అభ్యాసంవల్ల విద్య, గుణంవల్ల మానవుడు, దానం వల్ల ధనం, సాధుస్వభావం వల్ల అధికారం రాణిస్తాయి.

–చాణుక్యుడు

★ లోభిని మించిన దరిద్రుడు లేడు. అనుభవాన్ని మించిన గురువు లేడు.

–తిరువళ్ళువర్

★ జీవితం నాకు ఆలోచించడం నేర్పింది. కానీ ఆలోచనలు ఎలా జీవించాలో తెలియజేయడం లేదు.

–హెర్‌యన్

★ విద్యను ఆర్జించడం కంటే కూడా అజ్ఞానాన్ని కప్పిపుచ్చుకోవడం చాలా కష్టం.

–ఆడీస్ ఎకానమిస్ట్

★ అందరి సంతోషంలో నీ సంతోషాన్ని వెతుక్కో.

–జరాతుష్ట్ర

సేకరణ: పి.వి.రమణకుమార్

"ఎందుకే ఆ కన్నీరు. అసలేమైందని? "

"నీహా. నేను ఎప్పుడూ పెద్ద చదువులు చదువుకోవాలనో, పేరు ప్రతిష్టలు సంపాదించుకోవాలనో కోరుకోలేదు. ఓ నీతి, నిజాయితీగల భర్తకు భార్యగా, ముత్యాల్లాంటి పిల్లలకు తల్లిగా జీవించాలనుకున్నాను. అందుకే 'లా' చదివి కూడా న్యాయవాదిగా ప్రాక్టీస్ చేయకుండా పెళ్ళి చేసుకుని గృహిణిగా మిగిలిపోయాను. కానీ ఇప్పుడు నేను ఏ నీతి నిజాయితీలకు విలువిచ్చానో వాటి నేమాత్రం పట్టించుకోని భర్తకు భార్యను కావాల్సి వచ్చింది. ఇదేనేమో విధి లిఖితం అంటే" పేలవమైన నవ్వు కదలాడింది ఆమె పెదవులమీద.

"కీర్తనా..." అని పిలిచి కన్నార్పకుండా ఆమెవంక చూస్తుండిపోయింది. స్నేహితురాలిని ఎలా ఓదార్చాలో తెలియలేదు ఆమెకు.

"సరే వదిలెయ్! నీ గురించి చెప్పు. ఈమధ్య పేపర్లో నీపేరు మారుమోగిపోతోంది. నిజంగా చాలా గర్వంగా ఉంది" కారు పోర్టికోలో ఆపుతూ అంది కీర్తన.

భోజనం చేసి చాలాసేపు ఏవో మాట్లాడుకుంటూ ఉండిపోయారు. ఇంతకుముందటి ఉదాసీనత కీర్తనలో ఇప్పుడులేదు.

కొత్తస్థలం కావడంవల్ల నీహారికకు నిద్రపట్టలేదు. అది కూడా కాదు ఇంత చక్కటి అవకాశం పోతే మళ్ళీ దొరకదు కాబట్టి శ్రీధర్ రూమ్ వెతికితే తనకు కావాల్సిన రిపోర్ట్ దొరుకుతుందన్న ఆశ లేదా నమ్మకం ఆమెని స్థిరంగా ఉండనివ్వడం లేదు.

పక్కకు తిరిగి చూస్తే కీర్తన గాఢనిద్రలో వుంది.

నెమ్మదిగా లేచి బయటకు వచ్చి శబ్దం కాకుండా తలుపువేసింది నీహారిక.

శ్రీధర్ పర్సనల్ రూమ్‌లోకి ప్రవేశించింది.

షెల్ఫ్‌లనిండా పుస్తకాలు, పేపర్‌కటింగ్స్, ఓ పక్కగా కంప్యూటర్ అన్నీ చక్కగా సర్దిఉన్నాయి. ఎక్కడినుంచి మొదలుపెట్టాలో ఆమెకు అర్థంకాలేదు. ఒక్కోపుస్తకం, ఫైల్ అన్నీ క్షుణ్ణంగా గాలించడం మొదలుపెట్టింది.

ఒకవైపు ఆత్రుత, మరోవైపు కీర్తన నిద్రలేస్తుందన్న భయంతో చీమ చిటుక్కుమన్నా ఉలిక్కిపడుతోంది.

మొత్తం వెతికినా ఎక్కడా ఆమెకు కావాల్సింది లభించలేదు. దాదాపు మూడు గంటలపాటు వెతికి అలసిపోయిందామె. అన్నీ యథాప్రకారం సర్దేసి, గది తలుపులు మూసేసి వెళ్ళి కీర్తన పక్కన పడుకుంది.

"రిపోర్టు దొరికిందా? "

అంతే! ఉలిక్కిపడుతూ, ఠక్కున లేచి కూర్చుంది నీహారిక.

లైట్‌వేస్తూ అడిగింది కీర్తన. "నీకు కావాల్సిన రిపోర్టు దొరికిందా? "

నీహారిక గొంతు తడారిపోయింది. స్నేహితురాలి ఇంట్లో దొంగతనానికి పాల్పడ్డానన్న ఊహకు సిగ్గుపడిందామె.

"నీహా! ఇంతకుముందు చెప్పానే... ఏ నీతినిజాయితీలకు విలువనిచ్చానో వాటినే మాత్రం గౌరవించని వ్యక్తికి భార్యనయ్యానని. నిజానికి ఈరోజువరకూ శ్రీధర్ నాకేమీ లోటుచేయలేదు. కానీ ఈమధ్య శ్రీధర్ గురించిన నిజాలు ఒక్కొక్కటి తెలుస్తున్నాయి. మా మావగారు కూడా తన ప్రవర్తనకు బాధపడుతున్నారు. నీకో విషయం తెలుసా? అమృతలో ఇంపొటెన్సీ కేసులు ఎక్కువవుతున్నాయని డాక్టర్ జయరామ్ అన్నాడన్న వార్త పేపర్లో వచ్చినప్పుడు అందరికన్నా ఖంగారుపడిందీ, ఆందోళన చెందిందీ శ్రీధరే. తర్వాతే నాకు తెలిసింది ఇండ్యూస్డ్ ఇన్‌ఫెర్టిలిటీకి కారణమైన ఇంజెక్షన్లు క్యూర్ ఫార్మాస్యూటికల్స్‌లోనే తయారవుతున్నాయని. అది వినగానే నా ఆశల సౌధం కూలిపోయినట్టు అన్పించింది. నా కాళ్ళకింద భూమి కంపించిపోయింది. చాలా

ఆలోచించి నాలో నేను తర్జనభర్జనలు పడి శ్రీధర్‌ను అడిగాను. ఏమన్నాడో తెలుసా? ” ఒక్కక్షణం ఆగింది కీర్తన.

నీహారిక మౌనంగా వింటుండిపోయింది. స్నేహితురాలి మనస్తత్వం గురించి ఆమెకు బాగా తెలుసు. అవతలివారిని మోసగించడమన్నా, అలాంటి వ్యక్తులన్నా ఆమెకు చాలా అసహ్యం. అలాంటివారిని తన దరిదాపుల్లోకి రావడానికి కూడా అంగీకరించదు. అలాంటిది మోసాన్నే తన ఇంటి చిరునామాగా చేసుకున్న వ్యక్తితో జీవితాంతం జీవించాల్సి రావడం నిజంగా బాధాకరం.

“డబ్బుకోసం అవతలి వ్యక్తుల ప్రాణాలను సునాయాసంగా తీసేస్తున్నవారు, కేవలం తమ మందులు అమ్ముకోడానికి జనాన్ని అంగవికలుల్ని చేస్తున్నవారు, నిషేధించిన మందులు వాడుతున్నవారు ఎందరో ఉన్నారు. మనం అలాంటివేం చేయడంలేదుకదా. మన ఇంజెక్షన్స్‌వల్ల స్పెర్మ్ రిలీజ్ అవదు. అది కూడా తాత్కాలికంగా. తర్వాత యథాస్థితికి వస్తుంది. దీనికంత ఆందోళన చెందాల్సిన అవసరమేముంది? ఈ జనం గొర్రెలులాంటివాళ్ళు. తెలివిగా వీళ్ళను మచ్చిక చేసుకుని మనం డబ్బు సంపాదించుకోవాలి” అని తేలికగా కొట్టిపారేశాడు. నిజంగా అంతేనా, ఇంకేమీ లేదా? కేవలం మన గురించి మనం ఆలోచించుకుంటే సరా? మనపక్కవాడు ఎలా పోయినా ఫర్వాలేదా? నేనెంత ప్రయత్నించినా శ్రీధర్ ధోరణిలో మార్పురాలేదు” అలసటవల్లో, బాధవల్లో కీర్తన స్వరం బొంగురుపోయింది.

శ్రీధర్ చెప్పింది నిజమే. ఆరోగ్యంకోసం వాడే మందులలో ఎన్నో లొసుగులు ఉన్నాయి. థలిడోమైడ్ అనే మత్తుమందు గర్భిణీస్త్రీలు వాడిన ఫలితంగా కొన్నివేల మంది పిల్లలు అంగవైకల్యంతో పుట్టారు. అత్యద్భుతమూ, సురక్షితమూ, ఎలాంటి హాని చేయదని ఆ మందు ఉత్పత్తిదారులు చెప్పారు. కానీ స్త్రీలలో పరిధీయ నాడీవ్యవస్థ (పెరఫెరల్ న్యూరిటిస్) శాశ్వతంగా విచ్ఛిన్నమవడమేకాక నరాలు కొంకర్లు తిరిగిపోవడం, కాళ్ళూచేతులూ బలహీనపడడం, సమన్వయశక్తి లోపించడంలాంటివి బయటపడ్డాయి. డాక్టర్ల ఫిర్యాదు బయటకు రాకుండా కంపెనీ తన పలుకుబడిని ఉపయోగించింది. ఎవ్వరూ థలిడోమైడ్‌కు వ్యతిరేకంగా మాట్లాడకుండా ఉండేందుకు ప్రైవేట్ డిటెక్టివ్‌లను నియమించింది. ఇదొక్కటే కాదు ఇలాంటివెన్నో ఎన్నోసార్లు జరిగాయి, జరుగుతూనే వున్నాయి. ప్రజల శ్రేయస్సుకన్నా లాభార్జనే ప్రధానమని భావించే కంపెనీల దుష్కార్యాలు ఇవన్నీ. కానీ శ్రీధర్ అన్నట్టు వాటితో పోలిస్తే ఈ ఇంజెక్షన్లు ప్రమాదం కాదు అన్న వాదన కూడా కరెక్ట్ కాదు. ఎందుకంటే ఈ ఇంజెక్షన్స్ మనసుమీద ప్రభావం చూపి వారిని ఆత్మహత్యలవైపుకు పురిగొల్పుతున్నాయి.

“నీహా! శ్రీధర్‌లో నేను ఆశించిన మార్పు రాదు. అలా అని ఈ అన్యాయం నేను చూస్తూ ఊరుకోలేను. అప్పుడే ఒక్కొక్కటిగా అన్నీ పేర్చాను. మీ అన్నయ్య మరణానికి కారణం తెలిసింది. పవన్ నీగురించి...”

“పవనా? ” ఆశ్చర్యపోయింది నీహారిక.

“ఏం... అంత ఆశ్చర్యపోతున్నావ్? ఇంటర్‌లో మన క్లాస్‌మేట్ కదా. అదీగాక అప్పట్లో అతన్ని పిచ్చిగా ప్రేమించాను కూడా” చిన్నగా నవ్వింది కీర్తన.

“ఇదిగో నీకు కావాల్సిన రిపోర్టు. ఆ మెడికల్ పరిభాష నాకు తెలీదుగానీ మొత్తానికి ఇది నీకు బాగా ఉపయోగపడుతుంది” ఫైల్ అందించింది ఆమె.

“సారీ మై ఫ్రెండ్. నీ ఇంటికి వచ్చి దొంగతనానికి...”

“ప్లీజ్ నీహా! అవన్నీ మర్చిపో. నీ కర్తవ్యం నువ్వు నిర్వహించు. ఆల్ ది బెస్ట్” స్నేహితురాలి చేతిని తీసుకుని మృదువుగా





స్పృశిస్తూ అంది కీర్తన.

"థాంక్యూ... థాంక్స్ ఎలాట్. మరి ఈ విషయం శ్రీధర్..."

నీహారికకు ఎలా అడగాలో అర్థంకాలేదు.

"అవన్నీ నేను చూసుకుంటాను" క్లుప్తంగా అంది కీర్తన.

"నాకు మరో సహాయం చేయగలవా?" సంశయంగా అడిగింది నీహారిక.

"చెప్పు..."

"నాకు ఇంజెక్షన్ శాంపిల్ కావాలి. బేసిక్ డ్రగ్ ఏమిటో కూడా తెలియాలి. అఫ్‌కోర్స్ బేసిక్ డ్రగ్, కంపోజిషన్ ఈ ఫైల్లో దొరుకుతాయి. కాకపోతే ఆ బేసిక్ డ్రగ్‌గా వాడే పదార్థం ఏమిటో తెలియాలి. దాన్ని ల్యాబ్‌లో టెస్ట్ చేయించాలి"

"సరే..." అంది కీర్తన.

"దీనివల్ల... అదే ఇదంతా బయటకు వస్తే మీ కంపెనీ మూతపడచ్చు లేదా మీ ఉత్పత్తులను కొన్నాళ్ళు బ్యాన్ చేయవచ్చు"

"ఫర్వాలేదు. మా చదువు మాకు తిండి పెట్టలేకపోదు" స్థిరంగా పలికింది కీర్తన.

మరునాడు ఇద్దరూ కలిసి క్యూర్ ఫార్మాస్యూటికల్స్‌కు బయలుదేరారు.

దాదాపు పదెకరాల విస్తీర్ణంలో కట్టబడిన అయిదు అంతస్థుల భవనం అది. లోపల ఫ్యాక్టరీలో ఎవరి పని వారు చేసుకుపోతున్నారు. దేశంలో ప్రముఖులు కొందరికి వాటాలు ఇచ్చాకే కంపెనీ అభివృద్ధి చెందిందనీ షేర్ ధర బాగా పెరిగిందనీ అంటారు. ఇదంతా శ్రీధర్ కంపెనీ చూసుకోవడం మొదలెట్టాక జరిగినదే.

అక్కడ సెక్యూరిటీ చాలా బలంగా ఉంది.

ముందు కీర్తనని కూడా లోపలికి రానీయలేదు. తన ఐడెంటిటీ కార్డ్ చూపించింది. నీహారిక కార్లోనే వుండిపోయింది.

కీర్తనను లోపలికి రానిచ్చారు కానీ ఇద్దరు సెక్యూరిటీ గార్డ్‌లు ఆమె వెనుకే ఉన్నారు. కేవలం ఫ్యాక్టరీ చూడాలనే నెపంతో వచ్చినట్టు అంతా కలియచూసింది. ఆమెకు కావాల్సినవి ఓ పక్కగా తయారవుతున్నాయి. కానీ వాటినెలా తీసుకోవాలో అర్థంకాలేదు.

అంతే హఠాత్తుగా ఆమెకో ఆలోచన వచ్చింది. యధాలాపంగా వేసినట్లు సెక్యూరిటీ అలారం మోగించింది. అప్పటిదాకా కామ్‌గా ఉన్నచోట ఒక్కసారిగా కలకలం మొదలైంది. సెక్యూరిటీ అంతా అలెర్ట్ అయ్యింది. ఫ్యాక్టరీలోకి ఎవరో దొంగతనంగా ప్రవేశించారన్న పుకారు పుట్టింది. వాళ్ళ హడావిడిలో కీర్తనను ఎవ్వరూ పట్టించుకోలేదు. ఆ కాస్త విరామంలో తనకు కావాల్సినవి తీసుకుంది. మరికొంతసేపు వారితో మాట్లాడి బయటకు వచ్చేసింది.

అవి తీసుకుని నీహారిక హైద్రాబాద్ చేరింది. ఇప్పుడు ఆమె దగ్గర చాలా ఆధారాలున్నాయి. ఇక మణి తప్పించుకోవడం పూర్తిగా అసాధ్యం.



ఓరోజు రాజాభూపతిగారికి ఓ అపరిచితుడినుంచి ఫోన్‌వచ్చింది.

"హల్లో! రాజాభూపతిగారూ! మీకో విషయం చెప్పాలి" అన్నాడావ్యక్తి.

"చెప్పండి. ఏమి ఆ విషయం?"

"మీరు మనవడు పుట్టాడని చాలా సంబరపడి పోతున్నట్టున్నారు. కానీ ఆ బిడ్డ మీ బిడ్డకాదు. మీ కోడలికి పుట్టింది ఆడపిల్ల. ఆ బిడ్డ కూడా పుట్టగానే మరణించింది"

"ఏమిటి మీరు చెప్పేది? " రాజాభూపతి కళ్ళు అగ్నిగోళాల్లా ఎర్రగా మండుతున్నాయి. ఆ స్వరంలో ఆగ్రహావేశాలు మిన్నంటుతున్నాయి.

"నేను చెప్పేది నిజం. నమ్మకం లేకపోతే మీ అనుమానం తీరాలంటే డాక్టర్ దగ్గర పరీక్ష చేయించుకుంటే తెలిపోతుంది"

"ఎలా? " ఘీంకరించాడు రాజాభూపతి.

"చూడండి. అవన్నీ మీకు చెప్పినా అర్థం కాదుకానీ మీరు నేను చెప్పినట్టు చేయండి. ఆ టెస్టులేవో వాళ్ళే చేస్తారు" అని ఫోన్ పెట్టేశాడు ఆ అపరిచితుడు.

రాజాభూపతి ఏదైనా సహిస్తాడు కానీ నమ్మకద్రోహాన్ని సహించరు... క్షమించరు. ఇన్నాళ్ళికి వారసుడు పుట్టాడని మురిసిపోతుంటే ఇదేమిటి?

మనసులో అనుమాన బీజం ఒకసారి పడ్డాక నివృత్తి అయ్యేదాకా ఇక నిలవనీయదు. రాజాభూపతి కొడుకు ఎంతగా అభ్యంతరం పెట్టినా, ఆయన ఎవరి మాటా విన్పించుకోలేదు.

రాజాభూపతి వచ్చిన కారణం విన్న డా. కృష్ణప్రసాద్ అవాక్కయ్యాడు.

"చూడండి డాక్టర్‌గారూ! ఇలాంటి టెస్టులు చేయమని అడగడం ఉచితం కాదని మాకు తెలుసు. ఇలా అడగడం మా కోడలిని అవమానించడమేనని కూడా మాకు తెలుసు. కానీ సత్యప్రమాణంగా చెప్తున్నాను. మాకు మా కోడలిమీద ఎంతమాత్రం అనుమానం లేదు. మా కోడలు నిప్పు అని మాకు తెలుసు. ఇదేదో అమృతలోనే జరిగి ఉంటుంది. ఏది ఏమైనా మీరు మాయందు దయ ఉంచి మా అనుమానం నివృత్తి చేయాలి" అభ్యర్థించారు.

ఆయన్ని కన్విన్స్ చేయాలని కృష్ణప్రసాద్ ఎంతో ప్రయత్నించారు. కానీ అందుకు రాజాభూపతి ఒప్పుకోలేదు. ఆయన పట్టుదల ముందు కృష్ణప్రసాద్‌కు తలవంచక తప్పలేదు. మణి అకృత్యాలకు మంగళం పాడాలంటే రాజాభూపతివల్లే అవుతుందని కూడా కృష్ణప్రసాద్‌కి అన్పించింది.

రాజాభూపతి కొడుకు, కోడలు, మనవడు ముగ్గురి బ్లడ్ తీసుకుని టెస్ట్‌కు పంపారు.

రిపోర్ట్ చూస్తే రాజాభూపతికి వచ్చిన అపరిచిత ఫోన్ నిజమేనని తేలింది.

రాజాభూపతి కొడుకు బ్లడ్ గ్రూప్ 'బి' పాజిటివ్.

ఆయన కోడలు గాయిత్రీదేవి బ్లడ్ గ్రూప్ 'ఓ' పాజిటివ్.

కానీ రాజాభూపతి మనవడి బ్లడ్ గ్రూప్ 'ఎ'

అంటే పుట్టినబిడ్డ గాయత్రీదేవికి, రాజాభూపతి కొడుకుకు పుట్టినవాడుకాదు.

రాజాభూపతిగారిలో ఆగ్రహం కట్టలు తెంచుకుంది. కొడుకు, కోడలు, మనవడిని ఇంటికి పంపి ఆయన మాత్రం అమృత క్లినిక్‌కు దారితీశారు.

రిసెప్షనిస్ట్ పిలుస్తున్నా విన్పించుకోకుండా డాక్టర్ మణి రూమ్‌లోకి దూసుకువెళ్ళారు.

"చెప్పండి. మేం మీకేం ద్రోహం చేశామని మాతో ఇలా ఆడుకున్నారు? మిమ్మల్ని దేవుడిలా నమ్మినందుకు మాకింతటి అన్యాయం చేస్తారా? ఎందుకు ఇలాంటి అకృత్యానికి పాల్పడ్డారు? "

"ఏం జరిగింది? " తాపీగా ప్రశ్నించాడు డాక్టర్ మణి.

"మా దగ్గర పెరుగుతున్న బిడ్డ మా కోడలికి జన్మించినబిడ్డకాదు. ఎక్కడో ఏదో మోసం జరిగింది. ఆరోజు డెలివరీ టైంలో మీరు ఉన్నారు కాబట్టి నిజం మీకు తెలియకుండా ఉండదు. చెప్పండి... ఇప్పటికైనా నిజం చెప్పండి"

ఆయన ఆగ్రహం చూసి మణి కూడా ఒక్కక్షణం భయపడ్డాడు.





"రాజా భూపతిగారూ ముందు మీరు కూర్చోండి. ఇప్పుడు అసలు విషయం చెప్పండి? "

తనకు ఫోన్ రావడం ఫోన్‌లో తమద గ్గర పెరుగుతున్న బిడ్డ తమ కొడుకు, కోడ లికు పుట్టినవాడు కాదని ఆగంతకుడు చెప్పడం, తాము సురక్షకు వెళ్ళి రక్తపరీక్షలు జరిపించడండాకా మొత్తం చెప్పారాయన.

మణికి ఏంచేయాలో పాలుపోలేదు. తీగ లాగితే డొంకంతా కదులుతుంది. ఇప్పుడేం చేయాలి? ఏమని చెప్పి సమాధానపర చాలి?

"చెప్పండి. ఇందుకు బాధ్యులు ఎవరు? " రాజాభూపతి స్వరం ఖంగుమంది.

నుదుట పట్టిన చెమటను కర్చీఫ్‌తో అద్దు కుంటూ అన్నాడు మణి, "రాజావారూ. మీరు చెప్పింది వింటుంటే మాకెంతో బాధగా ఉంది. ఇలాంటి పొరపాటు జరిగే అవకాశమేలేదు. ఆరోజు డెలివరీ సమ యంలో నేను కూడా ఉన్నాను. మీ కోడలికి పుట్టింది మగబిడ్డే, అందులో మీకెలాంటి సందేహమూ వద్దు. సురక్షలో జరిగిన పరీ క్షల్లో ఎక్కడో ఏదో పొరపాటు జరిగి ఉంటుంది. నాకు కొద్దిరోజులు సమయమి వ్వండి. ఇందుకు కారకులైనవారిని పట్టి మీకు అప్పచెప్తాను"

రాజాభూపతిగారు మణి మాటలు విశ్వ సించారు. అంతకన్నా చేయడానికి కూడా ఏమీలేదు.

ఆయన వెళ్ళాక నీహారికకు ఫోన్‌చేశాడు.

"నీహారికా! నేను డాక్టర్ మణి..."

"చెప్పండి సార్!" అందామె. ఎందుకో ఉదయంనుంచి ఏదో జరగబోతోందని ఆమె మనసు గోలపెడ్తూనే ఉంది.

"ఐ యామ్ సారీ. ఎలా చెప్పాలో తెలీ డంలేదు. మనం చాలా చిక్కుల్లో పడ్డాం" మణి స్వరంలో భయం, విషాదం ధ్వనిం చాయి.

"ఏమైంది సర్? "

"మనం చేసిన మోసం రాజాభూపతిగా రికి తెలిసిపోయింది"

ఆ మాటకు నీహారిక ఉలిక్కిపడింది.

"మనం ఆయన్నేం మోసం చేశాం? "

"లేదమ్మా. నీకీ విషయం చెప్పకుండా దాచటం పొరపాటే. క్షమించు. నువ్వు ఆరోజు ఊరిలో లేవు. తర్వాత చెప్పటం కుదరలేదు"

"అసలేమైంది? " తాను మాట్లాడుతున్నది ఛీఫ్‌తో అని కూడా మర్చిపోయి అసహ నంగా అరిచింది నీహారిక.

"ఆరోజు... ఆరోజు గాయత్రీదేవికి పుట్టింది ఆడపిల్ల..."

"వ్వాట్...? "

"అవును. ఆ పిల్లకూడా పుట్టగానే మర ణించింది. ఏం చేయాలో మాకు పాలుపో లేదు. ఈ విషయం తెలిస్తే ఆయన ఆగ్ర హిస్తాడు. ఫలితంగా నీమీద ఎలాంటి చర్య తీసుకుంటాడోనని భయం కలిగింది. ఆ సమయంలో రాజాభూపతిగారి బావమరిది నాగేంద్ర దేవుడిలా వచ్చాడు. ఆయన కూతురికి కూడా ఇదే ఆసుపత్రిలో డెలివరీ అయ్యింది, కొడుకు పుట్టాడు. తన మనవ డిని గాయత్రీదేవి పక్కలో పడుకోబెట్టమని ఇప్పటికి ఆ గండం ఎలాగోలా గట్టెక్కితే ఆయన మూడ్ చూసి అసలు విషయం చెప్తానని చెప్పాడు. అప్పటికి అంతకన్నా మార్గం కన్పించలేదు. తర్వాత ఈ సమ స్యను వాళ్ళు వాళ్ళు పరిష్కరించుకుంటార్లే అనుకున్నాను. కానీ నాగేంద్ర ఆస్తిమీద ఆశతో ఇప్పటిదాకా ఈ విషయం బావకు చెప్పలేదనుకుంటాను. ఆయనకు ఎవరో ఫోన్‌చేసి 'ఈ బిడ్డ మీ మనవడుకాదు, మీ కోడలికి పుట్టింది ఆడపిల్ల, ఆ బిడ్డ కూడా పుట్టగానే మరణించింది' అని చెప్పార్ట. దాంతో ఆయన సురక్షకు వెళ్ళి రక్తపరీక్ష చేయించాడు. తర్వాత డి.ఎన్.ఏ. టెస్ట్ కూడా చేయించారట. ఆ బిడ్డ తమ మన వడు కాదని రూఢీ అయింది. అంతే ఆగ్ర

హావేశాలతో మనమీదకు దండెత్తారు. ఇప్ప టికి ఏదో సర్దిచెప్పానుకానీ, మొత్తానికి మనం చాలా పెద్ద ప్రమాదంలోనే పడ్డామ న్పిస్తోంది"

ఎన్నడూలేనిది మణి కూడా ఖంగారుప డుతున్నాడు. భయంతో వణికిపోతున్నాడు.

నీహారిక 'మణి' చెప్పింది విని స్థాణువై పోయింది.

ఆమె మెదడంతా మొద్దుబారిపోయింది. మణి ఫోన్ పెట్టేసినా ఆమె మాత్రం అలాగే ఫోన్ పట్టుకుని ఉండిపోయింది. మణి ఈ విషయాన్ని తనకింతవరకూ చెప్పలేదు. అసలు గాయత్రీదేవికి పుట్టినబిడ్డ చనిపో యిందా లేక వీళ్ళు నాటకమాడుతున్నారా?

ఆమెకు ఎవరిమాట నమ్మాలో అర్థంకావ డంలేదు. నెమ్మదిగా తాను ఓ ఊబిలో దిగ బడుతున్న భావన కలిగింది.

★ ★ ★

చాలా చిన్న సంఘటనలు ఒక్కోసారి జీవితాన్నే మార్చేస్తాయి. మనుష్యులమీద పెట్టుకున్న నమ్మకాన్ని సమూలంగా నాశనం చేసేస్తాయి. నీహారిక విషయంలో కూడా జరిగిందదే.

ఆరోజు సువర్చల ఫోన్ చేసింది. ఫోన్‌లో ఆమె చెప్పిన విషయం విన్న నీహా రిక షాక్ అయిపోయింది. నిజానికి ఇలాంటి విషయాలు ఆమె సెల్‌లో తప్ప మామూలు ఫోన్‌లో మాట్లాడటంలేదు. మణి ఎవ్వర్నీ నమ్మడని ఆమెకు తెలుసు. అందుకే తన ఫోన్ ట్యాప్ చేయించాడేమో నన్న అనుమానం ఆమెలో ఉంది. అయితే సువర్చల ఆ విషయం మర్చిపోయింది. నీహారిక కూడా భార్గవ్ గురించి అనేసరికి అదేదో తెలుసుకోవాలన్న ఆత్రుతలో సువ ర్చలను వారించలేకపోయింది. ఈ మొత్తం సంభాషణ మణి విన్నాడు.

సువర్చల చెప్పినదానిలో అనుమానించ డానికి ఏమీ లేదు. ఆ ఇంజెక్షన్స్ కనుక్కు న్నది, క్యూర్ వారికి కంపోజిషన్ ఇచ్చిందీ భార్గవేనని ఇంట్లో ఆ రిపోర్ట్స్ దొరికాయని చెప్పింది.

అక్కడితో ఆగకుండా నీహారిక ఆ రిపో ర్ట్స్‌ను జిరాక్స్ తీసి తనకు పంపమని చెప్పింది. ఆ తర్వాత కూడా ఏంచేయాలో సూచనలు చేసింది. అదే మణిలో అను మానం కల్గించింది.

సువర్చల, నీహారిక మాటలు విని మణి షాకయ్యాడు. అప్పటికప్పుడు వెళ్ళి నీహారి కను చంపేయాలన్నంత కోపం వచ్చింది. వెంటనే సునీల్‌ను పిలిపించాడు. ఇప్పుడు సునీల్ కూడా ఎదురు తిరిగితే తాను చాలా చిక్కుల్లో పడాల్సి వస్తుందని మణికి తెలుసు.

సునీల్ కోరుకున్నది కూడా ఇదే. సునీల్ 'నా' గురించి తప్పితే వేరేవారి గురించి ఆలోచించడు. నా పేరుప్రతిష్టలు, నా డబ్బు, నా అధికారం నా కుటుంబం ఇలా అంతా నేను, నా చుట్టే తిరుగుతుంటుంది. తనకు తన్మయి అడ్డువస్తుందనుకున్నాడు ఆమెను పంపేశాడు. కానీ నీహారిక విష యంలో అది కుదరలేదు. ఏకుమేకై కూర్చు న్నట్లు ఆమె మణి అభిమానం సంపాదించ డంతోపాటు తనమీద దురభిప్రాయం కలి గించింది. అప్పటికీ మణిని నీహారిక విష యంలో ఎన్నోసార్లు హెచ్చరించాడు. కాని మణి వినలేదు. దాంతో తనే రాజాభూప తికి ఫోన్‌చేసి ఆయన్ని రెచ్చగొట్టాడు. ఇప్పుడు తిరిగి మణి తన కాళ్ళబేరానికే వచ్చాడు. గర్వంగా నవ్వుకున్నాడు సునీల్.

"మిస్టర్ సునీల్, ఒక్కసారి మీకు అభ్యం తరం లేకపోతే అంకితను పిలిపించగ లరా? " రిక్వెస్టింగ్‌గా అడిగాడు మణి.

మణి అద్భుత నటుడు. ఏ టైంలో అధి కారం చూపాలో, ఏటైంలో రిక్వెస్ట్ చేయాలో బాగా తెలుసు.

డాక్టర్ మణి చెప్పింది విన్నాక సునీల్‌కు చిన్నపిల్లాడిలా డ్యాన్స్ చేయాలన్పించింది. ఒకసారి అంకితతో మణి మాట్లాడితే చాలా





సమస్యలు తొలగిపోతాయని సునీల్‌కు తెలుసు. ఎందుకంటే మణి తల్చుకుంటే ఎలాంటి మనిషినుంచయినా నిజం చెప్పించగలడు.

"ఎస్ సర్! తప్పకుండా మా అమ్మాయిని తీసుకువస్తాను" అంతకన్నా నమ్రతగా అన్నాడు డాక్టర్ సునీల్.

మణి తిరిగి తనపనిలో పడ్డాడు.

నీహారికకు కంప్యూటర్ రూమ్ లాక్ కోడ్ ఎలా తెలిసింది? తనకు, సునీల్‌కు, డాక్టర్ భార్గవ్‌కు మినహా ఈ కోడ్ నెంబర్ ఎవ్వరికీ తెలీదు. తను చెప్పడు. పోతే భార్గవ్, సునీల్‌లిద్దరిలో ఎవ్వరైనా చెప్పుండాలి. తను నీహారిక చెప్పినదానికల్లా గుడ్డిగా తలూపాడే కాని లాజిక్‌గా ఆలోచించలేకపోయాడు.

డాక్టర్ మణి తనముందున్న కాగితంమీద తన అనుమానాలు రాయసాగాడు.

డాక్టర్ నీహారికకు కంప్యూటర్ రూమ్ లాక్‌కోడ్ ఎలా తెలిసింది? సునీల్‌కానీ భార్గవ్‌కానీ చెప్పుండాలి.

నీహారికకు కంప్యూటర్ కోడ్ వర్డ్ ఎలా తెలిసింది? కోడ్ వర్డ్ తెలియనిదే ఫైల్ ఓపెన్ కాదు. ఫైల్ ఓపెన్ కావాలంటే పేషెంట్ డేటాఫ్‌బర్త్ తెలియాలి. డేటాఫ్‌బర్త్‌లు ఇక్కడ చాలా కాన్ఫిడెన్షియల్‌గా ఉంచబడతాయి. డాక్టర్ సునీల్‌కు కూడా తెలిసే అవకాశంలేదు. భార్గవ్‌కు తెలీదు. మరి ఎవరు చెప్పుంటారు?

సునీల్ పేషెంట్స్ దగ్గరకు వెళ్ళిన విషయం తన ఫ్రెండ్ భర్త చెప్పాడని చెప్పింది. అసలు సునీల్‌మీద నీహారికకు అనుమానం ఎందుకొచ్చింది.

మణిలాంటి వ్యక్తికి ఆ విషయం తెలుసుకోవడం పెద్ద కష్టమేం కాదు. విశాల్ ద్వారా ఆ సమాచారం నీహారికకు అందిందని తెల్సింది. అంకితతో మాట్లాడితే మిగతా ప్రశ్నలకు కూడా జవాబులు దొరుకుతాయి. మణికి ఎందుకో చాలా అలసటగా ఉంది. ఇంట్లో సమస్యలు, కూతురి కాపురం తాలుకు గొడవలు, మధ్యలో తన అనారోగ్యం వల్ల నీహారిక చెప్పిందానికల్లా గుడ్డిగా తలూపాడుగాని, ఇంతటి సమాచారం సేకరించిందంటే దీని వెనుక ఆమె తెలివితేటలకన్నా తన చేతకాని తనమే ఎక్కువ ఉంది.

"మే ఐ కమిన్ సర్...!"

కళ్ళు తెరిచి చూశాడు మణి. ఆ అమ్మాయి ఎవరో అర్థంకానట్టుగా భృకుటి ముడిచాడు.

"సర్! నేను అంకిత... సునీల్‌గారి అమ్మాయిని"

"ఓ... నువ్వా! రామ్మా... ప్లీజ్ కమ్..." ఎంతో ఆత్మీయంగా ఆహ్వానించాడు మణి.

"థాంక్యూ సర్!" అంది అంకిత ఆయన ఎదురుగా ఉన్న కుర్చీలో కూర్చుంటూ.

ఒకక్షణం తర్వాత అడిగింది. "డాడీ! మీరేదో మాట్లాడాలన్నారని చెప్పారు..."

"అవును! ఫీల్‌ఫ్రీ... పెద్ద ముఖ్య విషయమేమీకాదు. నువ్వు చాలా ధైర్యవంతురాలివని, ఓ రాత్రంతా కంప్యూటర్ రూమ్‌లో ఉన్నావని తెల్సింది. నిజమేనా?" చాలా కాజువల్‌గా అడిగాడు మణి.

ఆ ప్రశ్నకు అంకిత ఉలిక్కిపడింది. భయంతో ఆమె శరీరం సన్నగా కంపించింది. గొంతు తడారిపోతుండగా అడిగింది, "మీకు ఎవరు చెప్పారు?"

ఉత్తప్పుడైతే తనను అలా ఎవరైనా ప్రశ్నించడానికి అస్సలు అవకాశం ఇవ్వడు. కాని ఆ అమ్మాయి అసలే భయపడిపోతోంది. తను బెదిరిస్తే మరీ బెదిరిపోతుంది. ఏడ్చేస్తుంది. డాక్టర్ సునీల్ తాను ఎంత కష్టపడ్డా సహిస్తాడు కాని కూతురు కంట ఒక్క కన్నీటిబిందువు ఒలికినా భరించలేడు. అందుకు ఎవరు కారణమైనా వారిని క్షమించడు.

ఆ అమ్మాయి ముఖంలో వస్తున్న మార్పులు గమనిస్తూ చెప్పాడు "డాక్టర్

నీహారిక..."

ఆ మాటకు అంకిత విస్తుబోయింది. తన తండ్రి చెప్పాడేమో అనుకుందికాని నీహారిక చెప్పుందని ఆమె ఊహించలేదు.

"నీహారికా...?"

"అవును! నీహారిక నాకు మొత్తం అంతా వివరంగా చెప్పింది..." మొత్తం అంతా వివరంగా అన్న మాటను కొంచెం స్ట్రెస్ చేసి మరీ పలికాడు డాక్టర్ మణి.

ఆ మాటకు అంకిత మొదట అనుమానంగాను తర్వాత ఆశ్చర్యంగానూ చూస్తూ అడిగింది. "నిజంగా నీహారికే చెప్పిందా?"

తనను ఎవ్వరికీ చెప్పవద్దని ఆమె ఎందుకు చెప్పిందో అంకితకు అర్థంకాలేదు.

"అవును... మీమధ్య జరిగిన సంభాషణంతా వివరంగా చెప్పింది. చూడమ్మా నువ్వు నాకు కూతురులాంటిదానివి. మీ డాడీని గురించి భయపడకు. కాబట్టి ఆరోజు జరిగిందేమిటో వివరంగా చెప్పు..." తెచ్చి పెట్టుకున్న ఆత్మీయత అని ఆ గొంతు విన్న వారికి ఎవరికైనా అర్థం అవుతుంది.

అప్పటికీ అంకిత నోరు విప్పలేదు. ఆయనవంక అనుమానంగా చూస్తుండిపోయింది. "చూడు అంకితా! నేనెంత దుర్మార్గుడ్నో ఇక్కడ్నించి బయటకు వెళ్ళాక ఎవరిని అడిగినా చెప్తారు. నీవు చేసిన అనాలోచిత పనివల్ల నేను, మీ డాడీ ఇప్పుడెంతో ప్రమాదంలో పడ్డాం. ఇప్పటికైనా జరిగిందేమిటో చెప్పు. లేదంటే నీ కుటుంబంలో ఒక్కరు కూడా మిగలరు" కఠినంగా వచ్చాయా మాటలు.

అప్పటిదాకా ప్రదర్శించిన ఆప్యాయత ఇప్పుడు మచ్చుకైనా కన్పించలేదు.

అంతకుముందే తండ్రి నోటివెంట మణి దుర్మార్గత్వం గురించి విని వుంది. అందుకే బెదురుచూపులు చూస్తూ మొత్తం విషయం చెప్పేసింది. నీహారిక తనను కాలేజీలో కలవడం దగ్గరినుంచి అక్షరం పొల్లుపోకుండా చెప్పింది.

"అంటే ఆరోజు నీతోపాటు నీహారిక కూడా రూమ్‌లో ఉందా?" మరోసారి అడిగాడాయన.

"తెలీదు... నేను రూమ్‌లోకి వెళ్ళగానే నిద్రపోయాను. తిరిగి డాడీ వచ్చి లేపేదాకా నాకు మెలకువలేదు"

అంటే ఈ అమ్మాయితో ఏదైనా త్రాగించడమో, ఇంజెక్షన్ చేయడమోలాంటిది చేసి మత్తుగా నిద్రపోనిచ్చి నీహారిక తన పని తాను చేసుకుపోయిందన్నమాట. ఇక అంకితను తిరిగి ప్రశ్నించి వేస్ట్. ఆమెకు తెల్సినంతవరకు చెప్పింది. ఒకసారి కంప్యూటర్ రూమ్‌లోకి ఎంటరయ్యాక ఆమె తెలివితేటలతో కంప్యూటర్ కోడ్ కనుక్కోవడం పెద్ద కష్టమేం కాదు.

నీహారిక తెలివికి మణికి ముచ్చటేసింది. తన్మయి, నీహారిక ఇద్దరూ మేధావులే. అయితే ధైర్యం విషయానికివస్తే నీహారిక తన్మయి కన్నా చాలా మెట్లు ఎత్తులో ఉంటుంది. ఇలాంటి ఇద్దరు అమ్మాయిలు తనతో శత్రుత్వం పెంచుకోకుండా వుంటే ఎంతో బాగుండేది.

ఇద్దరూ ఇద్దరే మహామేధావులు.

నీహారికలో ఉన్న ధైర్యం, తెగువ తన్మయిలో లేవు.

ఒకరు నిండుకుండ అయితే మరొకరు ఉరికే జలపాతం.

మళ్ళీ వర్క్ దగ్గరకు వచ్చేసరికి ఇద్దరూ సిన్సియర్లే...

వారిద్దరిమీదా తను పుత్రికావాత్సల్యం పెంచుకోవడంవల్లనే వారిపట్ల కఠినంగాను, దుర్మార్గంగాను ప్రవర్తించలేకపోయాడు. అందువల్ల తాను భారీమూల్యం చెల్లించాల్సి వస్తోంది.

ఈలోగా భార్గవ్‌నుంచి మరో ఉపద్రవం వచ్చిపడింది. సువర్చల ఇంట్లోంచి వెళ్ళిపోతూ భార్గవ్ తాలుకు డైరీలు, మరికొన్ని ఫైల్స్ తీసుకుని వెళ్ళిపోవడమేకాక పోలీసు రిపోర్టు ఇచ్చింది. తనకు ప్రొటెక్షన్ ఏర్పా





టుచేసుకుంది.

అన్నివైపులనుంచి ద్వారాలు మూసుకుపోయిన ఫీలింగ్ కలిగింది మణిలో. ఈ సమయంలో నీహారికను చంపేయడం మినహా మరోమార్గం కన్పించలేదు. అది కూడా ఎవ్వరికీ అనుమానం రాకుండా చేయాలి. అన్నింటిని మించి ఆమె దగ్గరున్న ఆధారాలు సంపాదించాలి.

ఆ తర్వాత పేషెంట్స్ ఇంటికి నమ్మకస్థుల్ని పంపాడు. డాక్టర్ సునీల్ ఫోటో చూపించి ఆరోజు ఇక్కడకు వచ్చి మిమ్మల్ని ప్రశ్నించింది ఈయనేనా అని అడిగితే వారు కాదన్నారు. అప్పుడు సునీల్‌మీద అనుమానం తొలగిపోయింది. ఇంతవరకు ఎక్కడా అనుమానం రాకుండా వ్యవహరించిన నీహారిక కేవలం సువర్చల ఫోన్ చేసినప్పుడు ప్రదర్శించిన తొందరవల్ల దొరికిపోయింది. ఏదిఏమైనా ప్రత్యర్థి తెలివికి మణి ముచ్చటపడ్డాడు.

★ ★ ★

డాక్టర్ మణి రాజాభూపతిని కలిశాడు.

నీహారికమీద ఎవరైనా కంప్లైంట్ ఇవ్వాలి. తన పి.జి.డి. సక్సెస్ అయ్యిందని ప్రెస్‌మీటింగ్‌లో చెప్పాడు. తన కూతురినే అందుకు ఉదాహరణగా చూపాడు కాబట్టి తను కంప్లైంట్ ఇచ్చినా ఎవ్వరూ విలువ ఇవ్వరు. అందుకే రాజాభూపతితో ఇప్పించాలి. అటు పోలీసులు ఆమెకోసం వెతుకుతుంటారు. ఇటు తన మనుష్యులు... ఇక ఎటు తప్పించుకోగలదు? అమృతకు తీసుకువచ్చి చంపడం పెద్దకష్టమేం కాదు. ఆ తర్వాత తాను చేసిన మోసానికి శిక్ష అనుభవించాలని ఆమె ఆత్మహత్య చేసుకుందని చిత్రించచ్చు.

మణి ముఖంలో ఓ క్రూరమైన నవ్వు కదలాడింది.

"చెప్పండి... ఎవరు మిమ్మల్ని మోసం చేసింది"

రాజాభూపతి కళ్ళు నిప్పుకణాలు కురిపిస్తున్నట్టుగా ఉన్నాయి.

"చెప్పండి! మా కరవాలానికి చాలా దినంబులనుండి పనియే లేదు. ఇందుకు కారణమైన వారి తలను ఒక్కవేటుతో నరకడం ద్వారా కరవాలానికి పనికల్పిస్తాం"

"లేదు...లేదు" ఖంగారుగా అన్నాడు మణి. "మీరలా చట్టాన్ని మీ చేతిలోకి తీసుకోకూడదు. ఈ పనికి పాల్పడిన వారిని చట్టానికి పట్టిద్దాం. పత్రికలలో, టీ.వీ.లో వారి పేరు కన్పించాలి. జనం అసహ్యించుకుంటుంటే సిగ్గుతో తలెత్తుకోలేక కుళ్ళికుళ్ళి చావాలి" మణి మాటల వెనుక కోపం, క్రూరత్వం వ్యక్తమవుతున్నాయి.

రాజాభూపతిగారు ఆలోచనలో పడ్డారు.

ఆయన సందిగ్ధం గమనించాడు డాక్టర్ మణి "మీరు ఇందుకు అంగీకరిస్తేనే నేను వారి పేర్లు చెప్తాను"

"సరే! కానిండు... మీరు చెప్పినట్టే చేద్దాం"

"రాజావారూ! మేము డాక్టర్ నీహారిక మాటలు నమ్మి పి.జి.డి. అనే ప్రయోగం సక్సెస్ అయ్యిందని ప్రకటించాము. మా అమ్మాయికి మగపిల్లాడు పుట్టడానికి, ఈ ప్రయోగానికి ఎలాంటి సంబంధంలేదని, అసలీ ప్రయోగం విజయవంతం కాలేదని మాకీమధ్యనే తెలిసింది. తనమీద ఉన్న నమ్మకాన్ని ఆసరాగా తీసుకుని ఇంత నాటకం ఆడుతుందని, మా విశ్వాసాన్ని వమ్ముచేస్తుందని మేము ఊహించలేదు. అసలు విషయం మాకీమధ్యనే తెలిసింది. వెంటనే మీకు చెప్పాలనుకున్నాం. కానీ అప్పుడు చెప్తే మీ కోడలి ప్రాణానికి ప్రమాదమని డెలివరీ దాకా ఆగాం. మీ కోడలికి సిజేరియన్ చేసినప్పుడు నేనూ ఉన్నాను. అయితే మధ్యలో మరో సీరియస్ కేసు రావడంతో నేను బయటకు వచ్చేశాను. మీ కోడలికి మగపిల్లాడు పుట్టాడని చెప్తే మీతో పాటే మేము నిజమనుకున్నాం కాని ఈ మ



ధ్యనే తెలిసింది మీ బావమరిదితో కలిసి ఆమె నాటకమాడి బిడ్డను మార్చేసిందని"

"ఎవరు నాగేంద్రతోనా? "

"అవును! నాగేంద్ర కూతురికి కూడా మా క్లినిక్‌లోనే ఆరోజు డెలివరీ అయ్యింది. వాళ్ళ బిడ్డే మీ మనవడిగా పెరుగుతున్నాడు"

"మరి మా బిడ్డ..."

"మీకు ఆడపిల్ల జన్మించింది. పుట్టగానే ఆ బిడ్డ మరణించింది"

బాధతో రాజాభూపతి కళ్ళు మూసుకున్నారు.

"ఇప్పుడు చెప్పండి! ఆ అమ్మాయిని శిక్షించాలా? లేదా? మీది రాజవంశం. పౌరుషానికే ప్రతిరూపం. అన్యాయం, అవినీతిని ఎదిరించడంలో మీకు మీరే సాటని అంటుంటారు. మీతోపాటు నేను కూడా కంప్లెయింట్ ఇస్తున్నాను" అన్నాడు మణి.

రాజాభూపతికి ఆలోచించుకునే వ్యవధి లేకపోయింది.

మరేమీ ఆలోచించకుండా మణి వెంట నడిచారు.

★ ★ ★

పవన్ పుట్టినరోజు పార్టీ జరుగుతోంది. అప్పటికే అతిథులు వచ్చారు. మరికొందరు వస్తున్నారు.

నీహారిక, తన్మయి, బామ్మగారు కూడా అక్కడే ఉన్నారు.

పవన్ కేక్ కట్‌చేశాడు. ముందు తల్లికీ, తండ్రికీ తినిపించాడు తర్వాత తన్మయి కూడా పవన్ నోట్లో కేక్ పెట్టింది.

అందరూ సంతోషంగా ఉన్న సమయంలో నీహారిక సెల్ రింగయ్యింది. "హల్లో! నీహా! నేను అమ్మను" ఆందోళనగాను, ఖంగారుగాను పలికింది ఆవిడ స్వరం.

"చెప్పమ్మా! ఏమైంది? ఎందుకంత ఖంగారు పడ్తున్నావ్? "

ఆవిడ సమాధానం చెప్పకుండా ఏడ్చేయ సాగింది. "అమ్మా! ఏమైంది? ఏమైందో చెప్పు..." అరిచినట్టే అడిగింది నీహారిక.

"నీహా! నువ్వు క్షేమంగానే ఉన్నావు కదా!"

"నాకేం కాలేదమ్మా! నేను క్షేమంగానే ఉన్నాను. ఇదిగో కావాలంటే తన్మయితో మాట్లాడు" ఫోన్ తన్మయి చేతికిచ్చింది.

"హల్లో! ఆంటీ! తన్మయిని మాట్లాడుతున్నాను. నీహా క్షేమంగానే ఉంది. పవన్ పుట్టినరోజు పార్టీలో ఉన్నాం. మరో అరగంటలో నీహా అక్కడుంటుంది సరేనా? "

"లేదు... వద్దు...నీహా ఇక్కడకు రావద్దు..." గబగబ అంది ఆవిడ.

"ఏమిటాంటీ? ఏమైందసలు? మీరెందుకంత ఖంగారు పడ్తున్నారు? నీహారికను ఎందుకు రావద్దంటున్నారు? " అడిగింది తన్మయి. ఆమెకంతా అయోమయంగా ఉంది.

"అయ్యో! నేనెలా చెప్పేది! అమ్మా తన్మయి! మా వాడు పోయినప్పటినుంచి మేము దేని గురించీ పట్టించుకోవడంలేదు. మా నీహా ఎవరితో గొడవ పెట్టుకుందో తెలీదుకాని, అదేదో ప్రమాదంలో పడిందమ్మా! ఎవరో రౌడీలు వచ్చి మమ్మల్ని బెదిరించారు! ఏవో కాగితాలు కావాలంటూ ఇల్లంతా చిందరవందర చేశారు! సామాన్లన్నీ పగలకొట్టారు"

"ఆంటీ! మీరు చెప్పేది"

"అవునమ్మా! వాళ్ళెందుకొచ్చారో తెలీదు. వాళ్లకేం కావాలో తెలీదు. కొడుకు పోయిన దుఃఖంలోంచే ఇంకా తేరుకోలేదు! అలాంటిది కూతురు"

ఆవిడ భోరుమంది.

"ఆంటీ ప్లీజ్! మీరలా బాధపడద్దు! నీహారికకు ఏమీకాదు. మేమంతా తనకు అండగా ఉండగా ఎవ్వరూ ఏమి చేయలేరు. మీరు ధైర్యంగా ఉండండి... నేను మళ్ళీ ఫోన్‌చేస్తాను"

అంతలో పవన్ అక్కడికి వచ్చాడు.




తన్మయి విషయమంతా చెప్పింది.

"బహుశా ఇదంతా మణి పనే అయివుం టుంది. నామీద ఏదో అనుమానం వచ్చుం టుంది" అంది నీహారిక.

"నువ్విక్కడ ఉండడం చాలామంచిదైంది. లేదంటే"

తన్మయి మాట పూర్తికాకుండానే మళ్ళీ సెల్ రింగయ్యింది.

"హల్లో! నేను విశాల్..."

ఫోన్ వెంటనే నీహారికకు ఇచ్చింది. "హల్లో! నీహా! నేను విశాల్‌ని మాట్లాడుతు న్నాను. మణికి మనమీద అనుమానం వచ్చింది. దాంతో అంకితను పిలిచి అడి గారు. ఆ అమ్మాయి నిజం చెప్పేసిందిట. భార్గవ్, మణి, సునీల్ ముగ్గురూ ఏకమ య్యారు. రాజాభూపతిని రెచ్చగొట్టి కంప్లె యింట్ ఇప్పిస్తున్నారు. ఒకవైపు పోలీ సులు, మరొకవైపు మణి మనుష్యులు మన కోసం వెతుకుతున్నారు. నువ్వు దొరికితే అక్కడికక్కడ చంపేయడమో లేదా క్లినిక్‌కు తీసుకురావడమో చేయమని మణి చెప్పా డట. దయచేసి బయటకు రాకండి" గబ గబ మాట్లాడేస్తున్నాడు.

"మీరెక్కడ ఉన్నారు?" నీహారిక ఆదు ర్దాగా అడిగింది.

విశాల్ సమాధానం చెప్పేలోపున మను ష్యుల అరుపులు విన్పించాయి. "వేసె య్యండి! నరికెయ్యండి" అంటూ దాంతోపాటే విశాల్ అరుపులు కూడా.

"విశాల్...విశాల్! మాట్లాడు... నువ్వెక్క డున్నావో చెప్పు" గట్టిగా అరవసాగింది నీహారిక.

పవన్ ఆమె చేతిలోంచి ఫోన్ తీసుకు న్నాడు. నెంబర్ చూసి గబగబ ఎంక్వైయి రీకి చేసి అడ్రస్ అడిగాడు. అది విశాల్ ఇంటినెంబరే.

పవన్ సురక్షకు ఫోన్‌చేసి అడ్రస్ చెప్పి అంబులెన్స్ పంపమని చెప్పాడు. నీహారి కకు పిచ్చిపట్టినట్టుగా ఉంది. విశాల్ చావు బతుకుల్లో ఉన్నాడంటే ఆమె తట్టుకోలేకపో తోంది. అరవింద్ మరణం తాలుకూ మిస్ట రీని ఛేదించడంలో ఒకటైన వారిద్దరి మన సులు కూడా కలిశాయి. ఆ విషయం పవన్ అర్థం చేసుకున్నాడు.

"పవన్! నేను కూడా నీతో వస్తాను..." అంటూ కారెక్కబోయింది.

తన్మయి నీహారికను పట్టుకుంది. "నీహా! ప్లీజ్... ప్లీజ్ కంట్రోల్ యువర్‌సెల్ఫ్. మా అందరకు ధైర్యం చెప్పే నువ్వేనా ఇలా బేలగా మాట్లాడుతున్నది. విశాల్‌కేమీకాదు! నామాట నమ్ము... అసలే నీకోసం మణి మనుష్యులు వెతుకుతున్నారు. ఈ సమ యంలో నువ్వు బయటకు వెళ్ళడం ఎంత ప్రమాదమో ఆలోచించు" అనునయించింది తన్మయి.

ఈలోగా రాజాభూపతి కృష్ణప్రసాద్‌కు ఫోన్‌చేసి నీహారికమీద కంప్లెయింట్ ఇచ్చి నట్టు చెప్పారు.

ఒకవైపు పోలీసులు, మరోవైపు మణి మనుష్యులు నీహారిక కోసం వెతుకుతు న్నారు. ఆరోజు గురువారం. శుక్రవారం లోపు అరెస్ట్ చేస్తే సెకండ్ సాటర్‌డే, ఆది వారం కోర్టుకు సెలవురోజులు. సోమవారం గాని ఆమెను కోర్టుకు హాజరుపరచడం కుద రదు. ఈ రెండు రోజులు చాలు ఓ మని షిని హత్యచేసి ఆత్మహత్యగా చిత్రించడా నికి.

ఇదీ మణి పథకం...

అమృత క్లినిక్ మణి క్యాబిన్‌లో మణి, సునీల్, భార్గవ్ సమావేశమయ్యారు. ఎప్ప టికప్పుడు ఫోన్లమీద పరిస్థితి గురించి తెలి యజేస్తున్నారు. అయినా నీహారిక ఎక్క డుందో తెలీలేదు. తన్మయి ఇంటిని, సురక్ష క్లినిక్‌ను కూడా పోలీసులు గాలించారు.

★ ★ ★

నాగేంద్రను వెంటనే వచ్చి కలవమని కబురువెళ్ళింది.

కబురు వినగానే నాగేంద్ర ఖంగారుపడి

పోయారు. వణుకుతూనే వెళ్ళి బావగారి ముందు నిలబడ్డాడు "చెప్పండి! ఎందుకు చేశారీపని? "

"మేము చేసినది మంచిపనే... ఆరోజు అలా చేయకపోతే మీ కోడలు మీకు దక్కేది కాదు" చెప్పాడు నాగేంద్ర.

"కానీ మీరు మమ్మల్ని వంచించారు! మేము దేన్నైనా సహిస్తాము కాని వంచ నను భరించమని మీకు తెలియును కదా!" కోపంగా అన్నారు రాజాభూపతి.

"చూడండి అయిందేదో అయిపోయింది కానీ ఇంతటితో దీన్ని వదిలేయండి. మా అన్నయ్యా వాళ్ళు త్వరలోనే ఈ భవనం విడిచివెళ్ళిపోతారు. ఇక వారిని ఉపేక్షించేది లేదు" అంది రాజాభూపతి భార్య.

అంతలో నౌకరు వచ్చి డాక్టర్ కృష్ణప్ర సాద్ వచ్చారని చెప్పాడు.

రాజాభూపతి ఆశ్చర్యపోయారు.

ఎందుకంటే పేషెంట్స్ వద్దకు వెళ్ళడం, పదవిలో ఉన్నవారిని డబ్బున్నవారిని కాకా పట్టడం కృష్ణప్రసాద్‌కు అలవాటులేదు. ఆ విషయమే రాజాభూపతికి కృష్ణప్రసాద్‌మీద గౌరవం కలుగచేసింది. ఒక్క ఫోన్‌చేసి మాట్లాడితే ఆయనకోసం తాను ఏ పనైనా చేసేందుకు సిద్ధంగా ఉండగా ఆయనే శ్రమ తీసుకుని రావడం రాజాభూపతికి విస్మ యాన్ని కలుగచేసింది.

ఆయన హడావుడిగా కృష్ణప్రసాద్‌కు ఎదురువెళ్ళారు. ఆయనవెంట నీహారిక, తన్మయి కూడా ఉన్నారు.

మామూలుగా అయితే నీహారికను చూసి రాజాభూపతి ఎంతో ఆవేశపడేవారు. కానీ కృష్ణప్రసాద్ వెంట ఉండడంతో ఏం మాట్లా డలేకపోయారు.

మర్యాదలవీ పూర్తయ్యాక అసలు విష యానికి వచ్చారు. "రాజాగారూ! మీరు మాకో సహాయం చేయాలి..."

"చెప్పండి డాక్టర్. మీరంటే మాకు ఎంతో గౌరవముంది. మీరేమడిగినా చేయడానికి మేం ఎప్పుడూ సిద్ధమే"

"భూపతిగారూ ఈమె నీహారిక ప్రస్తుతం ఈమెమీద మీరు కంప్లైంట్ ఇచ్చారు"

"దానిని విత్‌డ్రా చేసుకోమందురా? " ఖంగుమంది ఆయన స్వరం.

"లేదు... లేదు"

"మరి? "

"ఈ అమ్మాయికి కొన్నిరోజులు మీరు ఆశ్రయం ఇవ్వాలి"

కృష్ణప్రసాద్ కోరికకి రాజాభూపతి నిశ్చే ష్టులయ్యారు. అతికష్టంమీద సర్దుకుంటూ "డాక్టర్‌గారూ... నీతికి, నిజాయితీకి విలువ ఇచ్చే మేం ఓ దోషికి ఆశ్రయం కల్పించ డమా? ఇలాంటి కోరిక మమ్మల్ని కోరడా నికి మీకు మనసెలా ఒప్పింది? "

"రాజాభూపతిగారూ. మీ అందరిదృష్టిలో ఆమె దోషే కావచ్చు. కానీ ఆమె తన స్వార్థంకోసమో, డబ్బుకోసమో, పేరుప్రతిష్ట లకోసమో ఈ పనులు చేయలేదు. ఎంతో మంది రోగుల జీవితాలతో ఆడుకుంటున్న మణిలాంటివారిని శిక్షించాలనే ఆమె ఈ పనిచేసింది" అంటూ జరిగినదంతా వివరిం చారు కృష్ణప్రసాద్.

"అంటే... ఆరోజు మా కోడలికి డెలివరీ జరిగిన రోజు డాక్టర్ నీహారిక ఈ ఊరిలో లేదా? "

"లేదు. బెంగుళూరు వెళ్ళింది. ఇదిగో ఆమె స్నేహితురాలి ఫోన్‌నెంబర్ మీరు ఫోన్‌చేసి కనుక్కోవచ్చు" అంది తన్మయి.

రాజాభూపతికి ఏం మాట్లాడాలో తెలియ లేదు. పదినిముషాలవరకు ఆయన తేరుకో లేకపోయారు. డబ్బుకోసం మనుష్యులు ఎలాంటి హీనస్థితికి దిగజారుతుంటారో ఆయన గమనిస్తూనే ఉన్నారు. కానీ ఓ బాధ్యతాయుతమైన వృత్తిలో ఉంటూ మను షుల ప్రాణాలు కాపాడాల్సిన డాక్టర్ అయి వుండి కూడా డబ్బు, పేరుప్రతిష్ఠలకోసం ఇంతటి నీచానికి దిగజారడం ఆయనకు




చాలా బాధగా వుంది.

నీహారిక వంక చూశారు రాజాభూపతి గారు. అంత చిన్న వయసులో అంత పెద్ద బాధ్యత తలకెత్తుకోవడానికి ఎంతటి మనో నిబ్బరం కావాలి? అలాంటి అమ్మాయి మీద ఎన్నెన్ని కల్పించి చెప్పాడు.

"అమ్మా! నీహారికా మీరు చిన్నవారైనా మీ గురించి పొరపాటుగా అర్థం చేసుకున్నందుకు క్షమించండి. మీమీద నేనిచ్చిన కంప్లైంట్‌ను ఇప్పుడే వాపస్ తీసుకుంటున్నాను"

"లేదు... లేదు. దయచేసి మీరలా చేయకండి" వారించాడు కృష్ణప్రసాద్.

"అవును. మీరు ఇప్పుడు మీ కంప్లైంట్‌ను వాపస్ తీసుకుంటే మణికి అనుమానం వస్తుంది. మీరు నామాట వినే ఈ పని చేశారనుకుంటాడు. అలాకాక మీరు వారివైపే ఉన్నట్టు నటిస్తే మీమీద అనుమానం రాదు. నీహారిక ఈ కోటలో సురక్షితంగా ఉండగలుగుతుంది"

రాజాభూపతి అలాగేనని ఒప్పుకున్నారు.

అక్కడ పవన్ వెళ్ళేసరికి విశాల్ కొన వూపిరితో కొట్టుకుంటున్నాడు. అంబులెన్స్‌లో ఎక్కించి ఆసుపత్రికి చేర్చారు. ఆ రాత్రంతా మృత్యువుతో పోరాడుతూనే ఉన్నాడు. రక్తం బాగా పోవడంవల్ల రక్తం ఎక్కించాల్సి వచ్చింది. ప్రతి అరగంటకు నీహారిక ఫోన్ చేస్తూనే వుంది. ఆ రాత్రంతా ఆమె నిద్రపోలేదు. మరుసటి రోజు ఉదయం విశాల్‌కు ప్రాణాపాయం తప్పిందని తెలిశాకగానీ ఆమె మనసు కుదుటపడలేదు.

ఎలాగైనా నీహారికను మట్టుబెట్టాలనుకున్న మణి తాలూకు మనుష్యులకు ఆమె ఎక్కడా దొరకలేదు. సువర్చల వెళ్ళి నీహారిక తల్లితండ్రులను తీసుకువెళ్ళడంతో కనీసం వారిని బెదిరించే అవకాశం కూడా లేకపోయింది. ఎవ్వరికీ కూడా రాజాభూపతిగారింట్లో నీహారిక ఉండచ్చన్న అనుమానం కలగలేదు.



శ్రీధర్ స్టేట్స్‌లో ఉండగానే మణి ఫోన్ చేసి విషయం చెప్పాడు. తన ప్రోగ్రామ్ కాన్సిల్ చేసుకుని శ్రీధర్ ఇండియాకు వచ్చేశాడు.

ఇక్కడకు రాగానే తండ్రికి ఆరోగ్యం దెబ్బతిందన్న వార్త విని అతడు హతాశుడయ్యాడు. తండ్రిని మృత్యువుకు చేరువలో చూసేసరికి అతని గుండె చెరువైంది. చిన్నప్పటినుంచి అతనికి తల్లితోకన్నా తండ్రితోనే అనుబంధం ఎక్కువ.

శ్రీధర్‌ను చూడడంకోసమే తండ్రి తన ప్రాణాన్ని నిలుపుకున్నాడనిపించింది. అప్పటిదాకా కొట్టుకుంటున్న ఆ ప్రాణం అనంతవాయువుల్లో కలిసిపోయింది.

భర్తను ఒక్కక్షణం విడిచి ఉండలేని ఆవిడ కూడా భర్తను అనుసరించింది.

"అమ్మా! ఒక్కసారి కళ్ళు తెరమ్మా. నువ్వు కూడా నన్ను అన్యాయంచేసి వెళ్ళిపోవద్దమ్మా. ఒక్కసారి నాతో మాట్లాడమ్మా" తల్లిని కుదుపుతూ ఏడ్చాడతను.

కళ్ళముందు కాస్త వ్యవధిలో తల్లీతండ్రీ

ఇద్దరినీ పోగొట్టుకున్నాడు శ్రీధర్. నిజంగా చాలా దారుణమైన పరిస్థితి. తనకి తెలుసు బ్యాన్‌చేసిన ఆ మందుల్ని కేవలం డబ్బు కోసం తయారు చేస్తోంది తన కంపెనీ. ఆ విషయం తెలియని తన తల్లితండ్రులు డాక్టరు వద్దకు వెళ్లకుండా తమకు తెలిసిన వైద్యంతో ఆ మందుల్నే వాడారు. అవి వికటించాయి. శ్రీధర్ ఆ నిజాన్ని తట్టుకోలేక పోతున్నాడు. దాదాపు గంట తర్వాత కీర్తన తలుపుకొడితే తీశాడు. ఏడ్చీఏడ్చీ అతని కళ్ళు ఉబ్బిపోయాయి. ఆ కాసేపటికే మనిషి పది లంఖణాలు చేసినవాడిలా తయారయ్యాడు.

"శ్రీధర్ మీ నాన్నగారి మరణానికి కారణం ఎవరో తెలుసా?" అతని ముఖం లోకి సూటిగా చూస్తూ అంది కీర్తన, "మీరే..."

బాణం తగిలిన పక్షిలా విలవిల్లాడుతున్నాడు.

"అవును శ్రీధర్. అక్షరాలా మీరే కారణం. ప్రభుత్వం బ్యాన్‌చేసిన మందుల్ని కేవలం డబ్బుకోసం మీరు యధేచ్ఛగా ఉత్పత్తి చేస్తూనే వున్నారు. ఒకసారి మన మధ్య ఈ విషయంమీద డిస్కషన్ జరిగితే మీరేమన్నారు, వ్యాపారి లాభం, నష్టం తప్పితే మరేమీ ఆలోచించకూడదు అన్నారు. వ్యాపారికి సెంటిమెంట్లు ఉండకూడదు అన్నారు. నిజమేకదూ. మిగతా అందరి విషయంలో అది నిజం. కానీ మీదాకా వచ్చేసరికి భరించలేకపోతున్నారు అవునా?"

నిజానికి ఆ సమయంలో అలాంటి మాటలని బాధపెట్టడం ఆమెకీ బాధగానే ఉంది. కానీ తప్పదు. ఇనుమును వేడిగా ఉన్నప్పుడే వంచాలి. మనిషిని ఆత్మీయుల మరణం కూడా మార్చకపోతే ఇక జీవితంలో మారలేడు.

"చెప్పండి శ్రీధర్! నేనన్నది నిజమేకదూ"

"కీర్తనా ప్లీజ్..."

"శ్రీ... మనిషి డబ్బు సంపాదించాలి నిజమే. కానీ అదో వ్యసనం కాకూడదు. డబ్బుకోసం సాటిమనిషి ప్రాణం తీయడం రాక్షసత్వం కాదా? ఆలోచించు. మన కంపెనీమందులు వాడి చనిపోతున్న వారంతా మనుష్యులే శ్రీధర్. నీవు అమ్మా నాన్న పోయినందుకు ఎంత బాధపడ్తున్నావో వారంతా కూడా అలాగే ఏడ్చి ఉంటారు..."

"... ... ..."

"శ్రీధర్ నీకు తెలుసా? నీహారిక నా ప్రాణ స్నేహితురాలు. వాళ్ళ అన్నయ్య, వదినలను చూసి మేమంతా భార్యాభర్తలంటే వీరేననుకునేవాళ్ళం. అంత ఆదర్శమైన జంట వారిది. కానీ ఇప్పుడు ఏముంది? ఒకప్పుడు సంతోషానికి కేంద్రంగా ఉన్న ఆ ఇల్లు ఇప్పుడు నిశ్శబ్దానికి నిర్వచనం అయిపోయింది. వాళ్ళన్నయ్య ఆత్మహత్య చేసుకున్నాడు. భర్త చనిపోవటం భరించలేని వదిన షాక్‌తో మతిస్థిమితం కోల్పోయింది. ఇప్పుడు పిచ్చాసుపత్రిలో ఉంది. ఆంటీ, అంకుల్ ఆ పెద్ద వయసులో జీవచ్ఛవాల్లా బతుకుతున్నారు. దీనికి కారణం ఎవరో తెలుసా? నువ్వే... నువ్వే శ్రీధర్ ఆ ఇంటి సంతోషాన్ని నాశనం చేశావ్" అరచేతిలో ముఖం దాచుకుని భోరుమంది కీర్తన.

"కీర్తనా!" ఆమెను పిలుస్తూ దగ్గరకు తీసుకోబోయాడు. ఆమె మాత్రం అతన్ని నెట్టేసింది. "వద్దు శ్రీధర్. నా దగ్గరకు రావద్దు. నిన్ను చూస్తుంటే నాకు భయమేస్తోంది. నువ్వు హంతకుడివి శ్రీధర్. హంతకుడివి" దూరదూరంగా జరుగుతూ అందామె.

శ్రీధర్ నిర్విణ్ణుడయ్యాడు. చాలా సేపటివరకూ ఆమె కోలుకోలేకపోయింది.

"శ్రీ... ఇప్పటికైనా నీ విధానం మార్చుకో. అన్యాయాలు, అక్రమాలు





చేయడం... దాన్ని కప్పిపుచ్చుకోడానికి హత్యలు... ఇలా ఎన్నాళ్ళు? దీనివల్ల మీరు సాధించేదేంటి? ఎవరి ఉసురు తగిలిందో అత్తయ్య, మామయ్య ఒకేసారి వెళ్ళిపోయారు. ఇకనైనా ఆ పాపపు సొమ్ము కోసం ఆశపడడం మానేయ్. లేదంటే ఆ డబ్బు తప్పితే నీకేం మిగలదు"

ఏడుస్తూ తన గదిలోకి వెళ్ళిపోయిందామె.

చాలాసేపటివరకూ ఆమె అన్నమాటలే అక్కడ ప్రతిధ్వనించాయి. కీర్తన అన్నట్టు ఈరోజు తల్లీతండ్రిని కోల్పోయి తను ఇంత బాధ పడ్తున్నాడే మరి తనమందులు వాడి ఇంకెంతమంది అనాధలవుతున్నారో ఎవరికి తెలుసు?

డాక్టర్ జయరామ్ గుర్తొచ్చాడు అతనికి...

తాను చూసింది, విన్నదీ మర్చిపోతానని, తననుమాత్రం చంపద్దని, తన కుటుంబం అన్యాయమైపోతుందని అతడెంతగానో ప్రాధేయపడ్డాడు. ఆఖరుకు కాళ్ళు కూడా పట్టుకున్నాడు. కానీ మణి విన్పించుకోలేదు. యాక్సిడెంట్ చేయించి చంపించేశాడు. జయరామ్ పోయినందుకు అప్పుడు ఎంతో ఆనందించాడు కానీ ఇప్పుడు?

అంటే ఎదుటివారి బాధను ఆనందించసాగాడు, తన బాధను తట్టుకోలేకపోతున్నాడు.

'మీరు హంతకులు, నన్ను కూడా ఎప్పుడో మీ మందులకే బలి తీసుకుంటారేమో' భార్యమాటలు అతన్ని చిత్రవధ చేస్తున్నాయి.

ఆ రాత్రి చాలాసేపటి తర్వాత ఓ నిర్ణయానికి వచ్చాడు. ఆ తర్వాత శ్రీధర్‌కు ప్రశాంతంగా నిద్రపట్టింది.

ఉదయం లేవగానే తల్లికీ తండ్రికీ నమస్కరించుకుని నగరంలోని ప్రముఖ పత్రికకు వెళ్ళాడు. ఇండ్యూస్డ్ ఇంపొటెన్సీ ఇంజెక్షన్స్ గురించి, అమృత క్లినిక్‌తో క్యూర్ ఫార్మాస్యూటికల్స్‌కున్న ఒప్పందం గురించి వివరించాడు. నిజానికి డైరక్ట్‌గా వెళ్ళి పోలీసులకు లొంగిపోదామనుకున్నాడు. కానీ పోలీసుశాఖలో మణికి ఎంతటి సన్నిహిత సంబంధాలున్నాయో శ్రీధర్‌కు తెలుసు.

ఆ వార్త పెద్ద సంచలనం అయ్యింది.

నీహారిక ఇప్పుడో, ఇంకాసేపట్లోనో అరెస్ట్ అవడమో లేక తమ మనుష్యులు చంపేయడమో జరుగుతుందని ఎదురుచూస్తున్న మణి తదితరులు ఈవెనింగ్ ఎడిషన్‌లో వచ్చిన వార్త చూసి ఖంగుతిన్నారు.

మరోపక్క అమృతలో ట్రీట్‌మెంట్ తీసుకుంటున్న ఐ.వి.ఎఫ్. కేసుల తాలూకు రోగులు మణి, భార్గవ్, సునీల్‌లమీద రిపోర్ట్ ఇచ్చారు.

ఈలోగా రాజాభూపతి తన పలుకుబడి ఉపయోగించారు.

అక్కడ శ్రీధర్, ఇక్కడ మణి, భార్గవ్, సునీల్ అరెస్టయ్యారు.

ఆరోగ్యశాఖామంత్రి ప్రజల అభ్యర్థనమేరకు దీనిని ఓ స్పెషల్ కేస్‌గా తీసుకోవడంతో విచారణ చాలావేగంగా కొనసాగింది.

ఇందులో నేరస్థులెవ్వరికీ బెయిల్ లభించలేదు. నేరస్తులు బెయిల్‌మీద విడుదలైతే కేస్‌ను తారుమారు చేసే అవకాశం ఉందన్న కారణంగా బెయిల్ ఇష్యూ చేయలేదు.

కోర్టుకు కేస్ విచారణకు వచ్చింది.

నీహారిక తరపు లాయర్ ఆమె సేకరించిన ఆధారాలన్నీ కోర్టుకు ప్రొడ్యూస్ చేశాడు. క్లినిక్‌లో ఐ.వి.ఎఫ్. ట్రీట్‌మెంట్ తీసుకుంటున్న రోగులు కూడా సాక్ష్యం చెప్పారు. P2X1 ఇంజెక్షన్స్ మేల్ కాంట్రాసెప్టివ్‌గా పనిచేస్తాయని, దానిని మణి వక్రమార్గంలో ఉపయోగించాడని తేలింది.

ఆ ఇంజెక్షన్స్ విషయంలో ప్రభుత్వ అనుమతి తీసుకోలేదని కూడా తేలింది.

మొత్తంమీద మణి, భార్గవ్, సునీల్‌లకు తప్పించుకునే అవకాశం ఏమాత్రం లేకుండా కేసు బిగుసుకుపోయింది.

నిజానికి కేసు వాదనంతా ఏకపక్షంగానే సాగిందని చెప్పచ్చు

తీర్పు వెలువడినరోజు నీహారికకు నిజంగా పండుగే.

పి.జి.డి. ప్రయోగం చేయకుండానే సక్సెస్ అయినట్టుగా ప్రకటించి ప్రజలను తప్పుదోవ పట్టించినవారితో చేయి కలిపినందుకు నిజానికి నీహారికను కూడా శిక్షించాలని కోర్టు అభిప్రాయపడింది. కానీ ప్రజల శ్రేయస్సుకోసం మణిలాంటి దుర్మార్గుల ఆట కట్టించి వారిని కటకటాలపాలు చేసేందుకే ఆమె వారితో చేరినట్టుగా నటించింది తప్ప ఈ మొత్తంలో ఆమె స్వార్థం ఏమీలేదనీ, ప్రాణాలకు తెగించి మరీ ఎంతో సమాచారం సేకరించిందని కోర్టు విశ్వసించింది. దాంతో తెలిసి చేసినా, తెలీక చేసినా తప్పు తప్పే కాబట్టి ప్రథమ తప్పిదం కింద కోర్టు నీహారికను మందలించి వదిలేసింది.

డాక్టర్ మణి, భార్గవ్, సునీల్‌లు తాము చేసిన పాపాలకు దీర్ఘకాలిక శిక్ష అనుభవిస్తున్నారు.

సువర్చలకు విడాకులు మంజూరయ్యాయి.

అక్కడ శ్రీధర్‌కు మూడేళ్ళు శిక్షపడింది.

★ ★ ★

"అవునూ! మణి నన్ను చంపడానికి మనుష్యుల్ని పంపుతున్నాడన్న విషయం నీకెలా తెల్సింది? అప్పటినుంచి ఈ సందేహం నన్ను వేధిస్తూనే ఉంది..." అంది నీహారిక.

"అదే మరి దివ్యదృష్టి..." అన్నాడు విశాల్.

"అవునండీ... నాకూ అదే అనుమానం కలిగింది" అన్నాడు పవన్.

"అయితే చెప్పాల్సిందే! ఆ సమాచారం నాకు అందించింది మా మరదలు"

"వ్వాట్..." అరిచింది నీహారిక.

"అవును! అంకిత చెప్పింది..." అన్నాడు విశాల్.

"అంటే మీ తమ్ముడు..." అంటూ ఆగిపోయింది నీహారిక.

"తనకోసం అంతటి ధైర్యసాహసాలు ప్రదర్శించటమేకాక తన అన్నయ్య ప్రాణాలు కూడా కాపాడిన అమ్మాయిని ఎలా వదులుకోగలుగుతాడు? "

"నీ ప్రాణాలు కాపాడిందా? " అనుమానంగా అంది నీహారిక.

"అవును! ఆరోజు ఆ అమ్మాయి వచ్చిందనే పూర్తిగా చావకముందే నన్ను వదిలేసి వెళ్ళిపోయారు వాళ్ళు. లేదంటే..."

"ప్లీజ్... అలా అనకు..." నీహారిక వారించిందతన్ని.

ముందు తన్మయి, పవన్ వివాహమైంది.

తర్వాత విశాల్, నీహారికలు ఒకటయ్యారు.

నీహారిక వదిన కూడా నెమ్మదిగా కోలుకుంటోంది. త్వరలో మామూలు మనిషయ్యే అవకాశం ఉందని డాక్టర్లు చెప్పారు.

బామ్మగారి ఆనందానికి అవధులు లేకుండా పోయాయి.

★ ★ ★

దాదాపు నెలరోజుల తర్వాత.

సమయం సాయంత్రం ఆరుగంటలు కావస్తోంది.

ఆవేళ...

నగరానికి అయిదు కిలోమీటర్ల దూరంలో పదెకరాల విస్తీర్ణంలో, అత్యాధునిక సౌకర్యాలతో ఏర్పాటు చేయబడిన సురక్ష సూపర్ స్పెషాలిటీ హాస్పిటల్ అండ్ రీసెర్చి సెంటర్లోకి ఒకదాని వెంబడి ఒకటి రెండు కార్లు ప్రవేశించాయి.

కార్లు దిగి డ్రైవర్లు డోర్ తెరచి పట్టుకున్నారు.

ఒక కారులోంచి ఇద్దరు మహిళలు, మరొక కారులోంచి ఇద్దరు మగవారు





దిగారు.

ఆస్పత్రిలోకి ప్రవేశించగానే రిసెప్షనిస్ట్‌ను చూసి పలకరింపుగా నవ్వారు రాజాభూపతి.

ఆమె కూడా 'బాగున్నారా?' అని ఆప్యాయంగా పలకరించింది.

వీళ్ళు వెళ్లేసరికి కృష్ణప్రసాద్, పవన్, తన్మయి, నీహారిక వీరి కోసమే ఎదురుచూస్తున్నారు.

పలకరింపులవీ అయ్యాక అడిగారు రాజా భూపతి, "చెప్పండి! మాతో ఏదో మాట్లాడాలన్నారట..."

అవునన్నట్టు తలూపారు డాక్టర్ కృష్ణప్రసాద్. "మీరు మాకు చేసిన సాయం వెలకట్టలేనిది. మీరే కనుక పెద్ద మనసు చేసుకుని మమ్మల్ని అర్థంచేసుకోకపోయినా, నీహారికకు ఆశ్రయం కల్పించకపోయినా మేము చాలా చిక్కుల్లో పడాల్సివచ్చేది. నిజంగా మీకు ఎన్నిసార్లు కృతజ్ఞతలు తెల్పినా తక్కువే అవుతుంది"

గర్వంగా మీసం మెలితిప్పారు రాజాభూపతి. "ఇందులో మేము చేసిన సహాయం ఏపాటిది? అయినా ఇప్పుడంటే రాచరికాలు పోయినాయిగానీ, నిజానికి దుష్టులను శిక్షించుట, శిష్టులను రక్షించుట, అన్నార్తులను ఆదుకొనుట ఇవన్నియూ మా కర్తవ్యమే కదా! సరే! ఇక ఆ విషయం వదిలెయ్యుడు! వాని పాపము పండినది. శిక్షపడినది... ఏదిఏమైనను అంతటి క్లిష్టకార్యమును సానుకూలం చేసిన ఈ మహిళామణి ధైర్య సాహసములు కడుప్రశంసనీయము" నీహారిక వైపు తిరిగి అన్నాడు రాజాభూపతి.

"రాజావారూ! మిమ్మల్ని ఇలా కలవాలనుకోవడానికి ఓ ముఖ్య కారణముంది..." అని ఆగారు కృష్ణప్రసాద్.

"చెప్పండి..."

"ఒకప్పుడు మీ అంతట మీరుగా వచ్చి ఐ.వి.ఎఫ్. టెక్నాలజీని ఉపయోగించి మాకో వంశాంకురాన్ని సృష్టించమని అడిగారు. నాకు ఆ విధానంమీద సంపూర్ణంగా అవగాహన లేకపోవడంచేత, ఇతరత్రా ఇబ్బందులవల్ల అది కుదరదన్నాను. కానీ ఇప్పుడు మా కోడలి ప్రోద్బలంవల్ల నేనాపనికి ఒప్పుకుంటున్నాను. ఆ విషయం మాట్లాడదామనే ఇక్కడకు మిమ్మల్ని పిలిపించాను" అసలు సంగతి చెప్పారు.

ఆయన ఏమంటారా అని ఆత్రంగా ఎదురుచూడసాగారు.

గాయిత్రీదేవి మనసులో ఎన్నో సందేహాలు! కాని అడిగే ధైర్యమూలేదు. అలా అక్కడ అధిక ప్రసంగం చేయడం హర్షణీయంకాదు.

కృష్ణప్రసాద్ చెప్పింది విని రాజాభూపతి గారు ఎంతమాత్రం సంబరపడలేదు. "క్షమించండి డాక్టర్! ఇప్పటికే ఈ ప్రయోగాల పేరిట మా ఇంటిమహాలక్ష్మిని ఆసుపత్రుల చుట్టూ తిప్పి బాధపెట్టాం. మా కోరిక తీరడమే ముఖ్యమనుకున్నాం. కానీ దీనివల్ల ఆమె మనసు గాయపడ్తుందని ఊహించలేకపోయాం. ఇది ఇంతటితో ఆపేద్దాం... ఇకమీదట ఈ ప్రయోగాలేమీ వద్దు. భగవంతుని అనుగ్రహమున్న మాకు వంశాంకురం జన్మించును. లేనిచో ఈ వంశం మా పుత్రుని తర్వాత నిర్వీర్యమైపోవును. ఏదిఏమైనను లలాట లిఖితమును తప్పించగలవారెవ్వరు? మా నుదుటన ఆ విధాత ఏమి రాస్తే అది జరుగుతుంది" నిర్లిప్తంగా అన్నారు.

ఆ తర్వాత కృష్ణప్రసాద్ దగ్గరినుంచీ ఆయన కోడలువరకు ఎంతో నచ్చచెప్పిన మీదట రాజాభూపతి పి.జి.డి. ప్రయోగానికి అంగీకరించారు.

తన్మయి మొదట గాయిత్రీదేవిని మానసికంగా ప్రిపేర్ చేసింది.

దేవిశ్రీని పరిచయం చేయడంతో తన్మయి ప్రయోగంమీద గాయిత్రీదేవికి నమ్మకం కలిగింది.



మొదట రెండుమూడు నెలలు ఏం ఆహారం తీసుకోవాలో, ఎలా వ్యాయామం చేయాలో వివరించింది తన్మయి.

ఇప్పుడు గాయిత్రీదేవికి తన్మయిమీద గురి ఏర్పడింది.

నీహారిక కూడా ఆమె వెంటే ఉంది.

గాయిత్రీదేవి సంపూర్ణంగా ఆత్మవిశ్వాసం వ్యక్తంచేశాక తన ప్రయోగాన్ని ఆరంభించింది.

ఆమె అండాశయంనుంచి ఫలదీకరణ చెందని అండాలు ఎంపిక చేశారు తన్మయి, నీహారికలు.

తర్వాత గాయిత్రీదేవి భర్త వీర్యకణంతో సంధానం చేసి ఫలదీకరణ జరిపించారు.

మూడురోజులపాటు పెట్రిడిష్‌ను ఇంక్యుబేటర్‌లో ఉంచారు.

దాదాపు డెబ్బైరెండు గంటల అనంతరం ప్రతి ఎనిమిదికణాల పిండం గుండుసూది మొనంత సైజుకు పెరిగింది.

మైక్రోమానిప్యులేటర్ సహాయంతో ఈ పిండంలోంచి ఒక కణాన్ని వేరుచేసి అనంతరం జన్యుక్రమం పరిశీలించారు.

కణానికి డాక్టర్ తన్మయి రెండు ఫ్లోరోసెంట్ రంగులు పూసింది.

తర్వాత వాటిని స్టెయిన్‌లెస్ స్టీలు పాత్రలో స్నానం చేయించారు.

ఈ కార్యక్రమం మొత్తం పూర్తయ్యేసరికి పిండాలు రెండురకాల రంగులలో కనిపించాయి. గులాబీరంగులో మూడు పిండాలు, ఆకుపచ్చరంగులో మూడు పిండాలు దర్శనమిచ్చాయి. మిస్టర్ వై ఆకుపచ్చరంగులో కనిపిస్తే మిస్ ఎక్స్ గులాబీరంగులో కన్పిస్తుందన్నమాట.

ఆకుపచ్చరంగు పిండాలు గాయత్రీదేవి గర్భంలోకి ప్రవేశపెట్టింది తన్మయి.

మూడు నెలల తర్వాత తన్మయి, పవన్‌లు కాలిఫోర్నియాకు బయలుదేరారు.

ఎయిర్‌పోర్టుకు వచ్చి అందరూ వీడ్కోలిచ్చారు.

గాయిత్రీదేవి డెలివరీ టైముకు వస్తానని ధైర్యం చెప్పింది తన్మయి.

ఆమెలో వస్తున్న మార్పులు గమనించి నీహారిక ఫోన్‌లో వివరించేది. ఏమేంచేయాలో, మందులేం వాడాలో తీసుకోవాల్సిన జాగ్రత్తలేమిటో వివరించేది తన్మయి.

గాయత్రీదేవికి తొమ్మిది నెలలు నిండాక తన్మయి ఇండియాకు బయలుదేరింది. ఆవిడకు సిజేరియన్ చేసి బిడ్డను తీశారు.

తన్మయి పి.జి.డి. ప్రయోగం ఫలించింది. ఆనందంగా మగబిడ్డను ఎత్తుకుని తీస్కెళ్ళి రాజాభూపతిగారికి అందించింది.

ఆయన సంబరానికి అవధులు లేకుండాపోయింది. తన వయసు కూడా మర్చిపోయి, మనవడ్ని చూసుకుని ఆనందపడిపోయాడు రాజాభూపతి.

కొద్దిరోజుల తర్వాత తన్మయి తిరిగి కాలిఫోర్నియా బయలుదేరింది. ఈసారి రాజాభూపతి వారసుడు కూడా తల్లి పొత్తిళ్ళలో ఉండి ఆమెకు వీడ్కోలు ఇవ్వడానికి ఎయిర్‌పోర్ట్‌కు వచ్చాడు.

మరో మహాయజ్ఞం నిర్వహణలో పాలుపంచుకోబోతున్న తన్మయి తన పరిశోధనలో విజయం సాధించాలని అందరూ కోరుకుంటున్నారు. అందరి మనసులు ఆనందంతోను, సంతృప్తితోను నిండిపోయున్నాయి. అంతకుమించి కావాల్సిందేమిటి?



**అంకితం**

నా చేయిపట్టి అక్షరాలు దిద్దించిన అమ్మమ్మ, తాతయ్యలు కీ.శే. కాశీభట్ల వెంకటసుబ్బలక్ష్మి, కాశీభట్ల వెంకటలక్ష్మీ నృసింహశాస్త్రిగార్లకు అంకితం.





# చతుర ప్రపంచం

## నెస్‌కేఫ్ సృష్టికర్త

ప్రపంచంలోని అతిపెద్ద ఫుడ్ కంపెనీ నెస్లే. 1,63,000 మంది ఉద్యోగస్థులున్న ఈ సంస్థ ప్రపంచం మొత్తంమీద 3000 బ్రాండ్లకి పైగా ఫుడ్ ప్రోడక్ట్స్‌ని అందిస్తోంది.

ఈ కంపెనీ అనేక ఫుడ్ ఐటమ్స్‌ని రీసెర్చి చేసి కనిపెడుతోంది. ద్రవంలో కరిగే ఇన్‌స్టెంట్ కాఫీపొడిని కనిపెట్టింది నెస్లే కంపెనీయే 1938 లో దానికి నెస్‌కేఫ్ అని పేరు పెట్టారు. దాన్నిప్పుడు ఉపయోగించని ఇల్లే లేదంటే అతిశయోక్తి కాదు. అలాగే పసిపిల్లలకి పాలపౌడర్‌ని తొలుత మార్కెట్ చేసింది కూడా నెస్లేనే. 1867 లో స్విడ్జర్లాండ్ లో దీన్ని కనిపెట్టారు.




ఈ కంపెనీకి ప్రపంచంలో మొత్తం 18 రీసెర్చి సెంటర్లు ఉన్నాయి. అన్నిటికన్నా పెద్దదైన స్విడ్జర్లాండులోని ఓమ్స్ అనేచోట పాల ఉత్పత్తులు, ధాన్యపుగింజలు పేకింగ్ల మీద రీసెర్చి జరుగుతోంది.

ప్రపంచంలోని అతిపెద్ద కంపెనీల్లో నెస్లే 23వ స్థానం ఆక్రమిస్తుంది.

స్విడ్జర్లాండుకి చెందిన ఇది ఒక్క 1997 లో 900 కొత్త లేక అభివృద్ధి చేసిన ప్రాడక్ట్స్‌ని మార్కెట్‌లోకి ప్రవేశపెట్టింది. ఆ ఏడాది దీని సేల్స్ ఫిగర్ స్విడ్జర్లాండు దేశపు బడ్జెట్‌కన్నా ఎక్కువ. పంజాబ్‌లో ఈ కంపెనీ స్థాపించిన పాల ఫ్యాక్టరీ ఇండియాలోనే అత్యుత్తమ మైంది. ఆ ఫ్యాక్టరీలో గత ఏడాది 1,17,000 టన్నుల పాలపొడిని ఉత్పత్తి చేశారు. ఇండియాలో ఈ కంపెనీ పేరు ఫుడ్ స్పెషాలిటి లిమిటెడ్. నెస్లేకి ఎఫ్.ఎస్.ఎల్‌లో పెట్టుబడులలో 40% భాగం వుంది.

మనదేశంలో దొరికే హైబ్రీడ్ టొమాటోలని (త్వరగా చితకనివి) నెస్లే కంపెనీ అగ్రికల్చరల్ విభాగం రీసెర్చ్ శాస్త్రజ్ఞులు పనామా దేశంలో కనిపెట్టారు. అగ్రికల్చరల్ రీసెర్చ్‌ని 52 దేశాల్లో నెస్లే నిర్వహిస్తోంది. అలాగే వెటర్నరీ రీసెర్చ్ విభాగం కూడా పశువుల్లో వచ్చే వ్యాధుల నివారణకి అసలు వ్యాధులు రాకుండా చేసే టీకాలని కనిపెట్టి ఉత్పత్తి చేస్తోంది.

సౌత్ ఆఫ్రికాలో పెరిగే ఓ రకం గడ్డిని ఇండోనీషియా, శ్రీలంక, ట్రినిడాడ్ లాంటి దేశాల్లో ప్రవేశపెట్టింది. ఎక్కువ పాలని

ఉత్పత్తిచేసే శక్తిగల గడ్డి అది. క్షామం రోజుల్లో కూడా ఈ గడ్డి పెరగడం విశేషం.

ప్రపంచంలోని సూపర్ మార్కెట్లలో డిపార్ట్‌మెంటల్ స్టోర్స్‌లోని షెల్ఫ్‌ల్లో ఎక్కువ ప్రదేశం ఆక్రమించుకునేవి నెస్లే ఉత్పత్తులే.

---

# వాళ్లంతా బాల్యంలో బడుద్ధాయిలే

'పెద్దల మాట చద్దిమూట' అని చిన్నప్పుడు తెలుగు వాచకం పుస్తకంలో చదువుకున్నాం. అయితే ఎల్లప్పుడూ ఈ సామెత నిజంకాదని అనేకమంది ప్రముఖుల జీవితాల్లో జరిగిన సంఘటనలు రుజువుచేస్తున్నాయి.

రెండోప్రపంచ యుద్ధ సమయంలో బ్రిటన్ ప్రధానమంత్రి అయిన విన్‌స్టన్ చర్చిల్‌ని అతని 16వ ఏట అతని తండ్రి స్కూల్ ప్రోగ్రెస్ రిపోర్టు చూసి కోప్పడుతూ 'నువ్వు పాలిటిక్స్ లో ఎంత పూరో. ఈ సబ్జెక్టు నీకు వంటపట్టదు కానీ సబ్జెక్టు మార్చుకో.' అని తిట్టినా చర్చిల్ ఆపని చెయ్యలేదు.

హాలీవుడ్ హీరోయిన్ బార్బరా స్ట్రైసాండ్ చర్చిలో పాడే పాట విన్న తల్లి 'ఛీ! నీ కంఠం ఏం బావుండదు. నువ్వు స్కూల్ డ్రామాలకి పనికిరావు.' అంది. కానీ చరిత్ర ఇంకో రకంగా ఉంది.




హిల్టన్ హోటల్స్ చెయిన్‌ను స్థాపించిన కోన్‌రెడ్ హిల్టన్ తండ్రి ఓసారి తన భార్యతో ఇలా చెప్పడం ఆయన విన్నాడు. 'మన కొన్నిగాడు పెద్దయ్యాక చవటవుతాడని నా నమ్మకం. ఎలా బతుకుతాడో ఏమో?'

మానవ పరిణామ సిద్ధాంతం కనిపెట్టిన చార్లెస్ డార్విన్ అయిదేళ్లపాటు విదేశాలకు వెళ్తాంటే అతని తండ్రి 'వీడంత సన్నాసి వీడే. ఎందుకూ పనికి రాని వెధవ' అని సర్టిఫికెట్ ఇచ్చాడు. అమెరికా దేశపు మొదటి ప్రెసిడెంట్ జార్జి వాషింగ్‌టన్ తల్లి వాషింగ్‌టన్‌ని ఎందుకూ పనికిరానివాడని తెగతిట్టేది. చివరికి అతని ప్రమాణ స్వీకారోత్సవానికి కూడా రాలేను, అది ఏమంత ప్రాముఖ్యం లేని ఉద్యోగం అని.

అమెరికన్ మ్యూజిక్ కంపోజిటర్లలో నంబర్‌వన్ స్థాయికి చేరుకున్న లియొనార్డ్ బెర్న్‌స్టెయిన్ ఎప్పుడు సంగీతసాధన చేసినా అతని తండ్రి దాన్ని వదిలి ఇంకేదైనా పనికొచ్చే విద్య నేర్చుకోమని కసిరేవాడు.




# అహింసాపరమోధర్మః

మహాత్మాగాంధీ అహింసా పద్ధతిని భారతదేశానికి స్వతంత్రం తీసుకురావడానికేకాక కుటుంబసమస్యల్లో కూడా దాన్ని ఉపయోగించడం ఆయన తన పిల్లలకి నేర్పించాడు.

తన తాత గాంధీ పేరిట మనమడు డాక్టర్ అరుణ్‌గాంధీ స్థాపించిన 'యం.కె గాంధీ ఇన్స్టిట్యూట్ ఫర్ నాన్‌వయొలెన్స్' తరపున యూనివర్శిటీ ఆఫ్ ప్యూర్టోరికోలో ఇచ్చిన లెక్చర్‌లో తన తండ్రి కుటుంబసమస్యల్లో అహింసా పద్ధతిని ఎలా ఉపయోగించాడో ఓ ఉదాహరణగా దీన్ని చెప్పాడు అరుణ్‌గాంధీ.

అప్పుడు అరుణ్ వయసు 16. సౌత్‌ఆఫ్రికాలోని డర్బన్ నగరంలో తన తండ్రి తో సుగర్‌ప్లాంటేషన్స్‌లో జీవిస్తూవుండేవాడు. వాళ్లకి ఇరుగుపొరుగు లేరు.

అరుణ్ అతని ఇద్దరు సిస్టర్స్ అవకాశం దొరికినప్పుడల్లా డర్బన్‌కి వెళ్లి సినిమాలు చూసి వస్తూండేవారు.

ఓరోజు అరుణ్‌తో అతన తండ్రి చెప్పాడు.'ఇద్దరం కారులో డర్బన్ వెళ్దాం. నువ్వు కారు తీసుకుని సరుకులు కొని, ఇతర చిల్లర పనులు చూసి సాయంత్రం అయిదుకి నన్ను పికప్ చేసుకో 'అని.

అరుణ్ తన పనులు ముగించుకుని సినిమాకి వెళ్లాడు. ఆ జాన్‌రైన్ సినిమాలో మునిగిపోయిన అరుణ్ బయటకు వచ్చేసరికి సుమారు అయిదున్నర.

అతను తన తండ్రి దగ్గరకు వెళ్లేసరికి టైం ఆరయింది. ఎందుకు లేటయిందంటే నిజం చెప్పడానికి సిగ్గుపడి గేరేజ్‌కెళ్లి కారు రిపేర్ చేయించుకుని వస్తున్నానని అబద్ధం చెప్పాడు.

అది చెప్పే పద్ధతిని బట్టి అబద్ధం అని గ్రహించిన అరుణ్ తండ్రి గేరేజ్‌కి ఫోన్ చేసి అబద్ధం అని రూఢి చేసుకున్నాక చెప్పాడు. "నేను నిన్ను పెంచే తీరులో ఏదో లోపం ఉంది. నాకు నిజం చెప్పడానికి నీకు ధైర్యం లేకపోయింది. నేను ఇంటికి నడిచే వెళ్తానుకానీ నీతో కారులో రాను"




ఆయన లైట్లు లేని, రాళ్లు, గోతులు ఉన్న పేవ్‌మెంట్ మీద 18మైళ్లు నడిచి వెళ్తుంటే వెనుకే అరుణ్ కారులో తండ్రిని ఫాలో అయ్యాడు. అలా అయిదున్నర గంటలు పట్టింది వాళ్ల ప్రయాణం.

ఒక్క దెబ్బ కొట్టకుండా అహింసాపద్ధతిలో శిక్షించాడాయన.

అప్పటినుండి అరుణ్ ఎన్నడూ తండ్రికి అబద్ధం చెప్పలేదు.

# ‘స్వర్గం మీ చేతుల్లోనే వుంది’ పై సమీక్షలు

జనవరి ‘చతుర’ లో ప్రచురితమైన కాశీవిశ్వనాథ్ నవల ‘స్వర్గం మీ చేతుల్లోనే వుంది’ పై మాకందిన ఉత్తమ సమీక్షలు

## కనువిప్పు

(ప్రథమ బహుమతి రూ: 100/-పొందిన సమీక్ష)

నేరప్రవృత్తిని వివరించే సినిమాలు విరివిగా తయారవుతున్న ఈ రోజుల్లో ఒక మంచి వాడిని అబద్ధాలకోరుగా, వ్యసనపరుడిగా ఎలా నిరూపించవచ్చో వేగంగా మారే సన్నివేశాల ద్వారా రచయిత నిరూపించారు. తెలివితేటలుంటే సకల వ్యసనాలు కలిగిన విజయ్ వంటివాళ్లు మంచివాళ్ళుగా చలామణీ అవటం, కేవలం లౌక్యం లేని కారణంగా ప్రతికూల పరిస్థితుల్లో వంశీకృష్ణ





లాంటి అభ్యుదయభావాలు కలిగిన వ్యక్తులు దుర్మార్గులుగా అవమానకర పరిస్థితులు ఎదుర్కోవటం బాధాకరం.

రెండు విభిన్నతరహా పాత్రలతో కథను సృష్టించిన రచయిత చాలాచోట్ల సంభాషణలను సాగదీసినా వంశీ కాపురం కూలిపోవటానికి కారణమైన సంఘటనలను వేగంగా నడిపించారు. వంశీకృష్ణ స్నేహానికిచ్చిన విలువ అతని పాలిట అశనిపాతంగా పరిణమించింది. 'అతిసర్వత్ర వర్జయేత్' అన్నట్లుగా ఉన్నతమైన విలువలపట్ల 'అతినిబద్ధతకు కాస్తంత లౌక్యం జోడించనిచో ఆ వ్యక్తి కష్టాలపాలవుతాడని ఈ నవల నిరూపించింది. విజయ్ చాకచక్యంగా తన తప్పులు కప్పిపుచ్చుకోవటమేకాక భార్య దగ్గర తిరుగులేనివిధంగా నమ్మకం సంపాదించుకుంటాడు. ఈ రోజుల్లో ఈ రకం మనుషులు ఎక్కువగా తారపసడుతుంటారు. తమ మూర్ఖత్వాన్నే చతురతగా భావించి ఇతరుల నిజాయితీని గుర్తించని కల్యాణి లాంటివారివలన అన్యాయానికి గురైన 'జయలత'లెందరో ఉన్నారు. జీవిత భాగస్వామి మీద నమ్మకంలేని కల్యాణి తమ దాంపత్యాన్ని నరకం చేసుకుంది. అటువంటి కొందరికైనా మాలతి, శామ్యూల్ ల ఆలోచనా విధానం మార్గదర్శకత్వం కాగలిగితే ఈ నవల సార్థకమవుతుంది.

ఈ రచనలోని లోపమేమంటే వంశీకృష్ణ కెదురైన పరిస్థితులు అత్యున్నత విలువలను అవలంబించటం కష్టతరం అనే తప్పు సంకేతాన్నిస్తున్నాయి. శామ్యూల్ దంపతుల వంటివారు అందరికీ ఎదురయ్యే అవకాశాలు లేవు కాబట్టి పాత్ర పోషణకు సంబంధించి రచయిత కొంత జాగ్రత్త వహిస్తే బాగుండేది. ఏమైనప్పటికి ఈ కథ విజయ్‌కుమార్, కల్యాణిలాంటివారికి కనువిప్పు కావాలి.

–జె.వి.రమణ,

గోదావరిఖని-505 212

## కొత్త దుస్తుల్లో పాత బొమ్మ

**(ద్వితీయ బహుమతి రూ: 75/– పొందిన సమీక్ష)**

"స్వర్గం మీ చేతుల్లోనే వుంది" ఇరవైఏళ్ల క్రితమెప్పుడో వచ్చిన నవల చదివినట్లనిపించింది. ఇతివృత్తంలో నూతనత్వం లోపించింది. ఉపమానాలు పేలవంగా ఉన్నాయి. పరిచయం చేసిన ప్రతి పాత్రా చమత్కారంగా సంభాషించడం పాత్రల మేనరిజాన్ని దెబ్బతీసింది. ఎదురవబోయే మలుపులు పాఠకుల ఊహకు అందేలా ఉండి ఉత్కంఠను అణిచివేశాయి.

కళ్యాణి పుట్టింటికి వెళ్ళినప్పుడు చతుర్ముఖపారాయణం కోసం స్నేహితులు వంశీ ఇంట్లో సమావేశమవడం, హోటల్ అజంతాలో విజయ్‌కి కడుపునొప్పి రావడం, తమ్ముడికి ఫిట్స్ వచ్చాయని ఫోనొస్తే రాంబాబు సగం తాగిన విస్కీగ్లాసు వంశీ ఇంట్లో వదిలి వెళ్ళిపోతే అదే సమయంలో జయలత అక్కడకు రావటం లాంటి సంఘటనలు సినిమాల్లోలా ఉండి విసుగు పుట్టించాయి.

లేడీలాయరు మాలతి పాత్ర అప్రస్తుతం. లాయరు హోదాలో చివరికి ఆమె చేసింది శూన్యం. పన్నెండేళ్లలో ఇండియాలో సంపాదించలేనిది, రెండేళ్లలో సింగపూర్‌లో సాధించొచ్చనే దురభిప్రాయం గల ఇంజనీరయిన ఆమె ప్రాక్టికల్ భర్త శామ్యూల్ సమస్య పరిష్కారంలో ప్రధాన పాత్ర అయిపోయి లాయర్ ఉనికిని బలహీనపరిచాడు.

చివరికి స్థలాభావం చేత నవల సమాప్తం చేసినట్లనిపించి అసంతృప్తిని మిగిల్చింది.

అనుమానాల ద్వారా భార్యా భర్తల

మధ్య తలెత్తే అపార్థాలకు సమకాలీన సమాజంలో కాలం చెల్లింది. ఇతివృత్తం అనుమానాల నేపథ్యంతో ముడిపడినప్పుడు, మధ్యవర్తిత్వాల రాయబారంతో అనుమానికి కను విప్పు కలిగితే రసవత్తరంగా ఉండదు. అనుమాన భూతం కబళించిన పాత్ర స్వయంగా నివృత్తి సంఘటల్నెదుర్కొని పశ్చాత్తాపాగ్ని సెగల నుండి బయటపడి సేదతీరితే కొస మెరుపు రక్తికడుతుంది.

—పుక్కళ్ళ ఆర్కే,
సికింద్రాబాద్-500 001.

## "అతి...లేదు"

*(మూడవ బహుమతి రూ: 50/– పొందిన సమీక్ష)*

'స్వర్గం మీ చేతుల్లోనే ఉంది' నవల చాలా మామూలుగా, రొటీన్‌గా అనిపించింది. భార్యాభర్తలలో ఎవరికో ఒకరికి మంచి వాళ్లు అని సర్టిఫికేట్ ఇచ్చేసి ఇంకొకరికి తాగడం, పేకాడటం లాంటి వ్యసనాలో లేదా ఈ నవలలోని కళ్యాణి పాత్రకిలా అనుమానాలో లేదా తాహతుకి మించిన కోర్కెలో ఏదో ఒకటి అంటగట్టడం చాలా నవలల్లో చూస్తూనే ఉన్నాం. ఇక వంశీ పాత్ర మంచితనం వాస్తవానికి మరీ దూరంగా ఉంది. అదీ అతను పుట్టిపెరిగిన వాతావరణాన్ని బట్టి, అతనికి అంత మంచితనం అలవడటం నవలలో మాత్రమే సాధ్యమేమో. విజయ్ పాత్ర స్వభావం కూడా రొటీన్. మొదట్లో అన్నిరకాల చెడు అలవాట్లూ ఉండి, ఆ తరువాత ఏదో ఒక సంఘటనలో పశ్చాత్తాపపడిపోయి మారిపోవడం చాలా కథలలో, ముఖ్యంగా పాత తెలుగు సినిమాలలో సాధారణంగా కనిపిస్తుంది.

రచయిత ఎంచుకున్న విషయం ఏదైనా, రచనాశైలి బావుంది. నవల మొదట్లో పెద్ద పెద్ద డైలాగ్‌లున్నా తరువాత చాలావరకు సరళంగానే ఉంది. పాత్రల స్వభావాలలో, కథలో ఎక్కడా గందరగోళం కనిపించ లేదు. కథలో కంటిన్యుటీ మెయింటెయిన్ చేయడంలో రచయిత సఫలమయ్యారనే చెప్పాలి. అంతేకాకుండా, భార్యాభర్తల మధ్య సంబంధాలు ఎలా ఉంటే బాగుంటుందో మాలతి, శామ్యూల్‌ల ద్వారా చక్కగా చెప్పారు. వాళ్ళు భార్యాభర్తలుగానే కాదు వ్యక్తులుగా కూడా ఆదర్శప్రాయులే. మాలతి పాత్ర ద్వారా చెప్పిన పాజిటివ్ థింకింగ్ అందరికీ అవసరం.

ఏ విషయంలోనైనా 'అతి'కి పోకుండా పరిస్థితులకు తగ్గట్టుగా నడచుకుంటే శామ్యూల్ పాత్ర చెప్పినట్టు, స్వర్గం ఖచ్చితంగా మన చేతుల్లోనే ఉంటుంది.

—యు. అన్వేషిణి,
హనుమకొండ

## ఉన్నత సంస్కారం

*(నాలుగవ బహుమతి రూ: 50/– పొందిన సమీక్ష)*

భార్యాభర్తల మధ్య పరస్పరావగాహన లేనప్పుడు వారి జీవితం ఎంత దుర్భరంగా వుంటుందో తెలియచెప్పే నవల ఈ 'స్వర్గం మీ చేతుల్లోనే ఉంది'

నీతీ నిజాయితీల పట్ల తనకున్న నమ్మకాన్ని వివరిస్తూ, తను అలాగే ఉంటానని చెప్పిన భర్తని మొదటినుండీ పూర్తిగా నమ్మకపోవటంవల్లనే తన కాపురం చెడగొట్టుకుంది కళ్యాణి.

వంశీకృష్ణ స్వంతంగా తయారు చేసుకున్న సూక్తుల్ని పట్టించుకోకుండా తన అవసరాన్ని బట్టి అబద్ధాలు, నిజాలు కలిపి మాట్లాడి తన జీవితం సుఖంగా గడిచేలా జాగ్రత్తపడ్డాడు విజయ్. కర్ర విరగకూడదు, పాము చావకూడదు అన్నట్లుగా నిజం చెప్పకు, అబద్ధం ఆడకు. ప్రస్తుత కాలానికి




అనుగుణంగా నడుచుకొమ్మని చెప్పిన స్నేహితుని మాటలు వినక చిక్కుల్లోపడిపోవటమే అతని కాపురంలో కలతలకు కారణమైంది. తన జీవితం ఎంత ఒడిదుడుకులతో నడుస్తున్నా ఒక్కసారి కూడా 'రాధ'ను చేసుకుని వున్నా బాగుండేది అని అనుకోని వంశీ సంస్కారం గొప్పది.

అయితే అంతా తన చిన్నాన్నలాగే ఉంటారనుకుని, కళ్లకు కనపడేదే నిజమని నమ్మేసి విడాకులదాకా వెళ్ళిన కళ్యాణిదే తప్పని అనలేం! తండ్రి అస్తమానం పోలీసు తెలివి అంటూ అన్నీ అనుమానంగా చూడటం, మాట్లాడటం బట్టి ఆమె కూడా అలాగే తయారయింది.

కులాంతరం, మతాంతరం వివాహం చేసుకుని కూడా ఒకరినొకరు పూర్తిగా నమ్మి, అర్థం చేసుకుని జీవితాలు సాగిస్తున్న శామ్యూల్, మాలతిలాంటి దంపతులు, తన వల్లనే ఇంత జరిగిందని బాధపడే విజయ్ లాంటి స్నేహితులు అరుదుగా వుంటారు. అయినా వారి ప్రయత్నంవల్లనే కథ సుఖాంతమైంది.

**–సాధనాల నాగవర్ధని,**
నూజివీడు-521 201

## అవగాహన పెంచిన రచన

*(అయిదవ బహుమతి రూ: 50/– పొందిన సమీక్ష)*

వివేకం లేని విజ్ఞానం, నమ్మకం లేని సంసారం రెండూ నిరుపయోగాలూ, చేటు కారకాలూనూ! అనుమానం పెనుభూతంగా ఎటువంటి సంబంధాన్నైనా, ఏం సంస్కారాన్నైనా ముంచెయ్యగలదు. నమ్మకం, వివేకమనే గట్టి పునాదులున్నచోట ఏ బంధపు గదులైనా గట్టిగానే ఉండగలవు. నిండాదిగా నిండుగా నూరేళ్లూ మనగలవు. అలా లేప్పుడు సంసారాలు ఎన్ని ఆటుపోట్లకు గురవుతాయో కళ్లకు బొమ్మగట్టి చూపించిన కాశీవిశ్వనాథ్ రచన "స్వర్గం మీ చేతుల్లోనే వుంది" అందరూ... చదివి అవగాహన పెంచుకునేవిధంగా వుంది.

పాత్రలు తక్కువైనా సంఘటనలు వెంట వెంటనే జరిగిపోతూ కథనం వేగంగా నడుస్తుంది. ఇందులో ఏ పాత్ర కాపాత్ర సజీవ సహజమైనవే. తాతారావు తనదైన శైలిలో జీవితంనుంచి పుట్టించే హాస్యంతో కడుపుబ్బా నవ్విస్తూ మొదలంటా ఆక్రమించుకుంటాడు కథని. కళ్యాణి అనుమాన పెనుభూతంతో వంశీకృష్ణను వెంటాడుతుంది. తాతారావు, కళ్యాణిలు ముప్పాతిక భాగం కథను నడిపించేశారు. విజయ్, మాలతి, శామ్యూల్‌లవి తక్కువ పాత్రలైనా సందర్భోచిత సముచిత స్థానాలనే ఆక్రమించారు. మాలతి-శామ్యూల్‌ల జీవనశైలి ఆదర్శనీయం. చివరగా వారు నిర్వహించిన పాత్ర అద్భుతంగా ఉండి సుఖాంతమైన ముగింపునిచ్చింది.

ఏ మాట కామాటే చెప్పుకోవాలి. కాశీవిశ్వనాథ్‌గారికి ఉన్న నాటక, సినిమా రచనల అనుభవం ఈ నవల రాయడానికి బాగా ఉపకరించింది. సన్నివేశాలు, పాత్రలు, సంఘటనల చిత్రీకరణలో ఎక్కడా తడుముకోవలసిన అవసరం లేకపోయింది. నూటికి తొంభై సంసారాలు అవగాహనా లేమి సమస్యతో బాధపడేవే కాబట్టి వివేకం, అవగాహనలతో తమ సంసారాలను సాఫీగా సాగనివ్వాలి. అందుకు అవసరమైన కమ్యూనికేషన్ సాఫ్ట్‌వేర్ అంతా ఈ నవలలో వుంది. మంచి నవలను పాఠకులకు అందించినందుకు కృతజ్ఞతలు చెప్పుకోవాలి. చాలా సంతృప్తినిచ్చింది.

**–టి. తిప్పారెడ్డి,**
మదనపల్లి-517 325



# FORM IV (See Rule 8)

Statement about ownership and other particulars of CHATURA.

| | | |
|---|---|---|
| 1. Place of Publication | : | 6-3-570, Eenadu Compound, Somajiguda, Hyderabad-500 082. |
| 2. Periodicity of its Publication | : | Monthly |
| 3. Printer's Name | : | **RAMOJI RAO** |
| Whether citizen of India | : | Yes |
| If foreigner, state the country of origin | : | - |
| Address | : | 6-3-570, Eenadu Compound, Somajiguda, Hyderabad-500 082. |
| 4. Publisher's Name | : | **RAMOJI RAO** |
| Whether citizen of India | : | Yes |
| If foreigner, state the country of origin | : | - |
| Address | : | 6-3-570, Eenadu Compound, Somajiguda, Hyderabad-500 082. |
| 5. Editor's Name | : | **RAMOJI RAO** |
| Whether citizen of India | : | Yes |
| If foreigner, state the country of origin | : | - |
| Address | : | 6-3-570, Eenadu Compound, Somajiguda, Hyderabad-500 082. |
| 6. Name and address of individuals who own the newspaper and partners or shareholders holding more than one percent of the total capital. | : | **VASUNDHARA PUBLICATIONS** 6-3-570, Eenadu Compound, Somajiguda, Hyderabad-500 082. |

I, RAMOJI RAO, hereby declare that the particulars given above are true to the best of my knowledge and belief.

Date: March 1, 2001

**for VASUNDHARA PUBLICATIONS**
**Sd/- RAMOJI RAO**
Publisher

Edited, Printed and Published by Ramoji Rao for Vasundhara Publications, Printed at Colorama Printers Pvt. Ltd., Hyderabad, Tel: 3730328. Office Address: CHATURA, Telugu Monthly, Eenadu Compound, Somajiguda, Hyderabad. Tel: Hyderabad: 3318181, 3398787; Madras: 8270434, 8251044; Vijayawada: 476685; Visakhapatnam: 552211; Tirupati: 75757; Anantapur: 33777; Rajahmundry: 79170; Karimnagar: 23216; Suryapet: 21146; Guntur: 512149; Nellore: 338734; Kurnool: 52122; Srikakulam: 26060; Cuddapah: 70011; Tadepalli gudem: 28881; Warangal: 59933.






priya